# సమీక్షణం

( సమీక్షా సంకలనం )

ఆచార్య కొలకలూరి ఇనాక్

విశ్వవిద్యాలయాధ్యక్షులు

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

అనంతపురం - 515 003.

ప్రచురణ :

జ్యోతి గ్రంథమాల

129, తపోవనం నగర్

అనంతపురం - 515 004.

SAMEEKSHANAM : A collection of reviews by Prof. KOLAKALURI ENOCH, Professor of Telugu & Principal S. K. University, Anantapur - 515 003.



వెల : రూ. 45/-

ప్రచురణ :
జ్యోతి గ్రంథమాల
129, [illegible] నగర్
అనంతపురం - 515 004.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడా
హైదరాబాదు - 500 029.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం చేసిన తెలుగు విశ్వవిద్యాలయానికి రచయిత కృతజ్ఞుడు.

# నివేదనం

'సమీక్షణం' సమీక్షల సంకలనం. సమీక్షా సమయం 1962-69 మధ్యకాలం. ఇవి కవిత్వ, నాటక, నవల, కథానిక, వ్యాసాది ప్రక్రియల గ్రంథాల సమీక్షలు. వీటిని ప్రచురించిన పత్రికలు భారతి, ఆంధ్ర పత్రిక, ఆంధ్ర వారపత్రిక, ఆంధ్రప్రదేశ్. ఇందుకు ప్రోత్సహించిన వాళ్ళు కీ.శే. శివలెంక శంభుప్రసాద్‌గారు, శ్రీ శివలెంక రాధాకృష్ణగారు. ఈ సంపాదకులకు ధన్యవాదాలు.

నాయీ సమీక్షలు రవి, రాణి, మనోరాణి పేర్లతో వెలువడ్డాయి. ఒక ఆలోచన సూత్రంగా కొన్ని సమీక్షలు ఒక వ్యాసంగా రూపొందాయి. ఒక వ్యక్తి భిన్నరచనల సమీక్షలు కూడా ఒకచోట చేరాయి. ప్రముఖుల ప్రసిద్ధ రచనల సమీక్షలు సమకూడాయి.

సమీక్షలు గ్రంథ పరిచయం చేయవచ్చు విమర్శించవచ్చు. అవగాహనకు దోహదం చేయవచ్చు. పాఠకుడికి గ్రంథం పట్ల ఆసక్తి కలిగించటమే సమీక్ష ప్రయోజనం. సమీక్ష గ్రంథం చదివించగలిగితే శ్రేయస్కరం. అందువల్ల గ్రంథ సారాంశం ఈ సమీక్షల్లో సాధారణంగా ఉండదు గ్రంథ విషయం అవసరమయినంతవరకు సమీక్షలో లభిస్తుంది. గ్రంథస్థాయిని బట్టి సమీక్షస్థాయి ఉంటుంది.

ఒక గ్రంథంమీద ఆరంభంలో ఆవిర్భవించిన ప్రాథమిక పరీక్ష సమీక్ష ఆధునిక సాహిత్యం పట్ల ఆసక్తి పెరుగుతున్న తరుణంలో అవసరమే! సమీక్షలు ప్రాథమికంగా పరిచయ పరిమితాలు. అనంతరం, అవి పక్ష ప్రదర్శకాలూ కావచ్చు. ప్రాధిక్య ప్రదర్శకాలూ కావచ్చు. ప్రాముఖ్య నిరూపకాలూ కావచ్చు సమీక్షలు విమర్శక పరిశోధకులకు అర్థదృష్టి ఏర్పడటానికో స్థిరపడటానికో, సాహిత్యలక్షణం ఘనీభవించటానికో, ద్రవీభవించటానికో, తోడ్పడవచ్చు. ఒక సారస్వతం అవగాహనకో, ఆలోచనకో, విమర్శనకో, పరిశోధనకో, సమీక్షణం ఉపయోగపడితే, అది నిజంగా సదవకాశం.

అనంతపురం
2-5-1987

కొలకలూరి. ఇనాక్.

# సూచి

# 1. నేటి నవలల్లో సంసార జీవితం

1. తెలుగు నవలా సాహిత్యంలో నేడిది విశాలంగ వ్యాప్తి పొందుతూ వుంది. కుటుంబ జీవన మాధుర్యం అభివ్యక్తమవుతూ వుంది. నవలా రచయితలు, రచయిత్రులు తాము దర్శించిన జీవన తీరాలు చిత్రిస్తున్నారు. నేటి నవలల్లో కళాశాల యువత వస్తువుగా వుంది. అవ్యవస్థిత యువకాలోచనలు, చేష్టలు ఈ సాహిత్యంలో రూపం దిద్దుకొంటున్నాయి.

శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం 'మజిలీ' ఈ కళాశాల యువతీయువకుల జీవిత విధానం చిత్రిస్తూ ఉంది.

ప్రయివేటు కాలేజీలలో, అందులోనూ సహవిద్య వున్న వాటిలో, విద్య అసామాన్యంగా వుంటుంది. కొన్ని "కళ్యాణ మంటపాలు" కావటం అనేది పూర్తి సత్యం కాకపోయినా యువతీయువకుల అవగాహనకు అవకాశం కలిగిస్తాయి.

మూడు నెలల క్రితంనాటి విద్యార్థి, తదనంతరం లెక్చరర్ అయి, విద్యార్థినీ విద్యార్థులను చూచి, తన ఉనికి గ్రహించేసరికి పట్టే కాలంలో ఇట్టే కొన్ని కొన్ని అవకతవకలు జరిగిపోతాయి. అది చిత్రించే నవల 'మజిలీ'. ఆ దశ దాటడమే 'మజిలీ'.

శ్యామసుందర్ వంటి అధ్యాపకులను ఆదరంగా పలకరిస్తూ ప్రకాశకులు పలికిన పలుకుల్లో సానుభూతి సవ్యంగా ఉంది. శ్యామసుందర్‌లో ఎక్కడలేని గొప్పతనం చొప్పించిన రచయిత, ఒక విద్యార్థి ఆధారంగా చక్రపాణి పాత్ర సృష్టించాననటంతో శ్యామసుందర్ ఆత్మ వెనుక రచయిత ఆత్మ వుందనిపిస్తుంది.

శ్యామసుందర్ యువకుడు తెలుగు లెక్చరర్. పెళ్ళి కాలేదు. పెళ్ళి వినా జీవితం పరిశోధిస్తున్నాడు. పరిశోధన ఫలితం శారద. ఎటువంటి సమ్మోళయినా ఆపుజేయించగలదు. గొప్పగా పాఠం చెబుతాడు. ప్రిన్సిపాల్‌తో సత్సంబంధా లున్నాయి. శ్యామ్‌సుందర్ దీ పేట్టో ప్రిన్సిపాల్. శారదను ప్రేమించాడో, లేదో తెలియదు. అదే అవ్యవస్థ. కథలు రాసేడు. ఆమె ఫెయిర్ చేసింది. పత్రికలో ప్రచురణ! నవల-ఫెయిర్-ఒప్పుమతి-శారదకు అంకితం. పరిస్థితి ఏడింది. శారద దూరమయింది. ఉద్యోగం పోయింది. నవల సినిమా తీయబోతున్నారు. పత్రికలో ఉపసంపాదకుడుగా ఉద్యోగం. మద్రాసు ప్రయాణం. అదే 'మజిలి'. మర్కే కథ లేదు.

విజయవాడ వంటి పట్టణంలో రెండో వారం కూడా ఆడని తెలుగు సాంఘిక సినిమాలో హీరోలాగా వుంటాడు శ్యామ్‌సుందర్. అన్నీ మంచి గుణాలు లకనికే వున్నాయి. అంత అసహజంగానూ ఉందా పాత్ర.

శారద పాత్ర అలా లేదు. ఆమె శామ్‌సుందర్‌కు అర్థంకాలేదు. ఏటో! రచయిత, ఓటో పాఠకులు. అందుకే ఆసక్తి! ఆమె అత్త దగ్గర పెరిగింది. విద్యార్థినిగా శ్యామ్‌సుందర్‌కు పరిచయం అయ్యింది. బావ పరిచర్య-బాధ్యత-వదులుకోలేక, శ్యామ్‌సుందర్‌తో సవ్యంగా ప్రవర్తించలేక చీకాకుపడి, చీకాకు కలిగించిన పాత్ర శారద. సహజరేఖా మాత్రంగా కనిపించేది శారద మనస్తత్వంలోనే.

జగన్ పాత్ర పట్ల సానుభూతి కలుగుతుంది. జగన్ పట్ల శారద పెంచు కొన్న అనుబంధానికి, విధి వంచిత బాధ్యతకు పూర్వరంగం, స్థాపన పటిష్ఠం కావు.

ప్రయివేటు కాలేజీలో కమిటీ మెంబర్ల వల్ల అధ్యాపకులు, ప్రిన్సిపాల్ పొందే కష్టాలు వాస్తవంగా వున్నాయి.

విద్యార్థులలో క్రమశిక్షణా రాహిత్యానికి ప్రత్యక్షంగా నవలలో కారణాలు లేవు. పరోక్ష కారణాలు సమగ్రంగా లేవు. ఎందరు విద్యార్థులో అన్ని రకాల కారణాలు. క్రమశిక్షణ లేని కాలేజీలను మూపెట్టే ప్రయత్నంలో రచయిత కార్యసిద్ధి పొందినట్టే.

ఈ రచనలో కొందరు అధ్యాపకులు గ్రాంథికంలో మాట్లాడుకొంటారు. అందులో తప్పేం లేదు. ఏ విధమయిన సంభాషణ రచనలో ఔన్నత్యం సాధించలేదు. యువకుల అవ్యవస్థ స్థితికి 'మజిలీ' ఉదాహరణ.

2. యువకుల ఆశలు విఫలం కావటం, కోర్కెలు తీరకపోవటం, జీవితం అనూహ్య పరిణామాలకు లోనైపోవటం, ఒక విధంగా యథార్థం, మరో విధంగా అసహ్యం. వియోగ వ్యథాదగ్ధ జీవిత ప్రాంగణాల బూడిద, ఏ గాలి తోలి ఏదిక్కు చూచుకొన్నా, కొందరు యువకులు ఈ గందరగోళంలో చిక్కుకోరు. వాళ్లు సంఘోపకారక కార్యక్రమ నిర్వహణలో భాగం పంచుకొంటారు. సాధ్యమయింది సాధిస్తారు.

సంఘంలోని పీడితుల్ని, పీడకులనుంచి రక్షించాలని తాపత్రాయపడే యువకుడు శ్రీ హితశ్రీ 'సామాన్యుడి కామన'లో సాక్షాత్కరిస్తాడు. 'మజిలీ' లోని యువకుణ్ణి శృంగారం లాక్కుపోతే, 'సామాన్యుడి కామన' లోని యువకుణ్ణి సామాజికావసరం తీసుకుపోయింది. ఈ యువకుడు జాతి చేతనకు జీవం. సాహిత్యంలో ప్రాణం.

ఈ నవలలో పాఠకులను ఆకర్షించే అంశాలు ఎక్కువ. కథ బలమైంది. సన్నివేశం పైన సన్నివేశం, సంఘటన పైన సంఘటన, చకచకా సాగిపోతాయి. కథలో వేగం వుంది. అనూహ్యమైన పరిణామాలవల్ల కథా గమనంలో ఉత్కంఠ రేకెత్తించే లక్షణం వుంది.

పాత్రలు సహజమైన వాతావరణంలో వాస్తవికంగా పుట్టి పెరిగినట్లున్నాయి. కృత్రిమత్వం, కృతకత్వం పాత్ర చిత్రణలో లేదు. అన్ని పాత్రలు కళ్ళకు కట్టెదుట నిలబడి కనబడతాయి.

సమ్మెలు, అల్లరులు, సమకాలీన సమస్యలు, వాటికొక రూపం కల్పించిన ఈ నవల, కథ సంతరించి మర్చిపోనీకుండా పాఠకులను వెంటాడుతుంది.

ఆనందరావు సామాన్యుడు. నవలలో చాలా పాత్రలు ఆ పాత్రను ఆలాపిస్తాయి. అతడు సామాన్యుడే అయినా అసామాన్యుడులాగా, మాన్యుడులాగా గోచరిస్తాడు. సామాన్యుడయిన ఆనందరావు కోర్కెను చెప్పడానికి నవలకు పేరు పెట్టినట్లు కనిపించినా, లోకంలోని సామాన్యులైన ప్రజల కోర్కెకు ప్రతీకగా నవల నామధేయం భాసిస్తుంది.

ఎంతో ధైర్యం వున్నట్లు కనిపించే ఆనందరావులో అధైర్యం వుందా అనిపిస్తుంది. ఆ కోణంలో చూస్తే ఆ విషయం బలం పుంజుకొన్నట్లు తోస్తుంది. ఆనందరావు ఆవేశం పోలీసు మీద తిరగబడేటట్లు చేసిందో, అధైర్యం ప్రేరేపించిందో చెప్పటం కష్టం! అంతా అంత అకస్మాత్తుగా జరిగింది. అధర్మం, అక్రమం ఎక్కడున్నా అతడు సహించలేడు. అందుకే ఎవరికీ కాకుండా పోతున్నట్టు కనిపిస్తాడు.

రామ్మూర్తి, దేవేంద్రరావు, గోపాలరావు చదువుకొన్నవాళ్లే అయినా, సహజమేమో, స్వార్థపరులు.

శ్రీనివాసరావు స్వార్థపరుడుకాడు, స్వార్థపరుడిలాగా, ఇతర స్వార్థపరుల చేత చిత్రించబడ్డాడు. మంచివాడే అయినా శ్రీనివాసరావులో మంచితనం వంచన చేసి, అతన్ని స్వార్థపరుణ్ణి చేసింది. స్వార్థపరులు 'కీ' తిప్పితే నడిచిన సమ్మె, మంచి మనిషిని ఎంత తొందరగా, తాత్కాలికంగానయినా-చెడ్డవాణ్ణి చేయవచ్చో ప్రత్యక్షంగా నడుస్తున్న కథలో పాఠకులు చూస్తారు.

రేఖ అమాయిక. చదువు పూర్తయింది. చంద్రికపాట కాదనలేదు. తనకు తెలియకుండా ఆనందరావు మీద పెరుగుతున్న ప్రేమను స్పష్టంగా గ్రహించలేదు.

గీత ప్రేమించిన వ్యక్తికి హృదయం అర్పించగల మానిని. అవతలి వ్యక్తికి ఎంత కష్టం కలుగుతుందో ఊహించకుండా, తనకోసం, అతన్ని ప్రార్థించి, ఆ ప్రార్థన అంగీకరించిన అతడు, చంద్రయ్యకోసం, తన కోసం, చంద్రయ్యవల్ల జైలుకెళుతూ నోరు విప్పలేదు. కాగితం చూపలేదు.

పద్మ, అమ్మానాన్నలవంటి అన్నకూ, అనురాగం కుమ్మరించే కలవారి బిడ్డ గోపాలరావుకూ, మధ్య ధర్మతాడిత అయి, ఎవరినీ కాదనుకోలేక, ఎవ్వరికీ కష్టం కలిగించలేక అన్న వాక్కును అన్ని విధాలా పరిపాలించి, ఆత్మీయుని అనురాగం పొందిన అమాయిక.

నవలలోని అన్ని పాత్రలు పాఠకుల మనఃఫలకంలో చక్కగా ముద్రితమయిపోతాయి. రామ్మూర్తి మేధావి అని రచయిత అభిప్రాయం. కొందరు మేధావులు క్రూరులే అయినా అంత రేకిగా క్రూరత చూపించుకోరేమో! కారును తగులబెట్టింది ఆనందరావు అని అంత తొందరగా, తేలికగా, ఎలా నమ్మగలిగాడో శ్రీనివాసరావు అర్థంకాదు. దేవేంద్రరావు అవసరానికి ఉపయోగపడే పాత్ర అయ్యాదేకాని, గమ్యం ఏమిటో స్పష్టం కాలేదు. ఆనందరావును ఊరేగించటం, అంతలోనే త్యజించటం, 'క్యారియర్' తేగానే ఆ సమ్మెచేసే వాళ్లు 'జై' అనటం వింతగా వుంటుంది.

రేఖ కోసం, ఆనందరావు సమ్మెను విచ్ఛిన్నంచేస్తున్నాడన్న సత్యం ఏదో స్థాపించబోయి, దాని పూర్వరూపం ఊహించకుండా ఉత్తమూహతోనే ఎందుకు ఆపవలసి వచ్చిందో ఊహించదు.

కార్మికులు ఎంతో అన్యాయం జరిగితే తప్ప సమ్మెలకు పూనుకోరు. అయితే ఈ నవలలో మంచివాడికి వ్యతిరేకంగా చెడ్డవాళ్ళ ప్రోద్బలంతో కార్మికులు సమ్మె జేశారు. అది సాధారణంగా జరుగుతుందని అనుకోలేము.

అల్పమైన వ్యతిక్రమణలు మాటకేంగానీ,బలమైన కథతో, చక్కని పాత్ర సృష్టితో, సంశుద్ధ సమస్యతో సాగిన 'సామాన్యుడి కామన' యువకులకు సముచిత జీవనమార్గ గమనం చూపుతుంది.

3. ఆర్థిక వ్యత్యాసాలు సమానతకోసం యువకుణ్ణి ప్రయత్నించేటట్లు చేస్తాయని తలంచటం సామాన్యం. పీడింపబడే వర్గం పీడకుణ్ణి ఎదుర్కొనడం లేదు. పైగా పారిపోతూ వుంది. పీడనను తిరస్కరిస్తూ వుంది. పీడితులకంటే సానుభూతిపరులు, ఆర్థికంగా లేని యువకులు ఆర్థిక సమానత్వంకోసం ఆందోళన చేయకపోగా, కృషి చేయకపోగా యౌవనం కారణంగా ప్రేమ జీవితం ప్రారంభించటం, లేకపోవటమేం, ఉంది.

శ్రీ హరికిషన్ 'అదృష్ట చక్రం'లో అదృష్ట విహీనులు ఆర్థికంగానూ, హార్దికంగానూ లేనివాళ్ళు కావటం జాగరూకంగా చిత్రించాడు. ఉన్నింటి పిల్లల్ని లేనింటి పిల్లవాళ్ళు ప్రేమిస్తే ఏంలేదు కానీ పెళ్ళాడితే అది ఆర్థిక సమానత్వంగా భావించటంలో ఔచిత్యం పరిశీలించవలసి వుంటుంది.

ఈ నవల సామాజికమయింది. సంశుద్ధ వైవిధ్యం సందర్శించింది.

ఈశ్వరరావు ధనవంతుడు. సత్యవతి ఒక్కతె కూతురు. అల్లారుముద్దుగా పెంచుకొంటున్నారు. మంజుల ఈశ్వరరావు ఉంపుడుగత్తె. నిర్మల ఆమె కూతురు. సత్యవతి, మంజుల దాదాపు ఒకే వయసువాళ్ళు. వాళ్ళకంటే కొంచెం పెద్దవాడు అభిమన్యు. అతని తల్లి బీద మనిషి. వైద్య సదుపాయం లేక చని పోయింది. రామదాసూ, కబీరుదాసూ అభిమన్యుకంటే కొంచెం పెద్దవాళ్ళు. పాటలు పాడి వచ్చిన ధర్మంతో బ్రతుకుతున్నారు. తల్లిలేని పిల్లవాణ్ణి, అభిమన్యును కబీరుదాసూ, రామదాసు చదివించటం ప్రారంభించాడు. చదువుకొనే బాలు లిద్దరికి చదువుకొనే బాలికలిద్దరితో పరిచయం కలిగింది.

పిల్లలు పెద్దవాళ్ళౌతారు. చివరికి రంగస్థలం మద్రాసు మారుతుంది. సుధారాణి రంగస్థలం ప్రవేశం చేస్తుంది. కథ నాటకీయంగా మలుపులు తిరుగుతుంది. చివరికి విషాదాంతం.

ఆర్థికమయిన ఒత్తిడులను యవ్వనం ఏ విధంగా పరిష్కరిస్తుందో, స్త్రీ పురుషానురాగం మధ్య అంతస్తుల అంతర్యం ఏవిధంగా క్రుంగిపోతుందో వివరిస్తుందీ నవల.

పాఠకుల ఊపిరితో ప్రశ్న వేయగల సామర్థ్యం ఉన్న పాత్రలు కబీరుదాసు - సుధారాణి - రామదాసు - సత్యవతి. సత్యవతిపట్ల దిగులు, రామదాసు పట్ల దుఃఖం కలుగుతాయి. కోమల హృదయుడైన కబీరుదాసు, సంగీత సామ్రాజ్యంలో మైమరచిపోయేవాడు, చేయి చేసుకోగలిగినంత కఠినుడా అనే ప్రశ్న కలక్కపోదు.

సత్యవతి ఆస్తిని తెలిసి, తెలిసి దోచుకోగలిగిన సుధారాణి, ఆస్తిని తిరిగిచ్చేంత ఉదాత్తత కనబర్చటం అసహజం కాకపోతే, సత్యవతి తిరస్కరించటం సహజం కాకుండా ఎలా ఉంటుంది? కబీరుదాసు కున్నంత మానసిక చాంచల్యం అందరికీ ఉండకపోవచ్చు గానీ, సుధారాణిలో అంత హార్దిక ఔన్నత్యం వుండటం విచిత్రమే. ఆర్థిక సమాజం, హార్దిక మానవుణ్ణి - పైగా యువకుణ్ణి తీర్చి దిద్దటంలో చూపే నేర్పు గమనార్హం.

4. ప్రపంచ వ్యాప్తంగా వివాహ వ్యవస్థ పునాదులు సడలిపోతున్నాయి. ఇందులో రోజు రోజుకీ పరిణామం సంభవిస్తూ వుంది. అది సహజం. భారత దేశ జీవితాన్ని ప్రాచీన సంప్రదాయ జీవితం నడిపిస్తూ వుంది. ఆంధ్ర జాతి ఆ వారసత్వ ప్రభావంతో బ్రతుకుతూ వుంది. ఇది నిజం.

వివాహ విధానంలో మార్పు రావాలని కోరుతున్న యువతరం గత తరంతో ఏ విధంగా సమన్వయం పొందుతుందో గమనించాలి. గతం వర్తమా

నాన్ని శాసిస్తుందా? వర్తమానం గతాన్ని తిరస్కరిస్తుందా? ప్రశ్నలుగానే వుంటున్నాయి. మతాంతర, వర్ణాంతర వివాహావశ్యకతను మేధావి వర్గం ఎలుగెత్తి చాటుతూ వుంది. కవులు, రచయితలు సాహిత్యం సృష్టిస్తున్నారు. యువకులు ఆచరిస్తున్నారు. సంప్రదాయ వివాహాల మీద ప్రయోగం జరుగుతూవుంది. సరికొత్త వివాహాలు సామాజికామోదం పొందుతున్నాయి. శ్రీ మహీధర రామమోహనరావు 'స్వయంవరణం' వివాహ విధానంలోని మార్పును వాంఛిస్తూవుంది.

మన దేశంలో ఏ విషయం అధికారికంగా చెప్పాలన్నా రాజకీయ నాయకులే చెప్పాలి కదా! శంఖంలో పోస్తే కాని, తీర్థం కాదుకదా! అందువల్ల రాజకీయజ్ఞులు ఏమన్నారూ అంటే, వర్ణాంతర ప్లస్ కులాంతర ప్లస్ మతాంతర వివాహాలు బెస్ట్ అన్నారు. అందువల్ల దేశంలో సామూహిక సామాజికతత్వం వచ్చి తీరుతుంది అన్నారు గదా! అంతవరకు అది మంచిదే!

కాగా పోగా, పూర్వం నుంచి మన దేశంలో వున్న వివాహ వ్యవస్థ మారి పోతే, మహా బేషుగ్గా, చులాగ్గా, మరీ తేలిగ్గా సమస్యలు సమసిపోతాయి. పరిష్కారమౌతాయి అంటూ నమ్ముతున్నారు గదా! శుభమస్తు.

ఆ విషయం చెప్పాలనే ఈ నవల ఉద్దేశం. ఈ విషయం గూర్చి చాలా మంచి సాహిత్యం సృష్టించారు. పల్లం పూడిపోయి మెరక కావడానికి ఎవరు నమ్మిన ధోరణిలో వాళ్ళు తలా ఒక రాయివేస్తే ఏ నాటికైనా సమాజం సమతలానికి రావచ్చుగదా! ఈ నవల ఆ పల్లం పూడ్చే ఉద్దేశ్యంతో రచయిత చేసిన ప్రయత్నం. నవల ప్రారంభం నుంచి, దాదాపు సగందాకా సాగిన సిద్ధాంత వాదనలు, తాత్విక దృష్టి వున్నవాళ్ళకు నచ్చుతాయి. సామాన్య పాఠకులకు నచ్చకపోవచ్చు. మిగతా సగం అందరికీ నచ్చుతుంది. ఎందుకంటే అది నవల కాబట్టి. కథతో పటుత్వం కంటే రచయిత భావనాశక్తి ఎక్కువ. సామాన్యమైన ఇతివృత్తం మీద రచయిత సామర్థ్యం అల్లుకుపోతుంది. ప్రతిధ్వానితమైంది కాదు, వ్యుత్పత్తి సహితమైన రచన.

వర్ణాంతర వివాహాలు రచయిత చేయటమే కాని, జరిగింపి చిత్రించినట్లు లేదు. పెద్ద వయసువాళ్ళ మాటల తీరు బాగా చిత్రించబడినట్లు, స్వరూప స్వభావాలు ఆకళింపు చేసుకొని వర్ణించినట్లూ పాఠకులు గమనిస్తారు. ఇది లక్ష్యోన్ముఖ రచన. జీవితోద్దిష్టరచన కాదు. ఉత్తమ లక్ష్యానికి, చిత్తశుద్ధి తోడైనట్టే సాహిత్యశోభ సమకూరి ఉంటే ఇది సంఘ చైతన్య మార్గంలో ప్రయాణం చేసి ఉండేది.

5. వివాహం మనుష్యులకు క్రమశిక్షణ. పెళ్ళి సామాజికావసరమే కాదు, స్త్రీ, పురుషుల శారీరకావసరం. దాంపత్యం రెండు పరీక్షలకు-సంఘం-శరీరం-తట్టుకొని నిలుస్తుంది. సంఘం దృష్టిలోని దాంపత్యం శారీరకం కాకపోవచ్చు. శారీరక దాంపత్యం సంఘం దృష్టిలో పెళ్ళి కాకపోవచ్చు. వైయక్తికం, సామాజికం అయిన వివాహ జీవితంలో ప్రాధాన్యం సమాజంవైపు మొగ్గటం సంప్రదాయం. అది అంగీకృతం కావాలా తిరస్కృతం కావాలా, అన్నది ప్రశ్న.

దీనికి సమాధానం ఆలోచించే అవకాశం శ్రీ పి. వి. కృష్ణమూర్తి 'బంధమూ-అనుబంధమూ' వల్ల కలిగింది. సమాధానం తక్షణం సమన్వయ పూర్వకంగా లభించకపోయినా ఆలోచన కలిగించటమే నవల అవధి.

దయానిధి బంధం సుశీలతో, అనుబంధం శ్రీలేఖతో ఏర్పాడ్డాయి. దయకు ఆలవాలమైన దయానిధి కొంత నిర్దయ చూపడంవల్ల నవల విషాదాంతం అయింది.

సుశీలకూ, దయానిధికి పెళ్ళి జరగవలసిందికాదు. ఆమె చేసిన తప్పు పసివాడి రూపంలో గర్భస్థం కాకపోతే, ఆమె దయానిధి భార్య అయ్యేది కాదు. అతనామెను క్షమించలేకపోయాడు. క్షమించమని ఆమె యాచించలేదు.

తను చేసిన పని దయకు తగింది కాదనే నమ్మకం అయినా వుండవచ్చు. లేదా, తను చేసింది అనుచితం కాదని అయినా అనుకొని వుండవచ్చు. అందుకే స్త్రీ అర్థం కాదంటారు. సుశీల! మరి స్త్రీ.

నాన్ని శాసిస్తుందా? వర్తమానం గతాన్ని తిరస్కరిస్తుందా? ప్రశ్నలుగానే వుంటున్నాయి. మతాంతర, వర్ణాంతర వివాహావశ్యకతను మేధావి వర్గం ఎలుగెత్తి చాటుతూ వుంది. కవులు, రచయితలు సాహిత్యం సృష్టిస్తున్నారు. యువకులు ఆచరిస్తున్నారు. సంప్రదాయ వివాహాల మీద ప్రయోగం జరుగుతూవుంది. సరికొత్త వివాహాలు సామాజికామోదం పొందుతున్నాయి. శ్రీ మహీధర రామమోహనరావు 'స్వయంవరణం' వివాహ విధానంలోని మార్పును వాంఛిస్తూవుంది.

మన దేశంలో ఏ విషయం అధికారికంగా చెప్పాలన్నా రాజకీయ నాయకులే చెప్పాలి కదా! శంఖంలో పోస్తే కాని, తీర్థం కాదుకదా! అందువల్ల రాజకీయజ్ఞులు ఏమన్నారూ అంటే, వర్ణాంతర ప్లస్ కులాంతర ప్లస్ మతాంతర వివాహాలు బెస్ట్ అన్నారు. అందువల్ల దేశంలో సామూహిక సామాజికత్వం వచ్చి తీరుతుంది అన్నారు గదా! అంతవరకు అది మంచిదే!

కాగా పోగా, పూర్వం నుంచి మన దేశంలో వున్న వివాహ వ్యవస్థ మారిపోతే, మహా బేషుగ్గా, చులాగ్గా, మరీ తేలిగ్గా సమస్యలు సమసిపోతాయి.పరిష్కారమౌతాయి అంటూ నమ్ముతున్నారు గదా! శుభమస్తు.

ఆ విషయం చెప్పాలనే ఈ నవల ఉద్దేశం. ఈ విషయం గూర్చి చాలా మంచి సాహిత్యం సృష్టించారు. పల్లం పూడిపోయి మెరక కావడానికి ఎవరు నమ్మిన ధోరణిలో వాళ్ళు తలా ఒక రాయివేస్తే ఏ నాటికైనా సమాజం సమతలానికి రావచ్చుగదా! ఈ నవల ఆ పల్లం పూడ్చే ఉద్దేశ్యంతో రచయిత చేసిన ప్రయత్నం. నవల ప్రారంభం నుంచి, దాదాపు సగందాకా సాగిన సిద్ధాంత వాదనలు, తాత్త్విక దృష్టి వున్నవాళ్ళకు నచ్చుతాయి. సామాన్య పాఠకులకు నచ్చకపోవచ్చు. మిగతా సగం అందరికీ నచ్చుతుంది. ఎందుకంటే అది నవల కాబట్టి. కథలో పటుత్వం కంటే రచయిత భావనాశక్తి ఎక్కువ. సామాన్యమైన ఇతివృత్తం మీద రచయిత సామర్థ్యం అల్లుకుపోతుంది. ప్రతిభావంతమైంది కాదు, వ్యుత్పత్తి సహితమైన రచన.

వర్ణాంతర వివాహాలు రచయిత చేయటమే కాని, ఆదరింప చిత్రించినట్లు లేదు. పెద్ద వయసువాళ్ళ మాటల తీరు బాగా చిత్రించబడినట్లు, స్వరూప స్వభావాలు ఆకళింపు చేసుకొని వర్ణించినట్లూ పాఠకులు గమనిస్తారు. ఇది లక్ష్యోన్ముఖ రచన. జీవితోద్దిష్టరచన కాదు. ఉత్తమ లక్ష్యానికి, చిత్తశుద్ధి తోడైనట్టే సాహిత్యశోభ సమకూరి ఉంటే ఇది సంఘ చైతన్య మార్గంలో ప్రయాణం చేసి ఉండేది.

5. వివాహం మనుష్యులకు క్రమశిక్షణ. పెళ్ళి సామాజికావసరమే కాదు, స్త్రీ, పురుషుల శారీరకావసరం. దాంపత్యం రెండు పరీక్షలకు-సంఘం-శరీరం-తట్టుకొని నిలుస్తుంది. సంఘం దృష్టిలోని దాంపత్యం శారీరకం కాకపోవచ్చు. శారీరక దాంపత్యం సంఘం దృష్టిలో పెళ్ళి కాకపోవచ్చు. వైయక్తికం, సామాజికం అయిన వివాహ జీవితంలో ప్రాధాన్యం సమాజంవైపు మొగ్గటం సంప్రదాయం. అది అంగీకృతం కావాలా తిరస్కృతం కావాలా, అన్నది ప్రశ్న.

దీనికి సమాధానం ఆలోచించే అవకాశం శ్రీ పి. వి. కృష్ణమూర్తి 'బంధమూ-అనుబంధమూ' వల్ల కలిగింది. సమాధానం తక్షణం సమన్వయ పూర్వకంగా లభించకపోయినా ఆలోచన కలిగించటమే నవల అవధి.

దయానిధి బంధం సుశీలతో, అనుబంధం శ్రీలేఖలో ఏర్పాటైనాయి. దయకు ఆలవాలమైన దయానిధి కొంత నిర్దయ చూపటంవల్ల నవల విషాదాంతం అయింది.

సుశీలకూ, దయానిధికీ పెళ్ళి జరగవలసిందికాదు. ఆమె చేసిన తప్పు పసివాడి రూపంలో గర్భస్థం కాకపోతే, ఆమె దయానిధి భార్య అయ్యేది కాదు. అతనామెను క్షమించలేకపోయాడు. క్షమించమని ఆమె యాచించలేదు.

తను చేసిన పని దయకు తగించి కావచ్చే సమ్మతం అయినా వుండవచ్చు. లేదా, తను చేసింది అనుచితం కాదని అయినా అనుకొని వుండవచ్చు. అందుకే స్త్రీ అర్థం కాదంటారు. సుశీల! మరి స్త్రీ.

శ్రీరేఖ వేశ్య కూతురే అయినా అభిజాత్యం కల సర్తి. దయానిధిని పూర్తిగా, మనస్ఫూర్తిగా ప్రేమించింది. ప్రేమించిన వ్యక్తికి సర్వాత్మనా సమర్పించుకొంది. కష్టాలు పడింది. ప్రజల సానుభూతి దోచుకుంది.

దయానిధికి నిజమైన భార్య ఎవరు? తాళికట్టిన భార్య సుశీల! దాంపత్యం కలిగిన భార్య శ్రీరేఖ. శ్రీరేఖ మెళ్ళో మంగళ సూత్రం కట్టలేదు దయానిధి. సుశీలతో దాంపత్య జీవితం ఒక్క క్షణం కూడా అనుభవించలేదు.

ఎవరయినా శ్రీరేఖ, దయానిధి భార్య అని అంగీకరిస్తారు. అయితే కోర్టు అంగీకరించదు. శ్రీరేఖ నటనా సామర్థ్యంతో ఆర్జించిన డబ్బుకు వారసురాలైంది సుశీల. శ్రీరేఖ పిచ్చిదైంది.

దయానిధి ఒక రకంగా పిరికివాడు. తప్పటడుగు వేసిన భార్యను, కాదంటే మేనమామ కూతుర్ని క్షమించలేకపోయాడు. క్షమిస్తే అతనికి కష్టం లేదు. శ్రీరేఖను మంచిగా చెప్పి పెళ్ళి చేసుకోలేకపోయాడు. కనీసం, జాయింట్ అకౌంట్ అయినా లేకుండా తన పేరిట దాచుకొన్నాడు. తెలుసుకోకుండా ఆమెను దోచుకొన్నాడు.

రచయిత దాంపత్య విషయంలో తేడా చెప్పాలనుకొని చేసిన ప్రయత్నంలో కొంతవరకు కృతకృత్యత కలిగివున్నా, పూర్తిగా నెరవేరిందని, పరిపూర్ణంగా లక్ష్యం సాధింపబడిందని చెప్పే అవకాశం లేదు. శ్రీరేఖ వేశ్య కాకపోయినట్లయితే ప్రతిపాదనలో బలం వుండేది.

దయానిధి మదనపల్లె శానిటోరియంలో వున్నప్పుడు, శ్రీరేఖ ఒంటరిగా మద్రాసులో వున్నప్పుడు చిత్రపరిశ్రమలో వచ్చిన కుటిలమైన మార్పులు, బాలచంద్ర ధోరణి, ఆపైన వచ్చిన పరిణామాలూ, కథా గమనంలో పతాకస్థాయి పాఠకులకు బాధ కల్గిస్తాయి. వాళ్ళు ఉత్సుకతతో ఊగిపోతారు

గోపాలరావు వంటి మిత్రులు అరుదు. నవలలో సహజమే. అంతమంచి మనుష్యులు లోకంలో వుంటే ఎంత మంచి సినిమా పిచ్చివాళ్ళు బాగుపడి వుండేవాళ్ళు. భావన్నారాయణ కారణంగా శ్రీరేఖ శేషజీవితంలో రాబోయి ఆగి పోయిన మార్పు నవలకు మంచి ముగింపు. దాంపత్య జీవితంమీద సక్రమదృష్టి కలిగించుకోవటానికి ఈ మంచిమార్గం ఏర్పడటం అవసరమే!

6. పెళ్ళి చేంతురో నామ మాత్రంగానే భార్య అయిన స్త్రీకి కొన్ని హక్కులు, రక్షణలు వున్నాయి. అవి లేకుండా అన్ని అందాలా భార్య అయిన స్త్రీ అరక్షిత. అవంక్షిత. అయితే ఏమున్నా లేకున్నా తాళిబొట్టు కట్టేసిన భార్యకు అది బంధంగా వుంటుంది. తాళి కట్టని స్త్రీ భార్యగానే వున్నా తప్పించుకొనే స్వేచ్ఛ కలిగించే అవుతుంది.

తాళిబొట్టు ఒక విచిత్ర శక్తి స్వరూపంగా మారింది. పదార్థానికి ప్రాధాన్యంపోయి సంకేతం ప్రాధాన్యం సంతరించుకొంది. భర్తృ సుఖం లేని స్త్రీ పెళ్ళిభార్య కావటంవల్ల జీవితాంతం కష్ట నష్టాలు భరించింది. భర్తృ సుఖం ఉన్న స్త్రీ పెళ్ళిభార్య కాకపోవటం వల్ల కష్ట నష్టాలు కలగగానే తప్పుకొంది. రంగం నుంచి నిష్క్రమించింది.

ఒక స్త్రీ సర్వం త్యాగం చేస్తుంది. మరో స్త్రీ సర్వసుఖాలు, ఎక్కణ్ణుంచి లభించినా, కోరుకొంటుంది. ఈ వైచిత్రిని శ్రీమతి ఉన్నవ విజయలక్ష్మి 'అర్ధాంగి' లో చిత్రించే ప్రయత్నం చేసింది.

అర్ధాంగి ఎవరని ప్రశ్నించుకొంటే జవాబుగా ఈ నవలలో ఇద్దరు స్త్రీలు కన్పిస్తారు. పద్మావతి అసూయల పాలయి భర్తకు దూరమై ఎన్నో కష్టాలు ఎదుర్కొని చివరిదాకా భర్తకోసమే త్యాగమయిగా నిలచిన శీలవతి. జానకి పెళ్ళి చేసుకోకుండా కాపురం చేస్తూ డబ్బు కూడగట్టుకొని, భర్తవంటివాడు మంచం పడితే పర్మకు వదలి కఠినత్వంతో వెళ్ళిపోయిన స్త్రీ! వీళ్ళిద్దరూ

నవలలో భార్యలు! ఎవరు అర్ధాంగి? నిజమయిన అర్ధాంగి, పద్మావతిగా, నవల అర్ధాంగి జానకిగా రచయిత్రి అభిప్రాయం అయి వుంటుంది.

ఈ నవలలో హీరో డాక్టర్ హరీష్‌కుమార్, హీరోయిన్ మంజుల. విలన్ శంకరం. తల్లిదండ్రుల గత చరిత్ర తెలియకపోయినా హీరోకి పెద్ద హిస్టరీ వుంది. ఆమెకు తెలియని గతం హీరోయిన్‌కు కూడా చాలావుంది. చంద్రిగారి తండ్రికి తనయుడుగా మసలుకొంటున్న శంకరం చెప్పని కథ కొంతవుంది. కాబట్టి ఈ ముప్పాత్రల ముప్పేటల నవల పాఠకుల్ని మూడు చెరువుల నీరు తాగిస్తుంది.

సుదర్శనంపట్ల జాలి కలుగుతుంది. దిగులు పుడుతుంది. కోపం వస్తుంది. శంకరంమీద పాఠకుడికి ఏమీ కోపం రాదు, పాపం అందరిలాంటి వాడే అని పిస్తుంది. జానకి ప్రవర్తనకు అర్థం తెలియదు. తెలిసిందనిపించేది సహజతకు దూరంగా వుంటుంది. పద్మావతి సామాన్య స్త్రీలాగా కనిపించి, అసామాన్య స్త్రీ లాగా మారిపోయింది. హరీష్ లోకం తెలియని డాక్టర్. అదోరకం యువకుడు. మంజుల పాత్ర తప్ప ఇతర పాత్ర సృష్టి సమగ్రం కాదు. రచయిత్రి తన యిష్టం వచ్చిన కోణంనుంచి చిత్రించే తీరు పరికించి, అసంపూర్తి చిత్రాలు తిలకించినట్లు పాఠకులు అనుభూతి చెందుతారు. ఉన్నంతలో మంజుల పాత్ర సమగ్రత సాధించుకొంది.

కథలో సుదర్శనం పెళ్లి భార్యను వెళ్ళగొట్టడం, మరో స్త్రీని చేరదీయటం, కష్టాలు పడటం ఒక భాగం; భర్త్ర పరిత్యక్త అదృష్టం వెతుక్కొంటూపోయి, మహోత్తమ జీవితం లభిస్తే హాయిగా వుండటం మరో భాగం; యువతీ యువకుల ప్రేమ, అవాంతరాలు, పరిష్కారం లభించటం ఇంకో భాగం. ఇలా మూడు భాగాలు ఏకమయి రూపొందిన నవల అర్ధాంగి.

రచయిత్రి చూపిన నేర్పు కథా కథనంలో ఏమయినా ఉందేమోనని పాఠకులు ప్రయత్నించనక్కరలేదు. వర్తమానంలోని కథ ఆకస్మికంగా గతంలోకి పరుగులు తీస్తుంది. భూతం పెనుభూతంలా ఎదురయ్యేసరికి పాఠకులు

వర్తమానం మరచిపోవచ్చు. భూత వర్తమానాలలో అటూ ఇటూ పరుగులు తీసే నవల అర్ధాంగి.

ఒక పాత్ర చూడని, వినని విషయాలు వ్యక్తం చేయవలసిన అవసరం ఈ నవలలో చెప్పవలసి రాకపోలేదు. ఒక పాత్రకు ఎన్నో ఏళ్ళనాడు జరిగిన సంగతి అంతా గుర్తు వుండవచ్చు. ఆ సందర్భంలో జరిగిన సంభాషణ సారాంశం గుర్తు వుండవచ్చు, కానీ సంభాషణ యథాతథంగా గుర్తు వుండటం వాస్తవానికి దూరం. అటువంటి అవాస్తవికతకు 'అర్ధాంగి' అపవాదం కాదు.

కానీ ఆ పరిస్థితుల్లో భర్తను వదలి పోతుందా? ఆ తర్వాత ఆమె ఏమయింది? శంకరం మంజులను ఆ విధంగా మాట్లాడతాడా? పద్మావతి ధనవంతురాలుగా మారిపోయిన తీరు వాస్తవంగా వుందా? వంటి అనుమానాలు పాఠకులకు నిస్సందేహంగా కలుగుతాయి. వీటికే కాదు, ఇటువంటి చాలా ప్రశ్నలకు నవలలో సమాధానాలు దొరకవు. అందుకే 'అర్ధాంగి' సమాధానాతీత నవల.

హోటల్‌లో శంకరం ప్రేయసితో మాట్లాడిన మాటలు ప్రక్క గదిలో వున్న హరీష్ మంజులలు వినటం నాటకీయంగా వుంది. అందరూ త్యజించాక సుదర్శనం అసహాయస్థితిలో మంచం మీద పడివుండటం దయనీయంగా వుంది. ఇది చాలా విశిష్టంగా, బలవత్తరంగా నవలలో కనిపించే సన్నివేశం. దాంపత్య జీవితం కుడిఎడమలు ప్రదర్శించటం వల్ల జీవితావగాహనకు మార్గం సుగమం అవుతుంది.

7. ప్రేమించటానికి కారణం సామాజికమైన చాలా అవసరాలని నేటి మనిషికి తెలుసు. నేడూ, నాడూ కూడా కారణం లేని ప్రేమల్లో పడి ప్రాణాలు పోగొట్టుకొనే ప్రేమైక జీవులూ ఉంటారు. ప్రేమ కథ సామాజిక జీవిత సమస్యలతో సతమత మయ్యే సామాన్యుల్ని వదలి, నటులు, నర్తకులు, కవులు - కళాకారులను ఆశ్రయిస్తే ఆ తీర్పుబడి వేరు, ఆ తిప్పలు వేరు. అదీ నేటి సమాజంలో కాకుండా ఒకనాటి జీవితంలో అయితే మరీ మంచిది.

ప్రేమ ఆవిష్కరింపబడి, అనావిష్కృతంగా వుండి. ఆదరింపబడి, అనాదృతంగా మిగిలి, సమన్వయం లేనిచోట సమస్యగా రూపొందుతుంది. అందుకు కారణం మనుష్యులుగా కనిపించినా అవి మానవాతీతం. 'రధనిక' నవలలో శ్రీ నటరాజ రామకృష్ణ ఈ ప్రేమాలంబన పరాభవ జ్వాలాడోలాందోళనలు చిత్రించాడు.

ఇతివృత్తం చారిత్రకం, కవి, నర్తకి మంచి పాత్రలు. రాజు, మంత్రి మంచి మనుష్యులుకారు. కళ పేరిట, రాజ్యంపేరిట అధర్మాలు చేసే మహానుభావులు.

రధనిక నర్తకి, సుందర విషపుష్పం. ఆమె పళ్ళెంలా విషం. విషనాగుంతో సరససల్లాపాలు యథావిధిగా సాగించగలదు. నాగుపాముల కంటే బాగా నృత్యం చేస్తుంది. సౌందర్యవతి. యౌవనవతి. ప్రేమించిన వాణ్ణి చెంతకు రానీక, ప్రేమించని వాణ్ణి చేరువకు రానిచ్చే సాధ్వి.

రధనిక పాత్ర ప్రశ్నల పుట్ట. జీవితంలో ఎన్నో ప్రశ్నలు ఆమె కెదురవుతాయి. ఆమె ఎందరికో ప్రశ్న అవుతుంది. పాఠకులకు ఆమె గూర్చి ఎన్నో ప్రశ్నలెదురౌతాయి. కథాంతంలో చాలా ప్రశ్నలకు సమాధానమవుతుంది. ఒక్క ప్రశ్నకే లేదు, అది ఆమె అలా ఎలా కాగలిగింది?

రచయిత నవలలో ఉత్సుకత రేకెత్తించటానికి ఆమె పూర్వ గాథ చెప్పలేదు. అలా చెప్పకుండా కథ నడిపించటం వాస్తవికతకు దగ్గరగావుంటే రచనలో, శిల్ప దృష్టితో సుగుణం. కానీ, శ్రీకృష్ణ ప్రేమ అంత దూరం సాగించక, తను అతణ్ణి అంతగా ప్రేమించేదాకా చెప్పకుండా వుండటం అసహజం. ఆమె చెప్పకుండావుంటే ఒక నిండు ప్రాణి బలి అవుతుందని ఆమెకు తెలియకపోలేదు.

శ్రీకృష్ణ కవి. కవితా హృదయం వున్నవాడు. ప్రేమించి బాధలు పడినవాడు. పర్యవసానం తదనుగుణంగా వుంది. వద్దిరాజు ఆస్థానం నుంచి తొలగింప

ఐవి, చంద్రభాను దేవ సంస్థానంలో ప్రవేశించి, రథనిక హృదయం కొల్ల గొన్నాడు. కవిగా ఉన్నత శిఖరాల నధిరోహించాడు.

శ్రీకృష్ణ, రథనికల భావ తీక్షణత ఉచిత రీతిలో సాగింది. భావ ప్రపంచసరు అనుగుణంగా పవిత్రా పద్ధతిలోని రచన పాఠకులకు ఆనందం కలిగిస్తుంది. వారిద్దరి భావ పటుత ప్రవర్తించే పట్టాలు రసవత్తరంగా హృదయాలు పవిత్రాలాస్యం చేసేలాగా ఉన్నాయి.

సర్తకి అయిన రథనిక పాడగలదు. పవిత్వం చెప్పగలదు. పవి అయిన శ్రీకృష్ణ పాడగలడు. నృత్యం చేయగలడు. వారిద్దరి శృంగారాభాసం రస రమ్యంగా వుంది.

అనుకూలంగ చూపని రథనికతో పవి సంభాషణ, వాక్యాలలో పటునత్వం పాత్రోచితం కాదని ఎవరైనా అనుకోవచ్చు. కానీ ఈ పరిస్థితులతో ఆడడం తప్పనిసరయిన వ్యక్తులు అలాగే మాట్లాడడం సహజం.

మహారాజు చంద్రభానుదేవ పాత్ర చిత్రమయింది. అల్పకారణాలకు రాజు ఏడ్వటం పాఠకులు ఎక్కడా చూడరు. ఈ నవలలో చూడవచ్చు. రాజు ఎంతో దుర్మార్గుడు అయినా సన్మార్గుడుగా పనబడతాడు. రథనికకు, రాజుకు వున్న సంబంధం తెలిసింతర్వాత ఎలాంటి వాడయినా ఇలా, ఎలా చేశాడో అనుకుంటారు పాఠకులు.

మహామంత్రి తోలుబొమ్మలాట సందర్భంలో అవాంతరంగా ఆలోచించే తీరు నవలలో ప్రవేశపెట్టినందువల్ల సాధించిన ప్రయోజనం ఏమీ లేదు.

చంద్రభానుదేవ ప్రవర్తనలో, తన మాటలతీరు రాజులకు తగినవిధంగా లేదు. డబ్బు సంపాదనమీద ఆసక్తి. తనతో అక్రమ సంబంధాలున్న స్త్రీలకు కొలువులో ఉద్యోగాలిచ్చి, అడ్డం లేకుండా తొలగించుకోవడం, పేరు ప్రఖ్యాతుల కోసం పాటుపడడం, ప్రజలలో మంచి పేరుకోసం ప్రాకులాడడం, ఈ కాలం 'మినిష్టర్ల'ను తలపిస్తాయి.

కవిని మహోత్తమ కవిత వ్రాయగల సమర్థుడుగా చిత్రించి, ఆ కవి వ్రాసిన గీతాలివి అని ఈ రచయిత వ్రాసిన ఈ పాటలు చూసిన పాఠకులకు ఇంతమాత్రం చేత, అంత పెద్ద భట్టారకుని ఓడించాడా కవి అనిపిస్తుంది. రచయిత తన పాటలు నవలలో చొప్పించకుండా కవి గొప్ప కవిత్వం వ్రాశాడని తెలిపితే, ఎంత మంచి కవిత్వం వ్రాశాడో అని ఆలోచించుకోవటంతో పాఠకులు పొందే ఆనందం రచయిత వ్రాసిన పాటను చూచిన తర్వాత పోతుంది.

రైతులపట్ల నుంచి హుష్కంలో నూరోవంతు సాంస్కృతిక కార్య కలాపాలకు వసూలు చేసిన మొత్తం "పది లక్షల సువర్ణ నాణేలు" అయిందంటే ఆ రాజ్యంలో జనాభా చూచి ఇంతమంది జనం ఈ రాజ్యంలో ఎలా వున్నారు అనుకుంటారు పాఠకులు. పాత్ర చిత్రణ, కథా కథనం, హృదయాలు కదిలించే విధంగా కవితాత్మకంగా ఉన్న రచన, నవలలోని ఊహాలోకాల విహారం ప్రదర్శిస్తున్నాయి. కళాకారుల దాంపత్య జీవితం ప్రదర్శించే ప్రయత్నంలో ఇది ఏవం విధమైన జీవిత వ్యాఖ్యానం కాగలిగింది.

8. ప్రేమలు, పెళ్ళిళ్ల జీవితాలలో వైయక్తిక ప్రాధాన్యం కొన్ని నవలలు చూపితే, వ్యవస్థ ప్రాధాన్యం కొన్ని పరికించాయి. మనిషి తన కోసం తాను, తన వాళ్ళ కోసం తాను కాకుండా సమాజం కోసం జీవించటం ప్రాముఖ్యం సంతరించుకోసాగింది. ఇది నేటి తెలుగు నవలా పరిణామంలో విశేష విషయమే.

కథా రచయితగా సుప్రసిద్ధులైన విహారి శాలివాహన వ్రాసిన 'వాహిని'లో సాంసారిక జీవితం ప్రధానాంశం. కుటుంబ జీవితంలో సహ జీవనంలో ప్రధానత అని కాని, అప్రధానత అని కాని చూపకుండా, ఏ ప్రత్యేకతనూ ఏ పాత్రలోనూ చూపకుండా అందరూ అన్ని పనులు చేస్తూ తమ తమ పనులు చేసుకొంటూ జీవించటంలో జీవన రహస్యం దాగి ఉందనుకొనేటట్లు చిత్రించడం గమనార్హం.

ఇది నవలనుకొంటే జీవితం అనిపిస్తుంది. జీవితం అనుకోంటే నవల అనిపిస్తుంది. రెండూ అనుకోవాలంటే కుదరదు. ఇది నవలో, జీవితమో నిర్ణయించాలి. మంచి కార్యం.

మొదటిలో కనిపించే పాత్రలు ఎక్కువ. అన్నిటిని గుర్తు పెట్టుకోవటానికి శ్రమ పడకూడదు. అతి సామాన్యమైన ఇల్లు- తెలుగు వారిది ఒకటుంది. వీలా వాతా దానికి సంబంధించి మరి మూడిళ్ళు వున్నాయి. మొత్తం నాలుగు. రమణయ్య ఇల్లు, రామచంద్రయ్య ఇల్లు, గోపాలం ఇల్లు, కాంతయ్య ఇల్లు. ఆ యిళ్ళల్లో కొందరు మనుష్యులున్నారు. వారికి సంబంధించిన మనుష్యులూ వున్నారు. వాళ్ళు చేసిన పనులు, నవలలో కథనల్లాయి. అంతకుమించి ప్రత్యేకమైన కథ లేదు. అందువల్లనేమో ఈ నవల జీవితం అనిపిస్తుంది. నవలలో వున్న పాత్రలు, రచయితలు గీసిన హద్దుల్లోంచి వెలుపలికి రాలేదు. మంత్రముగ్ధంగా మసులుకొన్నాయి.

ఒక్కొక్క పాత్రకు ఒక్కొక్క పని రచయిత నిర్ణయిస్తే అవి నడచాయి. ఆ పని పూర్తిచేశాయి. అంతకంటే ఆ పాత్రలకు ప్రత్యేకత లేదు. ప్రాధాన్యం లేదు. రచయితలు గీసిన గిరుల్లోంచి పాత్రలు అర అంగుళం అయినా దాటలేదు.

చిరంజీవి-ఆఫీసు-ఇల్లు-పెళ్ళి-భార్య;

భాస్కరమూర్తి-చదువుకోవటం-ట్యూషన్ చెప్పటం-ప్రేమించటం;

రామమూర్తి-భార్యను వదలిపెట్టి- డబ్బుతో పారిపోయి, తిరిగి రావటం-పశ్చాత్తాపపడటం;

శైలజ - పెళ్ళాడింది - కాపురం చక్కదిద్ద ప్రయత్నించింది;

వసంత - భర్త్ర పరిత్యక్త, పుట్టింట జీవితం వెళ్ళబుచ్చింది;

ఛాయ - ప్రేమించింది - పాట పాడింది;

రాజేశ్వరి, కామేశ్వరి, సీతమ్మ - భార్యలు;

వాసూ, జ్యోతీ, శకుంతలా, సుశీలా - పిల్లలు;

రాణీ - విశాలా - యువతులు;

రమణయ్య, రామచంద్రయ్య - భర్తలు;

గోపాలం తండ్రి, పరంధామయ్య తండ్రి, వేణు - డాక్టరు - మురళీ - ఆరోతరగతి;

ఇంకా కొన్ని పాత్రలున్నాయి. ఏమిటి పాత్రలు, ఇంత చిన్న పరిధిలో ప్రవర్తిస్తున్నాయి. జీవితం ఇంత పరిమితంగా వుంటుందా అనుకొన్నప్పుడిది నవలనిపిస్తుంది.

నవలను ఓపికగా చదివితే తప్ప సంఘటనల అన్వయం కుదరదు. జీవితం సూత్రప్రాయంగా వుందనుకొంటే ఈ నవల ఒక బాలవ్యాకరణం. బాలవ్యాకరణంలో పరిచ్ఛేదాలుంటాయి. ఇందులో ఇళ్ళున్నాయి. సూత్రాలుంటాయి. మనుష్యులున్నారు. సూత్రాలకి ఉదాహరణలుంటాయి. ఈ మనుష్యులు కొన్ని పనులు చేశారు.

వ్యాకరణంలో ఎన్నో ఉదాహరణలు, సాహిత్యమంతా సమన్వయించుకోవాలి. అలాగే ఈ పాత్రలు చేసిన అన్ని పనులూ వ్రాయలేదు. జీవితమంతా చేసిన పనులు అన్నీ వూహించుకోక తప్పదు. పాత్రల గూర్చి చెప్పిందే కాక చెప్పంది కూడా వూహించుకోకపోతే పాత్రలకు పరిపూర్ణత కనిపించదు. అందు చేత, ఈ నవలను వ్యాకరణం చదివినట్లు చదువుకోవాలి.

ఇది జీవితంలోని కొన్ని దశలను ప్రదర్శించే నవలా, లేకపోతే కొందరి జీవితంలో ఒక్కొక్క దశ చూపించే పెద్దకథా అని ఆలోచించవచ్చు. పుస్తకం చివరి పేజీలో 'వాహిని' అని పేరు పెట్టడానికి కారణం చెప్పే ప్రయత్నంలో జీవనవాహినికి దశలు అనేకం. అందులో ఇదొక దశ అన్న సూచన ఉంది.

సుశీల, వసంత మరణించినపుడు హృదయం బాధ పడుతుంది. రామ్మూర్తి మనోపరిణామం వల్ల ఆనందం కలుగుతుంది. సురాజితో మార్పు సత్ ఫలితం పొందలేదే అని విచారం కలుగుతుంది. ఛాయ, భాస్కరుల ప్రణయ స్థితి పరమానందంగా ఉంటుంది. ఇందులో హృదయంపై చెరగని ముద్ర వేయగల సంఘటనలున్నాయి.

నవల చదవటం ముగించేటప్పటికి పాత్రలు బాగా పరిచయమైన కొన్ని గృహ వాతావరణాలు సంతరించుకొంటారు. 'వాహిని' చదువుతున్నంత సేపూ తెలిసిన వ్యక్తుల్ని, తెలిసిన ఇళ్ళని చూస్తున్నట్లు భావించుకొంటారు.

కొన్ని భావాల వ్యక్తీకరణంలో ప్రత్యేకమైన అందం కన్పిస్తుంది. జంట రచయితలు వ్రాసిన ఈ నవలలో మెరుపుల్లాగా జీవిత సత్యాలు గోచరిస్తాయి. నవలలో వాస్తవికత నిండుగా ఉంది.

9. మన వ్యవస్థలో భర్త గతిస్తే, పిల్లలు లేకపోతే, స్త్రీకి ఉండవలసిన రక్షణను గురించి ఆధునికంగా ఆలోచించటం అవసరమయింది. ఆ స్త్రీ, భర్త ఆస్తికి వారసురాలు కాగలిగితే అది ఆర్థిక రక్షణే! అయితే ఆ ఆస్తిని కాపాడుకో గలగటం సాధ్యమా? ఎటు చూచినా స్త్రీ కోసం, ధనంకోసం ప్రయత్నించే పురుషలోకంలో స్త్రీ రెంటినీ కోల్పోకుండానూ, పురుష సంరక్షణ లేకుండానూ జీవించటం కత్తిమీది సాము.

ఆ సాము చేసిన విధవ జీవితం శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి 'గ్రహణం విడిచింది'లో చిత్రించటానికి ప్రయత్నించింది. సాఫల్యం, వైఫల్యం, సంగతి కాదు కానీ ప్రయత్నం గుర్తింపు పొందుతుంది.

భర్త గతించిం తర్వాత, ధనవంతురాలయి, తన ధనంకోసం అందరూ చుట్టూ మూగుతున్నారనే సత్యా సత్యాల మధ్య అనుమానపు నీడలు సృష్టించుకొని, వెలుగును చూడటం కోసం ఎటో పారిపోయి, సర్వసంగ పరిత్యాగులలోనూ

ధనాశ ఉండని అనుకొని మళ్ళీ పొరపోతూ జ్ఞానోదయం పొందిన ఒక వ్యక్తి వృత్తాంతం ఈ నవల.

'గ్రహణం విడిచింది' అన్న పేరు నవలకు సర్వసమర్థంగా సరిపోదు. ఈ గ్రహణం సూర్యగ్రహణం. సూర్యుని గ్రహణంపడితే కొంతకాలం లోకంలో చీకటి. కథానాయిక భారతిని గ్రహణంపడితే ఏ జీవితంలోనూ చీకటి రాలేదు. సూర్యకిరణాలకున్నంత దయాదాక్షిణ్యాలు భారతి కిరణాలకు లేవు. సూర్యునికి పట్టిన గ్రహణం విడిపోతే సర్వసృష్టి - ప్రకృతి - హసిస్తుంది. భారతిని పట్టిన అనుమాన గ్రహణం విడిపోతే అమెకే మేలు.

సమాజం ఒక పీడ మనస్తత్వం, పొడు బుద్ధి పరిగెంచుక విధవ మనస్సులో చెలరేగే అనుమానం క్షణక్షణం తాల్చే రూపం చూపించాలని రచయిత్రి శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి చేసిన ప్రయత్నం అపరిపక్వంగా ప్రదర్శితమయిన నవల 'గ్రహణం విడిచింది'.

ధనాశాపరులు చుట్టుముట్టి ఉన్న జీవిత సంగ్రామం సంగ్రహంగా చిత్రించే ఈ నవలలో అందరూ ధనాంధులే గాని తపన్యంగా ఏ పాత్రా కించిన్మాత్ర విశిష్టంగా భాసించే దశను అందుకోలేదు.

సన్యాసి పాత్ర దృష్టి ప్రయోజనం కూడా స్పష్టంగా తేల్చి చెప్పబడలేదు. సంశయానుకూల చిత్తంతో సందర్శించిన ప్రతి సంగతినీ పరిశీలించే కథానాయిక గుణ విధానం వల్ల నవల రూపం తయారయింది.

నవలలో విషయ విశిష్టతతో పాటు, పాత్ర చిత్రణ నేర్పుతో పాటు, అనేకేతరేతర గుణసమూహంతో పాటు నవల చెప్పే పద్ధతి కూడా ముఖ్యమయిందే!

నవల అంతా ఉత్తమ పురుషలో చెప్పటం ఈ సాహిత్యంలో క్రొత్త పద్ధతి. అటువంటి విధానం ఇంతకు పూర్వం ఇంతగా లేదు. ఉత్తమ పురుషలో

నవల చెప్పే విధానం ఆంధ్ర సాహిత్యంలో అధిక తరంగా అభివృద్ధి చెందితే బాగుంటుంది.

ఈ 'గ్రహణం విడిచింది'లో భర్త చనిపోతే, రెండో పెళ్ళి చేసుకోవాలనే తలంపుతో ఉన్న స్త్రీ, ప్రత్యంపు విషయంలోనూ గతించిన భర్తను గుర్తుకు తెచ్చుకొని కుమిలిపోతూ వుంటుంది.

శ్రీ సింగరాజు రామచంద్రమూర్తి రచించిన కథానిక 'సహజీవనం' ఒక సచిత్ర వారపత్రికలో ప్రకటింపబడింది.

అందులో కుటుంబ పరిస్థితి కారణంగా కథానాయిక ధనవంతుడైన వృద్ధుణ్ణి వివాహమాడుతుంది. వృద్ధుడు గతించిన తరువాత, ఆమె డబ్బుకోసం కుటుంబం అంతా ఆమెను ఎలా పీడించింది, బాధపెట్టింది స్పష్టంగా కన్పిస్తుంది. ఈ కుటుంబ బాధ నివారణార్థం ఆమె మళ్ళ పెళ్ళిచేసుకొంటుంది.

'గ్రహణం విడిచింది'లో భర్త మరణాంతరం ఆస్తికి వారసురాలు అయిన భారతి కుటుంబంలో వున్న అందరూ డబ్బుకోసం ఆమెను పీడిస్తున్న తీరు కనబడుతుంది. ఆ బాధోపశమనార్థం భారతి పెళ్ళికి సిద్ధమవుతుంది.

'సహజీవనం' లో కథానాయిక అన్న చెల్లి డబ్బుతో వ్యాపారం చేస్తాడు. 'గ్రహణం విడిచింది' లో భారతి అన్న ఆమె డబ్బుతో వ్యాపారం చేస్తాడు.

ఈ నవలలో మరుపురాని పాత్ర భారతి. ఆమె వ్యథాహృదయం సమాజానికి ప్రశ్న. భర్తృ మరణానంతరం ఆమె జీవితం ఆందోళనకు, అరక్షణకు గురి కావటానికి కారణం సమాజం. అది మారకపోతే స్త్రీ జీవితం నిర్దయకు, నిర్లక్ష్యానికి గురి అవుతుంది. ఎర అవుతుంది. పీడింపబడుతుంది. బాధింపబడుతుంది. ఫలితంగా సమాజం పీడనకు లోనవుతుంది.

10. కుటుంబ జీవితం మారుతున్న సామాజిక పరిస్థితులు కారణంగా విభిన్న ధర్మ సమాహారంగా మారింది. పట్టణ జీవితం సుఖంగా ఉన్నట్లు

కనిపిస్తుంది. సత్యాసత్యాల తారతమ్య పరిశీలన కాదు కానీ, ఆ భావం సంస్కృతి పునాదుల్లో ఊపిరి పీలుస్తూ ఉంది.

పల్లెలు, కష్టాలు, ప్రేమలు, అనుబంధాలు, జంటల్లో ఒకరుండటం, ఒకరు పోవటం అర్థం కాని సృష్టి రహస్యాలకు వ్యాఖ్యానం చేయటానికి ప్రయత్నిస్తాయి. శారీరకావసరం సామాజికామోదం పొందటం, సామాజికామోదం శారీరక హింస పొందటం, ఈ రెండు పరిస్థితుల్నీ దాటి ప్రాణి జీవించటం, గతించటం అనూహ్య జీవిత ధర్మం. సృష్టికి అర్థం అన్వేషించే అవసరం ఏర్పడే పరిస్థితి. 'వారధి'లో శ్రీమతి విశాలాక్షి చేయదలచిన గవేషణ ధర్మప్రేరితం.

'వారధి' రెండు నాగరికత, సంస్కృతులకు సంకేతం. అటు పట్టణం. ధనాపేక్ష, స్వార్థం; ఇటు పల్లె, నిరపేక్ష, నిస్వార్థం; చూపే రచన - 'వారధి', మధ్య వంతెన వరదరాజు. వరద సంస్కృత పదం కాదు. కావాలంటే తెలుగు పదం. ఒక వరదవస్తే తప్ప నాగరికత, సంస్కృతులు విభిన్నమయినవి ఏకాం కావు. ఈ మధ్యలో వారధి కూలిపోవచ్చు. ఫలితం ఏముంది? రెండు నాగరికతల సంఘర్షణలో ప్రాణనష్టం తప్పదు. పునస్సృష్టి తప్పదు.

అనూరాధ కూతురెందుకు చనిపోయింది? నెలలు నిండక ముందే పుట్టింది గనుక! అనూరాధ ఎందుకు మరణించింది? కాలం తీరి! అంతేనా? సంఘర్షణ భరింపలేక? నిజమేనా? పూర్ణ ఎందుకు గతించింది? కన్న కడుపు కోత పెట్ట టానికి, కొడుకు కాని కొడుకు వరదరాజును కొడుకుగా మరది మాట దూరం చేయడానికి! రత్తయ్యెందుకు పరమపదించాడు? కాలంతీరి! రత్తయ్య ఆ వయస్సులో పెళ్ళెందుకు చేసుకొన్నాడు; సృష్టి తంత్రమే సృష్టి! ఈ రచయిత్రి పతిన జీవన సత్యాలు వ్యాఖ్యానించటానికి కాకపోతే ఇన్ని చావు లెందుకు వ్రాయటం? అన్నదమ్ముల మధ్య, అక్కా చెల్లెళ్ళ మధ్య, అన్నా చెల్లెళ్ళ మధ్య, వదినా మరదళ్ళ మధ్య, భార్యాభర్తల మధ్య ఎందుకింత ఆప్యాయత, ఆపేక్ష, ఆదరణ?

సాంఘికంగా, నైతికంగా 'వారధి' చక్కని సృష్టి. నాగరికత ముసుగులో హృదయాన్ని చంపుకొంటున్న సమాజానికి మేలుకొలుపు.

'వారధి' నాగరికత, సంస్కృతుల బూజు దులపటానికి, కడగటానికి వచ్చిన సాహిత్య సృష్టి. మానవ సంబంధాలలో రావలసిన మార్పుకు చిహ్నం. దాంపత్య జీవిత నేపథ్యంతో మానవత్వపు విలువలు ప్రతిష్ఠించిన రచన.

11. నేటి నవల్లో వస్తువు, పాత్రలు చాలావరకు యువత చుట్టూ ఆవృతమవుతున్నాయి. వైయక్తికం, సామాజికం అయిన చైతన్యం ఆవిష్కరిస్తున్నాయి. యువత పోతున్న తప్పు తోవల్ని చూపుతున్నాయి. ఒప్పు దారులు తెలుపుతున్నాయి. యువత, నాశనం చేసే వ్యవస్థను, నిర్మించే భవిష్యత్తును ఆసక్తిగా పరికిస్తున్నాయి.

వివాహ వ్యవస్థలో ప్రయోగం భిన్న కోణాలలో జరుగుతూ వుంది. సంప్రదాయ వివాహాలు సనాతనంగా పురాతనంగా గౌరవాగౌరవాలు పొందుతున్నాయి. నూత్న దాంపత్య రీతులు సిద్ధిస్తున్నాయి. నిలబడుతున్నాయి. విలువల్ని నిలబెడుతున్నాయి.

కుటుంబ జీవనంలో సంఘం కోసం మనిషి జీవించటం నించి ఉండడంతో పాటు మనిషి కోసం మనిషి బ్రతకటం ప్రారంభమయింది. ధర్మం స్థానంలో ప్రేమ, నీతి స్థానంలో అవగాహన, ఆచార వ్యవహారాల స్థానంలో ఆత్మీయావసరాలు ప్రవేశింపసాగాయి. క్రమక్రమంగా సమాజ జీవితం మూర్ఖం వదలి పీడన త్యజించి, ఔచిత్యం గ్రహించి సౌమనస్యం సాధించి పురోభివృద్ధి చెందుతూ ఉంది.

నేటి తెలుగు నవల్లో మానవాన్వేషణ తాత్త్విక పరిధి నిరూపకంగా వ్యాఖ్యాన సమర్థంగా వ్యాప్తి పొందుతూ వుంది. జీవి ఆరాటానికి, పోరాటానికి కారణం గ్రహిస్తూ వుంది. జీవించటం శ్రమించటంలో, ప్రశ్నించటంలో, పోరాడటంలో, విజయం పొందటంలో ఉందని తెలుగు నవల గుర్తిస్తూ ఉంది.

యువత-వివాహం-కుటుంబం-కుటుంబ భవితవ్యం నేపథ్యంగా మాత్రమే ఈ ఆలోచన ఉంది. తెలుగు నవలా వస్తు పాత్రల విశాలతకు ప్రత్యేక కృషీ, ప్రయత్నమూ అవసరం. ఇది ఒక తోవలో క్రమ వికాసం పొందే సామాజిక జీవితానికి దర్పణమైన నవలా సందర్శనం.

# 2. ఆధునిక కవితా దర్శనం

ఈ కవితా దర్శనంలో నేటి కవుల భిన్న కావ్యాల సమీక్ష వుంది. ఇవి విభిన్న శాఖలకు ప్రాతినిధ్యం వహించేంత బలవత్తర నిర్మాణాలు కావు. కాని ఆయారీతుల్లో గమనించవలసిన రచనలు. వైవిధ్యం, వైచిత్రి, అనుభూతి, ఆవేదన, తాదాత్మ్యం ప్రధానమయి ప్రభవిస్తున్న నేటి కవిత తీరుతెన్నులు పరికించటానికి ఈ ప్రయత్నం ఉద్దిష్టం.

1. తెలుగులో చారిత్రక కావ్యసృష్టి ప్రాచీన వైభవ స్ఫురణంతో వెలువడి జాతిని జాగృతం చేస్తూవుంది. బుద్ధచరిత్ర, సౌందరనందం, కరుణశ్రీ కోవలోనిదే ఆనందభిక్షువు, శ్రీ వి. వి. యస్. నరసింహారావు ఆనందుడి కథ, కవితా సుందరంగా తీర్చిదిద్దాడు.

బుద్ధుని శిష్యుడయిన ఆనందుని ఆత్మశక్తి, మాలకన్య అయిన ప్రకృతి హృదయభక్తి, ఆమె తల్లి మంత్రశక్తి - ఈ మూడింటి మధ్య సంఘర్షణ ఆనంద భిక్షువులోని ఇతివృత్తం. ఇది మానవత్వం, సమానత్వం చూపించే చక్కని కావ్యం.

ఇందులో ప్రకృతి ప్రవృత్తిగానూ, ఆనందుడు లౌకికాతీతమయిన బ్రహ్మానందంగానూ, ప్రకృతి తల్లి అవిద్యగానూ, గోవత్సం ప్రతిగానూ, అంతర్వాహినిగా ధ్వని. ధ్వనిప్రస్థ కావ్యం ఉత్తమం. కావ్యంలో శృంగార రసం పోషితమయి కూడా తదన్యమయిన శాంతమే పర్యవసాయి.

మంత్రశక్తి, ఆత్మశక్తి సంఘర్షణలో ఆత్మశక్తి జయిస్తుందని అనే భావనిర్వహణ కవి ప్రతిభా వ్యుత్పత్తులకు తార్కాణగా చూపవచ్చు.

మతం జీవిత విధానమయితే, జీవితం ఆనందం వాంఛిస్తుంది. వర్ణ ధర్మం తిరస్కరించే బౌద్ధం ఆనంద సంకేతం. ఆనందుడు భిక్షువు. ప్రకృతి ఆనంద భిక్షువు. కామం ఆనంద భిక్షువు - నామకరణం సమన్వయ సముచితం.

టాగూర్ నాటిక 'చండాలిక'లోని వస్తువు ఈ రచనకు సూత్రప్రాయం. అది ప్రసిద్ధ బౌద్ధగాథ. పర్ణనలు సహజంగా వున్నాయి. శ్రావస్తిపురి నందలి వున్న చండాల వాటిక వర్ణన కన్నులకు కట్టినట్లుంది.

కవికి భాషపై వున్న అధికారం కారణంగా ఏ పద్యమూ వ్యర్థంగా కన్పించదు. రచనలో ఎగుడు దిగుళ్ళు లేవు. రచన మాధుర్య గుణ ప్రధాన మయింది.

ఇతివృత్త గౌరవంచేత చేత, ఉదాత్త రచనారీతి చేత, గంభీర రస ధ్వనిచేత, స్వతంత్ర కల్పనలచేత, ఆనంద భిక్షువు ఉత్తమ శ్రేణి కావ్యం.

"సాహితీ జగత్తులో సుప్రతిష్ఠితములైన సౌందర నందం, బుద్ధ చరితం, కరుణశ్రీ మొదలైన కావ్యాలు స్మృతి పథంలో కదలినై. నాలో అమూర్తములై యున్న భావాలకు మూర్తి కల్పనం జరిగింది .... కొన్నాళ్ళకు ఈ ఆనంద భిక్షువు అవతరించింది" అనే కవి ఆత్మాభివ్యక్తిలో సత్య సందర్శనం ఉంది,

2. మరో చారిత్రక కావ్యం విజయముద్ర. పురుషోత్తముని పరాక్రమ వృత్తం వస్తువు. శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు చేసిన ఈ సృష్టి దేశభక్తి ప్రబోధాత్మకంగా వుంది. పురుషోత్తముడు అలగ్జాండరుతో చేసిన యుద్ధం, రణపూర్వ రంగం, ఈ కావ్యేతి వృత్తం. కావ్యరచనా కాలానికి ముందు పైనా భారతదేశంమీద దండెత్తింది. ఈ యుద్ధంలో జితుడెవరూ, పరాజితుడెవరూ అన్నది వాస్తవానికి దూరంగా జరిగిన వ్రాతలనుంచి సత్యం గ్రహించగా, ఆపైన వాదోపవాదాలకు ఆస్పదమయిన చారిత్రక విషయం. భారతదేశ చరిత్రను ఆంగ్ల చరిత్రకారులు లిఖించారు. ఆ వ్రాతలే భారతీయులకు చరిత్రలూ, చారిత్ర కాధారాలు అయ్యాయి.

పురుపురుషోత్తముడు యుద్ధంలో జయించాడనీ, పోనీ, కనీసం ఓడిపోలే దనీ, భారతీయులకు నమ్మకం. ఆ విశ్వాస విషయ సమర్థనకు సమర్థమైన సాక్షి సంపన్నాలు పూర్తిగా ఎవరూ సమకూర్చుకొనలేదు. సమ్యక్ సత్య సందర్శ నార్థం, ఆ ఆంగ్ల చరిత్రకారుల గ్రంథాంతర్గత సత్యాలే సమారాధాంయ్యాయి.

విజయపంక్తి విలసితుడైన పురుషోత్తముని చరిత్ర, భారతీయ భాషల పెక్కింటిలో పలు ప్రక్రియలలో కవులూ, రచయితలూ స్తుతించారు. ఆ వస్తువే గౌరవంవల్ల ఈ కవికీ స్వీకార్యమయింది. ఆంధ్ర కవులూ, రచయితలూ, ఈ వస్తువు గ్రహించిన వారు, ఎవరూ దర్శించని చారిత్రక సత్యం ముద్రికలు. విజయముద్ర కర్తఆ ముద్రికలు దర్శించి అవి అలా తయారు కావటానికి కారణం, పురుషోత్తముని విజయమేనని భావించిన ఫలితమే కావ్యం. ఆఊహ సముచితంగా, వుంది. ఆ ముద్రికల బొమ్మలు విన్సెంటు స్మిత్ వ్రాసిన ది ఆక్స్‌ఫర్డ్ హిస్టరీ సరసంగాఆఫ్ ఇండియాలో పురుషోత్తముడి నాణెం పేరుతో ముద్రింపబడి వున్నాయి. విజయ ముద్రలోని ప్రాథమిక చారిత్రక విషయాలకు ఈ గ్రంథం ఆధారం. ఇటువంటి ముఖ్యమైన విషయం చెప్పటం ఎంతైనా అవసరం. అయితే కావ్యాదిలో 'మనవి'లోఅది చెప్పబడలేదు.

ఇక మిగతా కథ అందరెరిగినదే! నిర్వహణ విధానం ఎలా వున్నా, కథా విభజన బాగుంది. కావ్యమాద్యంతం పురువీరులలోనో, పరవీరులలోనో, వీరత్వం బాహాటంగా కనిపిస్తుంది. అది చేతలలో, కంటిమాటలలో అధికంగా ప్రస్ఫుట మవుతుంది. మరొక్క సుగుణం. భారతీయ వీరులలోనూ, గ్రీకు వీరులలోనూ మానవత్వం వీరోచితత్వం కనిపిస్తాయి. 'ఇరు దెసగుల రగలవారు, ఎదుటి వీరునిలోని ఔన్నత్యం, పైని వీరునిలోని సామర్థ్యంచూచి ముగ్ధత నొందే ఉన్నత వీరత్వం గలవారు. అయితే పురుషోత్తముని కుమారుడు తండ్రి ఆజ్ఞమేరకు ఆంగ్లాండరును చంపకుండా బందీ చేయాలనే తలంపుతో యుద్ధం చేస్తుండే పలుపు లొక్కటై, అమానుషంగా, యుద్ధధర్మానికి వ్యతిరేకంగా, అభిమన్యుణ్ణి (గుర్తుష

రాజ లప్పుడు) చంపినట్లు చంపడం చూస్తే, మానవతానుభూతిగా కనిపించే అంగ్లాండరులో ఆ క్షణాన దానవత్వం సాక్షాత్కారమవుతుంది. అందుకే ఆ అంగ్లాండరు పురుషోత్తముని దయాభిక్ష వల్ల బ్రతికిపోవటం జరిగిందనేది కవితా సత్యం.

కల్పనా చమత్కృతి విషయంలో సామర్థ్యం మాటకాదు గానీ, జాగ్రత్త చేస్తే, గమనార్హంగా ఉన్నాయి. యుద్ధం చేయటం కంటే, యుద్ధ ప్రయత్నాలు జాస్తున్నాయి. గ్రీకు సైన్యాలు అర్ధరాత్రి శిబిరం నది దాటడం కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. కొన్ని తావుల్లో భావపుష్టి పరిశాంతర్యాలు స్ఫురించింది. వ్యక్తుల రూపురేఖలు, రాజసాని నేర్పు చాటే సమయంలో కవి లోతులు సందర్శించినట్లే!

భాష సులక్షణంగా వుంది. భాషా విషయకమైన పట్టుదల కన్పిస్తుంది. వ్యాకరణం పరిధిలోకి రాని పదాలను ప్రయోగింప కూడదనే దీక్ష గోచరమవుతుంది. అది హర్షింపదగిన విషయం. అయినా మూడు విధాల దోషాలు ఎనిమిది, తొమ్మిది ఎదురవుతాయి. అంతేకాదు. కావ్యంలో అర్ధానుస్వారం, శకటరేఫ ఆదరింపబడ్డాయి. అవి ఆధునిక కవితనుంచి పైపొలగిపోయి చాలాకాలమయింది. అయినా ఇందులో వున్నాయి. ఉండవలసిన అన్ని తావులలోనూ లేవు. ఉన్నవి మాత్రం ఉండవలసిన చోట్లలోనే ఉన్నాయి. సిద్ధ సాధ్యార్థానుస్వారం పలు తావుల్లో లోపించింది. శకటరేఫ కూడా అంతే!

ధారా శుద్ధి విశిష్టమైన లక్షణం. అది ఎక్కడో తప్ప ఎల్లెడలా నిరాఘాటంగా సాగింది. శైలిలో సమత లేకపోయినా, స్పష్టత వుంది. పద్యాల నడకలో బిగి, భాష సంకోచవ్యాకోచాలు పొందింది. ఛందస్సు సాంప్రదాయకంగా వుంది.

స్వీకరించిన వస్తువు వ్యాపరించుకొనటంలో ఏయే అంశం ఎంతవరకు వ్రాయవచ్చో, ఎంతవరకు వ్రాస్తే రసౌచితి ఉంటుందో అని నిర్ణయించుకొనటంలో రచనలో వ్యర్థపదాలు, వ్యర్థ వాక్యాలు అనవసర సంఘటనలు తొలగించుకొనటంలో కథానుగుణంగా ఏర్పడ్డ పాత్రల ప్రమాణం స్పష్టంగా బద్ధ

నిరూపితార్థ మేర్పడ గుర్తించి, వాటి మనోవాక్కాయ కర్మల పరిధి పరిశీలించి, ఔచిత్యానికి లోపం రాకుండా పాత్ర సృష్టి చేసుకొనటంలో, సంఘటనల తీరు తెన్నులు, వాటి బలం, కథకు సంఘటనకు ఉన్న సంబంధం, ప్రాముఖ్యం, కూలంకషంగా భావించుకోనటంలో, స్థాయీ భావాన్ని రసస్థాయికి సమీపించటంలో జాగ్రత్త వహించి, ఆకళించుకొని, రచన చేసి ఉంటే ఆవేశం, చక్కని ధారాశుద్ధి, భాషా పటిమ, భావపుష్టి ఉన్న ఈ కవి ఇంతకంటే ఉత్తమ కావ్యం అందించేగలిగే వాడు.

3. ఇది ఆధునికాంధ్ర కవిత్వంలో భావకవిత్వం వెనుకడుగు, అభ్యుదయ కవిత్వం ముందడుగు వేస్తున్న కాలం. మొదటి కోవలోని రచనలు 'జోత్స్నాభిసారిక'' 'గోదావరి'. రాధ కృష్ణుణ్ణి అభిసరిస్తుంది. రాగిణి రాధ చెలికత్తె. కృష్ణ గమనంతో రాధకూ, రాగిణికీ, ముద్దు మురిపెం తీరుతాయి. అది జోత్స్నాభిసారిక గౌతమర్షి తండ్రి, గోదావరి కూతురు. కూతురుకి వరుణ్ణి వెదుకుతూ తండ్రి వెళ్ళాడు.

గోదావరి దగ్గరకు తండ్రి లేని సమయంలో సముద్రుడు వచ్చి, ఆమెను ఉత్సాహపరిచాడు. పిచ్చిపిల్ల, గోదావరి తండ్రి గీచిన గీటు చాలా సేపు దాటలేదు. 'కన్నె గోదావరి' నిలువెల్ల కరిగిపోయి నీరుగా మారింది. ఇంకేముంది గీటు దాటింది. సముద్రుడంతటివాడు అల్లుడయినందుకు గౌతమర్షి ఆనందించాడు. అదీ "గోదావరి".

డా॥ సంపూరి రామకృష్ణమాచార్యు రచనలో రసార్ద్ర హృదయం మూర్తీభవించివుంది. "రాధనురా మురళీధరా, మరచిన చిరగాధనురా........ బాధనురా" చదువుతుంటే కరుణశ్రీ 'రాధనురా ప్రభూ! నిరపరాధనురా' పద్యం గుర్తుకు వస్తుంది.

రాగిణికి తెలియకుండా రాధను ముద్దిడుకోవాలనుకొన్న కృష్ణుడు రాగిణికి కళ్ళు మూసి, రాధకు చుంబనం అనుగ్రహించాడు. 'నన్ను లాలించి నన్ను

మూసి, అవని నా కంటె ధన్యురాలెవరె గలరు" అంటుంది రాగిణి. అందుకు రాధ సమాధానం "ఏం పింఛెతో పండు వాడింపవలయు!" రాగిణి అనుభూతి పింఛె! రాధ అనుభూతి పండు! చక్కని పదప్రయోగం, మంచి వూహ!

'సందేశ్వరుడా గతి లభిసందెంపగ' అని సందేశ్వరుడే అనుకోవడం కావ్య గౌరవానికి, కవి జాగ్రత్తను తగినదికాదు. 'చేసెద దరి ఉపయుగిరికై' ముత్యాల సరం అయినా, సుందర పదాలయినా, నడకలో లోపం వుంది. ఇది ముత్యాల సరం పేరురాదు.

కవికి సంగీత సాహిత్యాల సరళత తెలుసు. ఈ రెండు నాయికలు సంగీత స్పర్శ నాయికలు. అస్పష్ట్రమతో ప్రదర్శింపవచ్చు. శక్తి కథలాయి.

4. భావకవిత్వంలో హృదయ నివేదనం 'విరహపీఠి' మోగించి. శ్రీ టి. రామకృష్ణారెడ్డి అనుభూతికెది ప్రతిధ్వని. 'కవి తన హృదయము నాకర్షించిన యువతిని మనసారా ప్రేమించినాడు. కానీ సంఘ సంప్రదాయములు దాని కంత రాయము కల్గినది. ఆ కారణము కల్గిన విరహ మే కావ్యము రూపమున వెల్లివిరి సినది' అని ఆచార్య దివాకర్ల వెంకటావధాని.

'ఆత్మాశ్రయ (భావ/ప్రణయ) కవితా విధానాన్నే ప్రమాణంగా తీసికొని వ్రాసినాను' అని కవి. ఈ కావ్యం ప్రతిభావ్యుత్పత్తులు ప్రసాదించిన భగవంతుని పాదపద్మముల కంకితమియబడినది. కవి మాటల్లో ఈ కావ్యం ఆత్మాశ్రయ విధానం మాత్రమే. అయితే ఆచార్యుల ఆశీస్సుల ప్రకారం ఇది ఆత్మేతివృత్తం.

ఇందులో కథ చిన్నది. కవిత దొడ్డది. ప్రేమికుడు ప్రియురాలి విరహంతో పొందిన అనుతిభూతి కవి వర్ణించాడు. కవి హృదయం సుకుమార మైంది. అందుచే కవితలో సౌకుమార్యం వుంది. సంయోగం కంటే వియోగం ఆనందం కలిగింపవచ్చు. వియోగం కంటే అయోగం ఆనందం అందీయవచ్చు. ఈ కావ్యంలో వియోగం అంటే అయోగం ప్రసక్తం.

ఏడాది పొడుగునా ప్రేమికుడు పొందిన విరహ వ్యథ వర్ణింపబడింది. ఒక్కొక్క సమయంలో ప్రియురాలు ఎదురవుతున్నట్లే ప్రేమికుడు తలపోసే వాడు. ఒకప్పుడు జాగ్రదావస్థలోను, రానప్పు డజాగ్రదావస్థలోను ప్రియురాలి సాక్షాత్కారం పొందేవాడు ఋతుచిత్ర వర్ణన కావ్యంలో గోచరమవుతుంది. పునరుక్తి కావ్యంలో సామాన్యంగా కనిపిస్తూ వుంటే అనిపించవచ్చు. అయితే విరహమే పునః పునః పునః-అంతులేదు కాబట్టి పునరుక్తిదోషం ఈ కావ్యంలోలేదు.

ప్రేయసీ ప్రియులు కలుసుకొన్నది చాలా తక్కువసార్లు.

సంభ్రమానంద సంచలితుండనై నేను
నలుదెసలు నీ కొరకు విలకించుచుండగా
'ఇదిగో నే నిచట' యను మృదు కంఠమును విని
వెనుదిరిగి నీదు మోహన రూపము గంటి
తొలినాడు మన వలపు వలగాలి పంకమటుల
పంచేంద్రియముల వ్యాపించి నను పొగయించె
దినదినము క్రమముగా మన తను మధుర సం
స్పర్శాను భూతులన్ స్వర్గమటె కుసుమించె.
'మొదటి దినములు కొన్ని మురిపించు స్వప్నములు
తో గడిచె; మరికొన్ని తొలివలపు నులినిగ్గు
తో నడిచె; కొన్ని నాశ్లేష సుఖపడనీక
నీలివిధి ఎడబాటు నట్టేటలో విడిచె'
'దోరమాగిన పండ్ల నూరించుకొనుచు తిని
ఆటలాడితిమి హృదయాలువలపుకుటియ'

ఆ ప్రేయసీప్రియులు సంతోషంగా గడిపిన దినాలు గుర్తుకు వచ్చి ప్రియుడికి దుఃఖం గట్టుతెగి పొంగిపొర్లుతూ వుంటుంది. వారిద్దరికీ ఎడబాటు జరిగింది. అది ఆమెకూ ఇష్టం లేదని ప్రేమికుడి ఊహా! ఆమె ఎప్పుడైనా ఎదురై -

'హాయిగా ఆడుదము తీయగా పాడుదము
నాకసుఖత్వమా స్వప్నలోకమున దేలుదము
ఏల ఈ వైరాగ్యవేలలో వయసంత
రేల్చెదవు? చాలు సఖి! త్రాల్చకుము మనసంత'
అని పలికితే-
'మంచట ప్రపరి గలిపి పలికింపకుము ప్రియ
అంనాటి వలపంత తలపింపకుము బాల' అని-
'బ్రతుకంత విరంతో గడచినది
పలయించు వరె ఎడద రిలవోరె మూరినది' అని—

కలిసంగా మాట్లాడాలని అభిలాష వుంది ప్రేమికుడికి. అంతేకాదు, ఆమె కావాలనీ ఆశ వుంది. వచ్చినతను అనుకొన్నట్లుగానే పలికినా, ఆమె అపార్థం చేసుకొంటుందేమోనని తన తప్పు లేకపోయినా భయపడే సుకుమారుడు ప్రేమికుడు. అందుకే-

'ఎవరేని, ఎపుడో నీ వెదురు పడినపుడు నను
'ఎటులుంటి' వని పల్కరింప నే నేమందు ?
ఈ సమాజపు చెరను ఎటులో బ్రతికెడి బంది
నని బదులు పల్క నీ వన్యత మనుకొందువో'

ఆమె ఎదురుపడి పలకరించిందాకా ఎందుకాగటం, నువ్వేపోయి, ఆమెను పలకరించి రాకూడదా అని ఎవరయినా అడుగుతారేమోనని ప్రేమికుడు చెప్పే సమాధానం - 'ఆత్మదఘ్నాభిమానధ నుండ!'

ప్రేమికుడికి చేతనాలు అచేతనాలుగా, అచేతనాలు చేతనాలుగా గోచరించటం ఆరంభమయింది విరహవ్యథతో తనే వీణ అయిపోయాడు. విరహ గీతాలాపన సాగింది. ఆ స్థితి ఉన్నతదశకు చేరుకొంది, 'ఈ యఖిల విశ్వగత వస్త్వంతరమ్ములు భవప్రమాదమయము' అనుకొనే దశకు చేరుకొన్నాడు.

ప్రేమికుని విరహావస్థ కవి రామకృష్ణారెడ్డి రచించిన తీరు రసజ్ఞులకు ఆనందం కలిగిస్తుంది. భాష బాగుంది. మాత్రాచ్ఛందస్సహిత రచన ఈ కావ్యం. విరహం విపులంగా వర్ణింపబడింది. ఛందస్సుకోసం కొన్నిచోట్ల అనవసర పదాలు ప్రయోగింపబడ్డాయి. కొన్నిచోట్ల భావం బరువు తగ్గి పేలవంగా వుంటుంది. ప్రథమ ప్రయత్నంలోనే సముచిత స్థానం ఆర్జించుకొన్న ఈ కవి ముందు ముందు డా. సి. నారాయణరెడ్డి పలికినట్లుగా ఒక రసపదాకృతి వెలువరించాలని అందరి అంతరంగం అభిలాషిస్తూంది.

5. ఖలీల్ జిబ్రాన్ వ్రాసిన 'ది ప్రొఫెట్' ఉత్తమ కవితా రూపం. దానికి కాళోజీ అనువాదం 'జీవన గీత'. భగవద్గీతను తలపించే జీవిత సత్యాల క్రోడీకరణం విశ్వకవి కవితానువాదం 'జీవన గీత'.

తెలంగాణా కవులలో శ్రీ కాళోజీది ఒక ప్రత్యేకత. వాణిలో విశిష్టత పలుకులలో నూత్నత. 'ఆల్ ముస్తఫ అర్ఫలీజు' పట్టణంలో పన్నెండేళ్ళున్నాడు తనను తీసుకుపోయే నావ వచ్చింది. వెళ్ళేముందు ప్రశ్న అడిగినవారికి చెప్పిన సమాధానాలు ఈ కావ్యం.

ప్రేమ వైవాహిక బంధం, పిల్లలు, దానం, తినటం, త్రాగడం, కాయ కష్టం, సుఖదుఃఖాలు, ఇల్లు, బట్టలు, క్రియవిక్రియాలు, నేరము, శిక్షా శాసనాలు స్వాతంత్ర్యం, వివేకావేశాలు, వేదన, ఆత్మ జ్ఞానం, విద్యా బోధనం, మైత్రి సంభాషణ, కాలం, మంచి చెడులు, ప్రార్థన, సుఖం, సౌందర్యం, ధర్మం, మృత్యువు మున్నగు విషయాల గూర్చిన కవిత సాంఘిక జీవిత గీత. పుట్టటం దగ్గర నుంచి గిట్టటందాకా సమస్త ప్రధాన సంగతులు సృజించిన ఈ కవితకు 'జీవన గీత' అన్న పేరు ప్రత్యక్షర పరమ రమణీయం.

ఖలీల్ ప్రపంచ కవి. తెలంగాణా కవి శ్రీ కాళోజీ. ఇద్దరి మధ్య సంబంధం కవిత్వం. 'తానుండిన కాలమునకు తానె ఉషస్సైనవాడు' ఆల్ ముస్తఫ! అతని పలుకులు ఎంత సత్యాలు! కొంత సేపే-గాలి సూయలనూగుచు

సేదదీర్చికొనుట నేను-కొంతసేపే-అంతలోనే మరో మాత నన్ను చేసి గర్భాన దాల్చు!

ప్రాచీన వచనం గద్యం ఛందస్సహితాలని గుర్తించిన కవి శ్రీ కాళోజీ. అయితే ఈ వచన కవితలో ఛందస్సుంచాలని చేసిన ప్రయత్నం నిష్ఫలంగా నిరర్థకంగా తయారయింది. ఛందస్సు తోని రచన అయినా బాగుండేది. వచన రచన అయినా బాగుండేది. రెంటికి మధ్య రచన సొగసుగా సాగలేదు. భాషలోనూ, గ్రాంథిక, వ్యావహారిక దళంమారం ఈ కవి గుర్తించలేదు. అనువాదంలో అవరోధం కొంతవరకు లేకపోయినా - ప్రయోగించిన తెలుగు కొంత కృతకంగా ఉంది. సొంత రచన చేసే శ్రీ కాళోజీని మహాకవులు చూడాలని తెలుగువారు కోరతారు.

6. అభ్యుదయ కవిత్వం నేడు ప్రసిద్ధులూ, అప్రసిద్ధులూ, యువకులూ వెలువరిస్తున్నారు. అవి సంకలనాలుగానూ ప్రచురణం పొందుతున్నాయి.

‘గోర్రెదాటు’ శ్రీ కాళోజి రచన. కవితా సంకలనం ‘సంఘర్షణ’ లోనిది. గొర్రె కొవ్వెందంతా గొల్లోడికి లాభం. అన్నా కాళోజీ! ఇటువంటి కవిత్వం వ్రాయి అన్నా! అని ఆంధ్ర సోదరులు అభ్యర్థిస్తారు.

నేటి తెలంగాణాభ్యుదయ కవిత్రయంలో ఎర్రన శ్రీ కాళోజీ. తిక్కన డా. సి. నారాయణరెడ్డి. తిక్కన, ఎర్రనను సీనియర్ కవి అనటం రసజ్ఞులకు ఆత్మ సంతృప్తి! నన్నయ శ్రీ దాశరథి.

‘అహింసా హంస ఈకలు పీకనిదే ఉన్మాదికి నిద్రపట్టదు’ ఈ విషయం శ్రీ వరవరరావే చెప్పాలి మరి ఇంత సూటిగా! ‘వృషభ పురాణం’ పేర్వారం జగన్నాథం చేసిన రసవద్రచన. ఈ రచన త్వరగా ముద్రించాలని పాఠకులు కోరతారు. శ్రీ అద్దేపల్లి రామమోహనరావు లోకాన్ని చూచి భయపడుతూ పిరికి మందు నూరిపోయటం కష్టం కలిగిస్తుంది. ఇంతకాలం నుంచి చూస్తున్నా

శ్రీ సోమసుందర్ కవిత ముందడుగు వేయటం లేదు. డా. సి. నారాయణరెడ్డి 'కవితే ఊహలకే కన్నులుంటే' చరణం వంటిదే 'కత్తికే కన్నుంటే అనే' శీర్షిక!

యన్. మనోహర్ వంటి వర్ధమాన కవులు ఈ సంపుటిలో చాలామంది వున్నారు. అయితే ఈ యువరచయిత కవిత రసజ్ఞులు ముందు ముందు ఎదురు చూస్తారు. 'సినిమా రంగంపై ఎక్స్ట్రా లాంటిది సుమస్త్రాగిరి'- నిజం!

అభ్యుదయ కవిత్వం సూత్ను యొప్పునారంభ దశలో వుంది. ఇటువంటి కవితలు అభ్యుదయ కవితా కాంక్షను బలపరుస్తాయి. ఎదగవలసిన యువకవులు ఇటువంటి కవితా సంకలనాల ప్రోత్సాహంతో మంచి రచనలు చేస్తారని ఆశింప వచ్చు. ఈ సంపుటిలోని నిరాశాస్ఫోరకాలే వచ్చే సంపుటుల్లో ఆశాజనకాలుగా రూపొందవచ్చు గదా!

అ, ఆలు నేర్చుకుంటున్న పిల్లల్ని చూచి తల్లి తండ్రులు ఎంత విద్యా వేత్తలయినా ఆనందించటం పరిపాటి! విద్యార్థులు రేపు జీవితంలో ఏ రంగంలో ఉన్నత ప్రమాణాలు చూస్తారో కించిన్మాత్రంగా విద్యార్థి దశలోనే తెలుపుతారు! ఏ పుట్టలో ఏ పాముందో చెప్పటం కష్టం! కొత్త గొంతులు వివిధంగా వినిపి స్తాయి. కొన్ని ధ్వనులే ఆకట్టుకొంటాయి. ఆ కొన్నింటి కోసం పెక్కింటిని వినాలి. ఆ వినిపించే ప్రయత్నం ఈ క్రొత్త గొంతుకలు! అభ్యాసప్రాయమైన రచనలన్నీ ముద్రణార్హం అవుతాయా అన్నది ముద్రణా సౌకర్యం సమగ్రంగా లేని రోజుల్లో మాట !

కవితా వ్యవసాయంతో విస్తృత విశ్వక్షేత్రం తమకందిన కోణంనుంచి దర్శించిన చిరంజీవులు భవితవ్యపు వెలుగు బావుటాలు తిలకించగలరనే ఆశా వుంది. ఏం చేస్తారో అనే నిరాశా వుంది. ప్రాణి సహజమయిన చైతన్యం చలిత రంగంగా కవితారంగం కావటమే ఆనందం !

ఇందులో ప్రయత్నపూర్వకంగా చేసిన రచనలూ ఉన్నాయి. తయా రయిన భవ్యయితలూ వున్నారు. అయితే రచయితలు అందరికి అంతో ఇంతో

ఆవేదన ఉన్నట్లు అనిపిస్తుంది. వాళ్ళకి సమాజం సంతృప్తి కలిగించలేదు. కలిగిస్తుందనే ఆశ ఎవరూ వ్యక్తం చేయలేదు. నిరాశ! నిస్పృహ!!

7. నేడు తెలుగువచన కవిత్వంలో అనుభూతి కవిత్వం చోటు చేసుకొంటూ వుంది. అందులో సుప్రసిద్ధుడు శ్రీ వేగుంట మోహన్‌ప్రసాద్. 'చితి-చింత' ఆ ధోరణిలో సాగిన కవితా సంకలనం.

ఈ సంకలనంలో ఉంది స్వాతంత్ర్యం కవిహృదయం. అంతకంటే బాహిరంగా కనిపించే వస్తుస్వరూపం పరిశీలింపదగింది. సంపుటి చదవటం ముగించిన తర్వాత ఒకే విధమైన స్థబ్దత, నిర్వేదం కలుగుతాయి. ఆ అనుభూతి పొందగలిగిన, అటువంటి అనుభూతుల నివ్వగలిగిన కవితలు హృదయంలో చోటు చేసుకొంటాయి.

సామూహికంగా ఆ అనుభూతి లభ్యమవుతుంటే కానీ, ఏ కవితా పూర్తి స్పష్టత కలిగివుందని చెప్పే అవకాశం లేదు. ఈ అనిర్వచనీయత ఒక్కొక్కప్పుడు కవితకు మెరుగుదనం. భాషలో వైవిధ్యం ఎక్కువ. ఇంత చిత్రమైన భాష ఏ కవీ వ్రాయకపోవచ్చు. కొంత ఇంగ్లీషు, కొంత గ్రాంధికం, కొంత వ్యావహారికం, కొంత గ్రామ్యం, ఇంత గమ్మత్తయిన భాష బుద్ధిపూర్వకమే!

ఒక్కొక్క శీర్షికలలో భావనా బలంకంటే శిల్పబలం అధికంగా కనబడుతుంది. వాక్యాలు, పదాలు, విరుపులు, కుదింపులు శ్రీ ఆరుద్ర 'త్వమేవాహమ్' గుర్తుకు తెస్తాయి. అర్థ స్పష్టత్వం లేకపోయినా శిల్పంవల్ల అనుభూతి ఆంతర్యం రగుల్కొంటుంది.

ఇతర కవుల ప్రసిద్ధ పదబంధాలు, పుట్‌నోట్స్‌లో అర్థబోధన యత్నం కవితా సంపుటలలో సాధారణంగా కనిపించవు. ఈ సంపుటిలో కనిపిస్తాయి. పల్లె జీవితం ఈ కవిపై చూపిన ప్రభావం చాలా ఎక్కువ. కొన్ని దృశ్యాలు కళ్ళకు కట్టినట్లు నిలిచిపోతాయి. ఎప్పుడో చూచిన దృశ్యాలు ఆకస్మికంగా ఎదుట నిలుస్తాయి. పల్లె జీవితం పల్లె భాషలో ఎదురవుతుంది.

తను పొందిన అనుభూతిని, అనుభూతులను చదువరుల చేత యథాతథంగా అనుభవింపచేయగల, వాస్తవికతకు కవిత పూర్తి అనువాదంగా చేయగల సామర్థ్యం కవికి వుంది. ఒక క్రొత్త కవి కవితా సంపుటిగా తెలుగు రసజ్ఞులకు లభ్యమైన ఈ సమయం ఆనందం కలిగిస్తుంది.

భాషా సంస్కారం సాధించి, పెంచుతూ అధికంగా అర్థ స్పష్టత సాధించి, ఈ అనుభూతి కలిగించే సామర్థ్యం ఈ విధంగానే నిలుపుతూ శ్రీ ప్రసాద్ ముందు ముందు మరింత మంచి రచనలు చేయాలని, కవితా కీర్తి పొందాలని ఆశింపవచ్చు.

వర్తమాన కాలంలో కవిత్వం వివిధ ప్రాంగణాలతో సాగుతూ ఉంది. నేటి కవితకు చరిత్ర వస్తువు కావటం తగ్గింది. భావ కవితా ధోరణి కంటే అభ్యుదయ కవితా మార్గం విశాలమవుతూవుంది. యువకుల ఉత్సాహం, ఆవేశం కవిత రుచి చూస్తూవుంది. అనుభూతి మాధుర్యం సంతరించుకొంటూ ఉంది. వచన ప్రాధాన్యం పొందుతూ ఉంది. శుభ పరిణామాలకు ఇది ఆహ్వానం.

# 3. తెలుగు కథానికా శిల్పం

ఇందులో నాలుగు కథా సంపుటాల సమీక్ష వుంది. శిల్ప మార్మికత పుణికి పుచ్చుకొన్న కథానికలు కానీ, శిల్ప మర్మజ్ఞులైన కథా రచయితలు కానీ ప్రత్యేకంగా ఈ పరిశీలనలో భాగం కాదు. సమీక్షించే వాటిలోని శిల్పం దర్శించటమే కర్తవ్యం.

1. ఆశాజ్యోతి కథానికా సంపుటి రచయిత శ్రీ చంద్రమౌళి సుప్రసిద్ధ కథా రచయిత కాకపోవచ్చు కాని మంచి కథా రచయిత. ఈ కథలలో బలం ముగింపులో వుంది. ఆధునిక కథా జీవితం ముగింపు ముచ్చటమీద శిల్ప విషయంలో ఆధారపడి వుంది. అనూహ్యంగానూ, సహజంగానూ ఉన్న ఉప సంహారం తీరుతెన్నులు దర్శించటానికి ఈ సంపుటి అవసరం.

'స్పర్థయా వర్థతే విద్యా' అనేట్టుగా కార్ఖానా చిన్నదిగా వున్నప్పుడు పని వారు, పెద్దదయింతర్వాత పనికిరాకపోతే, పనికివచ్చే వాళ్ళను కుదుర్చుకోవడంతో, స్పర్థ కలిగి టెక్నీషియన్‌గా ఆగమయ్య అభివృద్ధిచెందిన కథ "స్పర్థ."

కాలక్షేపం కోసం రైల్వే స్టేషన్‌లో ఒక పాఠకుడు ఒక పత్రికలో కథ చదివి, ఆ కథలో ఆ స్త్రీ పాత్ర ఆ పరిస్థితుల్లో చనిపోతుందా? లేదా? అయితే ఎందుకు చనిపోతుంది? అని ప్రశ్నించుకొని, అభినందించడం కోసం, అనుకోకుండా రచయితను చూడబోయి, రచయిత్రి అని తెలిసికొని, ఆమె చనిపోవటం చూచి, జవాబు గ్రహించి తిరిగి వస్తాడు. ఇది 'నాకు నచ్చిన కథ.'

గుమస్తాగా బ్రతుకుతూ, ఆశలేక, ఆశయాలు త్రెంచుకొని, మత్తుడయిన సంసారం, రజని స్టెనోగా చేరి, అతని జీవితంతో పరిచయం ఏర్పరుచుకోగా

ఆమె ప్రవేశంతో జీవితంలో ఆశాతేజం కనిపించి జ్యోతి వెలిగించుకొన్న యువ కుడిలో చైతన్యం చెప్పే కథ- 'ఆశాజ్యోతి'.

బెజవాడ గుంటూరు ప్రాంతాల నుంచి, బోధన్ ప్రాంతాలకు పోయి, పొలాలు కొని, స్థిరపడి, కొత్త పద్ధతుల్లో వ్యవసాయం చేసి, వరి, చెరకు పండించిన కొందరు స్థానికమైన చిక్కులు, రజాకార్ల దుండగాలు ఎదుర్కొన్న కష్ట నష్టాలు చూపించే రచన 'కొత్త గడ్డ'.

ఉద్యోగం కోసం రెకమెండ్ చేయించాలని ఇద్దరు పెద్ద మనుష్యులకు చెప్పిన విశ్వనాథం- తనకు ఉద్యోగం వాళ్ళ వల్లనే వచ్చిందనుకొంటుండగా వాళ్ళ కొడుకులే తన తరగతి వాళ్ళు కావటం 'అసలు రహస్యం'.

సుచిత్ర చిత్రమయిన యువతి. ఆమె విచిత్రత అర్థం చేసుకోలేదు సత్యం. వీరిద్దరితో పరిచయమయి, అర్థం చేసుకో ప్రయత్నించి విఫలుడై పోతాడో యువకుడు-. ఇది 'తామరాకూ-నీటిబొట్టూ'.

ముసలిదయిన సీతారత్తం పనిచేసే కార్ఖానాలో ఆమె బదులు ఎవరినయినా ఏర్పాటు చేయవచ్చునని తెలిసి పిల్లలు లేని ఆమె ఆ ఖాళీ ఏం చేసుకొంటుందని- వాళ్ళూ వీళ్ళూ అడిగి రెండు వేల దాకా ఖరీదు కట్టారు. కానీ భర్తకు ఇష్టుడయిన బుచ్చిగాడికే ఇచ్చేందుకామె ఇష్టపడుతుంది- ఇది 'చుట్టరికం'.

ఈ కథల్లో మామూలు అమ్మాయి - అబ్బాయి - ప్రేమ పద్ధతి కథలు తక్కువ. అన్ని కథలు సామాన్య కథల స్థాయి దాటి వున్నాయి. కథల్లో కథ కంటే రచనలో మెరుగులున్నాయి. చెప్పే పద్ధతిలో నేర్పు కనబడుతున్నది.

ప్లాట్‌ఫారం మీద పాతకుడి పాట్లు పెంచకుండా వుంటే 'నాకు నచ్చిన కథ' మన మంచి కథల్లో ఒకటి అయివుండేది. 'కొత్తగడ్డ' లో జీవితంలోని పరిణామ దశ, చైతన్య లక్షణం కనిపించాయి. ఇటువంటి కథలు అవసరం. 'తామరాకూ-నీటిబొట్టూ' యువకులలో అవ్యవస్థకు, అసంకల్పితాంతు నిదర్శనం- చక్కని కథ.

ప్రతి కథలోను ఒక నూత్న దృక్పథం వుంది. ప్రతి కథ చివర కొస మెరుపు వంటి 'ట్విస్టు' వుంది. ఉత్సాహంతో సాగి, ఉత్సాహంతోనే కథలన్నీ ముగిసి, రచయితను 'ఆప్టిమిస్టు'గా, ఆశావాదిగా చూపిస్తాయి అనటానికి పుస్తకం పేరు ఆశాజ్యోతి చక్కగా వుంది. ఒకటి, రెండు కథల్లో తెలంగాణా భాష వుంది. రెండు మూడు కథల్లో తెనుగుదనం కనబడుతుంది. మంచి కథానికా సంపుటి.

2. చిన్న కథలో భిన్న పాత్రల స్వరూప స్వభావాలు తీర్చి దిద్దటం సామాన్యమయిన పనికాదు. ఒక్కమాట ఒక్క వాక్యం ఒక్కొక్కసారి పాత్ర చరిత్రకు వ్యాఖ్యానం కావటమే మిగులుతుంది. పాత్ర అస్తిత్వానికి అర్థం కల్పించటమే చిన్నకథలో సమస్య అవుతుంటే చిరకాలం నిలిచే పాత్రగా రూపొందించటం శిల్పవేత్తకే సాధ్యం.

శ్రీ బలివాడ కాంతారావు 'సుగుణ' అనే పెద్ద కథలో భార్యాభర్తల పాత్రలతో పాటు సావిత్రి, రచయిత పాత్రలు మర్చిపోలేనంత బలంగా రూపం దిద్దుకొన్నాయి. పాత్ర చిత్రణంలో మేటి స్రష్టలుగా అవి చిరంజీవులయ్యాయి. భార్యాభర్తల పాత్రలు దూకుడులో, ఓర్పులో గడుసుగా మసలుకొంటే మిగతా రెండు పాత్రలు దయనీయంగా సిద్ధించాయి. మానవ జీవన వైచిత్రిని పాత్ర గతంగా భద్రం చేసిన 'సుగుణ' మంచి కథ.

ఈ పెద్దకథలో ప్రధాన పాత్రలు భార్యాభర్తలు. భార్య సుగుణ, గుణ వతి, విద్యావతి, తన అర్హత, స్థానం గుర్తించిన వ్యక్తి. వ్యక్తిత్వానికి 'సుళ్ళ కంచెలా కనిపించేవాన్ని త్యజించటానికి వెనుదీయని శీలవతి. కాలేజీచదువు మధ్యలో ఆపివేసింది. మంచి సంబంధాలు వదలుకొంది. ప్రేమించగల భర్తను ఎన్నుకోవటమే ఆమె సాధించిన ఘనకార్యం. ఆమె తిట్టినట్లే మాట్లాడుతుంది. తిట్టదు. పొగిడినట్లే వుంటుంది. పొగడదు. చాలా గడుసుమనిషి. తను కోరింది అడక్కుండా భర్తచేత తెప్పించుకోగలదు, చెప్పించుకోగలదు, చేయించుకోగలదు.

భర్త గుమస్తా! చిన్నతనంలో అల్లారుముద్దుగా పెరిగి పెద్దవాడయి, పెద్దవాడయిన వ్యక్తి, భార్య కంట తడిపెడితే సహింపలేడు. స్త్రీకి వ్యక్తిత్వం వుందని గ్రహించి, దాన్ని గౌరవించటం అలవాటు చేసుకొన్న మనిషి. భార్యను సంతోష పెట్టటానికి హృదయపూర్వకంగా ప్రయత్నిస్తాడు. ఆమె బాధపడితే బాధోపశమనం కలిగింప జూస్తాడు గానీ, ఆ యత్నంలో ఆమె వ్యక్తిత్వం దెబ్బతింటుందంటే నిర్వికల్పంగా ఆలోచింపగల సమర్థుడు.

ఈ రెండు పాత్రలతో పాటు పాఠకుల దృష్టిలో నిలిచిపోయే పాత్రలు సావిత్రి, రచయిత. చిన్నతనంలో శిరోముండనంతో కనిపించిన సావిత్రి, పెద్దయి పెళ్ళి నిర్ణయం పట్ల ఇష్టానిష్టాలు ప్రదర్శింపలేని సావిత్రి, పెళ్ళయిన సావిత్రి- ఏ విధంగా సావిత్రిని చూచినా పాఠకులకు దిగులు కలుగుతుంది.

రచయిత దయనీయ పరిస్థితి, ఇల్లు వదలి పారిపోయి రావటం, నిరాశ్రయుడుగా జీవించటం అర్హతా నర్హతలు గుర్తించి ప్రవర్తించటం, ఎదుటివారి శ్రేయస్సునే కాంక్షించటం చూస్తే రచయితలోని ఔన్నత్యం పాఠకులను సంతోష పెడుతుంది. రచయిత మార్చిన జీవితం కథానాయకుడిలోచూచి సుగుణ సంతోషించినట్లే పాఠకులు సంతోషిస్తారు. తను బాధపడినా ఇతరులు సంతుష్టి పొందాలని తపన చెంది రచయిత పాత్ర ఉదాత్తమయింది.

పాత్ర సృష్టిలో శ్రీ బలివాడ కాంతారావు చూపిన నేర్పు విశిష్టమయింది. ఎంత చిన్న పాత్ర అయినా మనస్సులో నిలిచిపోయేటట్లు మలచగల రచయిత ప్రజ్ఞ చిత్రించిన పాఠకులు సంతోషాంతరంగులవుతారు. ప్రతి పాత్రా పతిత్వ లోపం కళ్ళెదుట తిరుగాడుతుంది. చిన్న సంభాషణతో, చిన్న వాక్యంతో పాత్ర వ్యక్తిత్వం కాంతిమంతమయి గోచరిస్తుంది.

పెళ్ళయిన మూణ్ణెల్ల తర్వాత రెండూ మూడు రోజుల్లో జరిగిన కథలో గుర్తు తెచ్చుకొన్న గతం చిత్రితమయిందీ పెద్ద కథలో. భార్య తన ప్రేమ

కథ చెబుతూ వుండే ఏమాత్రం సంచలనం ప్రదర్శింపలేదు భర్త. భర్త తన గత జీవితం చెబుతూ వుంటే ఏమాత్రం పట్టించుకోనట్టు కనిపించిన సుగుణ కథాంతంలో కడుపు నొప్పి వచ్చినట్లు ప్రవర్తించటం అర్థమయితే స్త్రీత్వం అర్థమయినట్లే ! సుగుణ చెప్పిన ప్రేమ కథ నిజమా, అబద్ధమా? నిజమయితే అంత లౌకికురాలయిన సుగుణవంటి స్త్రీ అలా చెబుతుందా? చెప్పకపోవచ్చు. అబద్ధమా? అయితే ఎందుకు కల్పించింది? భర్తచేత తన ప్రేమగాథ చెప్పించటానికా? కావచ్చు. అది నిజమయితే ఆమె నేర్పు గొప్పది, రచయిత నేర్పు ఉత్తమం. సుగుణ చెబుతూ వున్నది కల్పనగా అయినా వుండాలి. ఆమె చెప్పింది నిజమా? అబద్ధమా? అని తేల్చుకోవటానికి భర్త ప్రయత్నించలేదు. సుగుణ పలికిన చివరి మాటవల్ల పూర్తి సత్యం తెలుస్తుంది.

పెళ్ళయిన కొత్తలో ఎవరయినా తమ పూర్వ ప్రేమ వ్యవహారాలు చెప్పుకొంటారా అనేది ప్రశ్న. ఎందరో మహానుభావులు! కొందరు చెప్పుకోవచ్చు. చెప్పుకోవటం వాస్తవమయితే నవలిక అంతా వాస్తవంగా వుంది. ఈ రచన జీవితమే చిత్రించింది. పులుముడు లేకుండా, ఉదాత్త భావ వ్యక్తీకరణంతో సహజ చిత్రణ చేయగల రచయితలలో శ్రీ బలివాడ కాంతారావు సముచిత స్థానం సముపార్జించుకొన్న సత్యం పాఠకులకు ఇంతకు పూర్వమే తెలుసు. ఆ సత్యం ఈ పెద్ద కథలో పునస్సందర్శనం అవుతుంది.

ఇందులో రచయిత పేరుతో ఒక పాత్ర వుంది. ఆ రచయిత కొన్ని కథలు వ్రాశాడు. ఆ చిత్రణ కథానాయకుని స్వభావ చిత్రణలాగా వుంది. ఆ కథల వల్ల కథానాయకుడిలో పరివర్తన రావటం బాగుంది. ఆ కథలు చక్కని రచనలు కూడా! అయితే అవి ఇందులో యథాతథంగా చెప్పటం వల్ల కథాగమనంలో మార్పు వచ్చింది. ఆ మార్పు ఉచితం కాదు.

భర్త, భార్యతో ఎప్పుడో రచయిత చదువుకోమని ఇచ్చిన కథలు చెప్పేటప్పుడు ప్రధాన విషయాలు చెప్పటంలో అవాస్తవికత లేదు. సంభాషణలు క్రమంగా ప్రత్యక్షర పరమార్థంగా చెప్పటం కొంతవరకు వాస్తవికం కాదు.

హృదయం తాకే ఉదాత్త విషయాలు స్వల్ప శ్రమతో, చిన్న వాక్యాలతో చెప్పగల నేర్పు రచయితకు వుంది. జీవితం నుంచి జనించిన ఇటువంటి కథలు చాలా తక్కువ మంది వ్రాయగలరు. తెలుగు కథా సాహిత్యంలో ఒక మంచి రచన చదవాలనుకొనేవాళ్ళు ఈ 'సుగుణ'ను చదవవచ్చు.

3. కథానికా ప్రారంభమే సాధ్యమయితే ఆసక్తికరం కావటంతోపాటు వాతావరణ కల్పన చేయగలిగిందిగా ఉండాలి. ఉత్సుకత వాతావరణ నేపథ్యం నుంచి ఉదయిస్తే కథా ప్రారంభం శిల్ప సిద్ధి పొందినట్లే! ఈ వాతావరణం ఆసాంతం నిర్వహిస్తే ఈ ఔత్సుక్యం పరాకాష్ఠ నందుకొంటుంది.

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య కథానికా సంపుటి 'నీళ్ళు'లో ఈ వాతావరణం కల్పించే నేర్పు పరికింపవచ్చు. దీనితో అనుసంధానం పొందిన విశేషం పాత్ర చిత్రణ. నీళ్ళు లేనిచోట పుట్టి పెరిగిన వ్యక్తి నీళ్ళున్నచోట జీవిస్తుంటే కలిగే సంచలనం కథారంభంలో పాఠకుల్ని ఆకట్టుకొంటుంది. పాత్ర వాతావరణంలో భాగంగా కనిపించటం పెరగటం సామాజిక సత్యం. ఈ కథా వాతావరణం ఆంధ్రత్వం నిక్షిప్తం చేసుకొని వుంది. తెలుగు సమాజం, జనం, మనం స్పష్టంగా ఉన్న కథా సంపుటి 'నీళ్ళు'.

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్యకు ఉజ్జ్వల భవిష్యత్తు వుంది. ప్రతి కథలోనూ ఒక ప్రత్యేకత ఉండటం ఈ సంపుటిలోని ఎనిమిది కథలు చదివిం తర్వాత, పాఠకులు గమనిస్తారు. రచనా నైపుణ్యం కూడా తెలుసు. కథా శిల్పం రచయితకు తెలుసు. వాతావరణ కల్పనలో నేర్పు వుంది. పురుష పాత్రల రూపు రేఖలు, స్వభావాలు స్పష్టంగా చిత్రించటం తెలుసు.

పురుష పాత్రల స్వభావానుగుణ చిత్రణ కథా సంపుటిలో మేలిగుణం. జోగినాథం పాత్రలో దీనత ఎంత చక్కగా కనబడుతుందో, ఉమాపతి, లక్ష్మీపతి పాత్రలలో 'జల్సా' అంత బాగా కనబడుతుంది. శ్రీదేవినే ప్రధానంగా చెబుతూ వున్న కుమారస్వామి ఉన్నతత్వమే గోచరమవుతుంది. సారథిలో తపస

గుండెలు పిండుతుంది. నిద్రపట్టని గంగాధరానికి నిద్రపట్టేని నాటి సీతి జీవితం లోంచి వెలికురికిన సత్యం. చంద్రమౌళి పరికించిన పార్థసారథిలో అతను పెంచుకొన్న ఆత్మీయత, వెనుక అర్థంకాని జీవిత మోహ దర్శనమిస్తుంది.

పురుష పాత్రలు అనేక కోణాలనుంచి దర్శించి చిత్రించిన రచయితకు స్త్రీ పాత్ర విషయంలో అది సాధ్యపడలేదు. కుసుమ హృదయం దాచుకొన్న టైపిస్టు. అంతే! 'మనసు'లోని కూతురూ, కోడలూ రేఖా చిత్రాలు. క్షయరోగి భార్య బలైపోవటం తప్ప అన్యం తెలియని స్త్రీ. పరిపూర్ణ వ్యక్తిత్వం గల స్త్రీ పాత్రలు ఆ కథలలో లేవు, శ్రీదేవి తప్ప. ఆమె చక్కని ఇల్లాలు. ఆ పాత్ర సృష్టిలో రచయితకిది ఇష్టసిద్ధి !

'భ్రష్టయోగి' చైనా దురాక్రమణ సందర్భంలో ప్రచారార్థం వ్రాసిన రచనే అయినా, అచ్చమైన తెలుగు వాతావరణం అందిపుచ్చుకొన్న కథానిక.

'కలలో మనిషి' ఒక మధురోహ! ఇలా జరిగితే ఎంత బాగుంటుందీ అనే ఆశకు రూపకల్పన! అయిన మంచితనం రూపుదాల్చిన రెండు పాత్రల పట్ల సానుభూతితో పాఠకులు ఈ కథ చదివి సంతోషించవచ్చు. 'మనసు' లోని తాతయ్య, 'మబ్బువిడిచిన ఎండ' లోని ధనంజయరావు వయసు మళ్ళిన పాత్రలు. ఆ పాత్రల చిత్రణ వెనుక పరిపక్వ రచయిత మనస్తత్వం లేదు. యువకుడయిన రచయిత, వృద్ధాప్యం గూర్చి, ఆ పరిస్థితుల గూర్చి, ఎలా ఆలోచించటానికి అవకాశం వుందో, అలాగే రచన సాగింది కాని వృద్ధాప్యం అనుభవించిన రచయిత చిత్రించినట్లు లేవు ఆ పాత్రలు.

వర్ణనలు బాగున్నాయి. కథాగమనానికి ఎడనెడ అడ్డుగా కూడా నిలిచాయి. వర్ణనలు కొంతవరకు కవిత్వంలాగా వున్నాయి. కొన్ని వర్ణనలు ఈ రచయితకే ప్రత్యేకం. మరొక రెవరూ ఆ విధంగా చేయని వర్ణనలు - ఈ సంపుటిలో కని పిస్తాయి.

భావాల మాటున ఆంగ్లత్వం కనిపించినా, కథలలో తెలుగు వాతావరణం వుంది. తెలుగు సమాజంలో, ఇళ్ళలో, వ్యక్తులతో జరిగిన సంఘటనలు రూపు దిద్దుకొన్న రచనలు చక్కని తెలుగు కథానికలు. కథాపథకం, పాత్ర చిత్రణ. చక్కగా చేయగల ఈ రచయిత కథ నడపటంలో జాగ్రత్తి తీసుకోకపోవటం విచారకరం. రచయితకు కుంటుపడని శైలి లేదు. రచన పరిశ్రమ ఫలితంగా కనిపిస్తుంది. సాఫీగా, నిరాఘాటంగా సాగలేదు. ఈ దోషం వల్ల కథలకు రావలసి నంత ప్రచారం రాకపోవచ్చుననిపిస్తుంది.

'రాహ్వా - రత్నాయా' చక్కని తెలుగు జీవితంతో నేర్పయిన పాత్ర చిత్రణతో ముచ్చటయిన కథ. "నీళ్ళు" - నీటి చుట్టూ పెరిగే నాగరికత తెలిపే ఉద్దేశ్యంతో సాగిన ఈ కథ రచనలో పటిష్ఠతను సంతరించుకొని ఉన్నట్టయితే ఆంధ్ర కథా సాహిత్యంలో చాలా మంచి-కథ అయి ఉండేది.

ప్రత్యేకమయిన శైలి ఏర్పడితే, చదివించే నేర్పుతో వ్రాయటం అలవాటు అయితే, ఈ రచయిత ముమ్ముందు వ్రాసేకథలు ఆంధ్ర సాహిత్యంలో ఉన్నత స్థానం పొందుతాయి.

4. కథన నైపుణ్యం, కథా రచయితలందరికీ అబ్బిన విద్యకాదు. కథ ఎంత చెప్పాలో, ఎంత చెప్పరాదో, ఎక్కడ పెంచాలో, ఎక్కడ తగ్గించాలో, ఏం చెప్పరాదో, ఒక సన్నివేశంతో మరో సన్నివేశం ఎలా అనుసంధించాలో, ఏ పాత్ర ఎప్పుడు ప్రవేశించాలో, ఎప్పుడు నిష్క్రమించాలో ఏంచేయాలో, ఎలాఛేయాలో చిత్రించుకొంటూ పోవటం కథన సామర్థ్యం తెలుపుతుంది. కథాకథనం విభిన్న విశిష్ట ధర్మ సంచయం. ఆ ధర్మ స్వరూపం గుర్తించిన రచయితలు ఏ సాహి త్యంలో అయినా అరుదుగానే వుంటారు. జీవితంలోని కారుణ్యం కథనం పదను తీరినట్లున్నాయి 'తిలక్ కథలు'. తిలక్ ప్రధానంగా కథా రచయిత కాదు. కవి. కానీ ఉత్తమ కథా రచయితలలో ప్రసిద్ధుడు.

ఇవి జీవిత వైచిత్రిని పరామర్శించే వస్తువులు. పరిమితా పరిధిని స్పృశించే రచనా విశేషం, ఉత్తమ కథానికకుండే గొప్ప శిల్పధర్మం కథన సామర్థ్యంతో కలిసి ఏర్పడ్డ కథలు. ఇవి బ్రతుకుమీద ఆశను, పొరుగువాడిమీద ప్రేమను, సాహిత్యం మీద ఆసక్తిని, సమాజంమీద విశ్వాసాన్ని కలిగించే కథలు. కథానికా శిల్పంలో శిఖరప్రాయంగా 'ఊరిచివరి ఇల్లు,' కానీ, 'సర్జెంట్ల రోడ్డు' కానీ దర్శిస్తే చాలు.

'సుందరీ-సుబ్బారావు', 'ఉంగరం', 'ఊరిచివర ఇల్లు', 'సముద్రపు అంచులు', 'ఆశాకిరణం' చదువుతుంటే అప్రయత్నంగా కళ్ళనుంచి నీళ్ళువస్తాయి. 'బాబు' 'సీతాపతి కథ', 'సర్జెంట్ల రోడ్డు,' 'దేవుణ్ణిచూసినవాడు' చదివితే ఆశ్చర్యంతోపాటు ఆనందం కలుగుతుంది.

'సుందరీ-సుబ్బారావు' ఏకత్రైవానురాగ సృష్టి. జాలి. 'ఉంగరం' అమాయిక అమాయకత్వం, జాలి. 'ఊరి చివర యిల్లు' వేశ్యకథ. గుండెలు చీల్చుకుపోతాయి. వేదన, 'సముద్రపు అంచులు' బెస్తవాని బ్రతుకు బళ్ళబాట. దిగులు. 'ఆశాకిరణం' కూతురు వేశ్య అయితే ఆమోదించే తండ్రి బ్రతుకు. దిగులు. ఇవి జాలి దిగుళ్ళ కథలు.

'ఊరి చివరియిల్లు'లో ముసలిది, రమ వాక్కులు అసత్యం అని చెప్పిన తర్వాత, అగంతుకుడు పలాయనం చిత్రగించడంతో కథ ముగిసిపోయి వున్నట్లు అయితే సాఫీగా నడిచే బాటలో చక్రం క్రింద రాయిపడి ఒక్క కుదుపు కలిగి మామూలుగా వెళ్ళిపోయే రెండెడ్ల బండిలాగా పాఠకుడి గుండె వూగిసలాడిపోయి వుండేది.

తిలక్ హృదయవాది. రమ పట్ల సానుభూతి వుంది. కథ అలా ఆపలేక పోయాడు. గుండెలు పిండే కథారచన చేయగల రచయిత అంతోయింతో కర్కశత్వం కలిగి వుండకపోతే కథ ముగింపు పకడ్బందీగా వుండదు. మహోత్తమ కథ ఎన్నుకొన్న తిలక్ చక్కగా వ్రాస్తూ మధ్యలో మనిషి అయిపోయి, కోమల

హృదయుడయిపోయి, ముగింపు పెంచాడు. పెరిగిన ముగింపు తగ్గించి, భారతీయ తరభాషల్లోకి, ఆంగ్లంలోనికి 'ఊరి చివరయిల్లు' అనువాదం చేస్తే, ఆంధ్రుల కథా సాహిత్యం స్థాయి అందరికి అర్థమవుతుంది. అది ఉత్తమ కథ.

'కవుల రైలు' ఈ సంపుటిలో అనవసరం. అది కథ కాదు. కవులగూర్చి తిలక్ అభిప్రాయం. అది మినహాయించితే ఈ సంపుటిలోని ఏ కథా, తెలుగు సాహిత్యంలోని ఏ ఉత్తమ కథకు తీసిపోదు.

శిల్ప సౌందర్యమో, పాత్ర చిత్రణ ప్రశస్త్యమో, వాస్తవ సమాజ చిత్రీకరణమో, కవితా స్థాయి చేరుకొన్న భాషా సౌకుమార్యమో, విడివిడిగానో, సమష్టిగానో, ప్రతి కథలోనూ ప్రత్యక్షమవుతాయి. ఏ కథను దూరంగా ఉంచుదామనుకున్నా, ఏదో ఒక గుణంగానీ, గుణ సమూహంగానీ ఆ కథను దూరం చేసుకోనీయవు. ఏ ఒక్క లక్షణమో ఉంది లెమ్మనుకొంటే ఆ ఒక్క గుణమూ ఉన్నత స్థాయితో ఉంటుంది. తెలుగు దేశం నోచుకొన్న పదిమంది ఉత్తమ కథా రచయితలలో తిలక్‌కు సముచిత స్థానం వుంది.

వస్తుతః తిలక్ రచయిత కాదు. కాని, అతని కథలు అధికంగా లేవు. గురజాడ అప్పారావూ కథా రచయిత కాదు. అతని కథలూ అధికంగా లేవు. అయితే వాళ్ళిద్దరూ వ్రాసిన కథలు దాదాపు అన్నీ ఆణిముత్యాలు. మరో అడుగు ముందుకు వేసి చెపితే అప్పారావు కథానిక, కథా రచనలోనూ ఆద్యుడే అయినా, ఆద్యుడి కథలుకంటే తిలక్ కథలు తీసిపోవు.

'బాబు' లో బాబును చూస్తే చెప్పలేని బాధ; 'కదిలే నీడలు' లో అతని జేబులోనికి పోయి, వస్తూ వుండే చేయి గూర్చి మూగతనం; 'ఏమీ లేదు' లో ఉన్న చాలా సంగతి; 'రాత్రి 9 గంటలకి' నగరం వాలకం; 'సముద్రపు అంచులు'లో మెలికపడ్డ వీరి జీవితపు అంచులు విసిరే ఏడ్పు; పద్మ రాక్షసి పద్మ దేవత మధ్య 'సీతాపతి' కథ పట్ల జాలి; 'దొంగ'లోని నిజాయితీ; 'అతని కోరిక' లో వేశ్య సానుభూతి; 'నల్లజర్ల రోడ్డు' లో పిద్ధయ్యను

విధిని వదిలివచ్చిన బుద్ధిమంతుల మౌఢ్యం పట్ల విచారం; గుండెలేని గవరయ్యతో 'దేవుణ్ణి చూసినవాడు' తలెత్తటం పట్ల ప్రేమ, బాధ; నవ్వులో పరమార్థం; 'పరివర్తన'లో మలుపు నింపుకొన్న విచార రేఖలు, పాఠకులను పిచ్చివాళ్ళను చేస్తాయి. ఆనందంలో ముంచెత్తుతాయి. కరుణతో రస ప్లావితం చేస్తాయి. భావ శాబల్యంలో మునకలు వేయిస్తాయి.

తిలక్ కథల్లో గుణవిమర్శ స్థలాభావం గుర్తుకు తెస్తుంది. దోష సమీక్షకు అవకాశం లేదు. ఇంత మంచి కథలు తెలుగులో ఈమధ్య అధికంగా రాలేదు. ఏ రచయితా వ్రాసినవి అన్నీ ఇంత మంచి కథలు కావు.

ఆంధ్ర పాఠక లోకం అవశ్యం చదవవలసిన కథల సంపుటి ఇది. వర్ధమాన రచయితలు ఈ కథలు అనుక్షణం చదువుతూ వుండవచ్చు. తిలక్ లేని లోపం ఈ కథలు చదివింతర్వాత లేదు.

ముగింపు శక్తికీ, పాత్ర చిత్రణ సామర్థ్యానికీ, వాతావరణ కల్పనా నైపుణ్యానికీ, కథా కథన వైశిష్ట్యానికీ ఉదాహరణములుగా చూడతగ్గ కథల పరిశీలనం ద్వారా తెలుగు కథానికాశిల్పం దిఙ్మాత్రంగా ఇందులో ఉంది. విశేషంగానూ, విభిన్నంగానూ, ఉన్న ఆధునికాంధ్ర సారస్వతంలోని కథా వాఙ్మయం అంతా శిల్ప దృష్టితో పరికించటానికి ఈ ప్రారంభం ప్రేరక ప్రాయం. తెలుగులోని కథలు పొందిన శిల్పసిద్ధి పరిశోధింపదగ్గ విషయం.

# 4. వ్యాస వైవిధ్యం

ఇందులో సాహిత్య, సామాజిక, రాజకీయ వ్యాసాలు మూడు సమీక్ష పొందాయి. అన్నీ విమర్శనాత్మకంగా ఉన్నాయి. సృజన ధర్మం అస్పష్టంగా నయితేనేం లేకపోలేదు.

1. శ్రీ శ్రీశ్రీ, గురజాడను గూర్చి భిన్న సందర్భాలలో చేసిన ఆలోచనల రూపం 'గురజాడ' అది లోతయిన పరిశీలనంగా, నిశిత దర్శనంగా వుంది. బాస్వెల్ జాన్సన్ జీవితం లాగా శ్రీ శ్రీశ్రీ, 'గురజాడ' సహృదయ పాఠక హృదయామోదకరంగా యోగ్యంగా వుంది. ఇది వివిధ పత్రికలలో, ఆకాశవాణిలో గురజాడను గూర్చి శ్రీశ్రీ వ్రాసిన వ్యాసాలు, చదివిన ఉపన్యాసాలు కలిపి ప్రచురించిన సంపుటి.

ఇందులో 'ముత్యాల సరం-ఒక కృషి' వ్యాసం వుంది. శ్రీ శ్రీశ్రీ ముత్యాల సరం లక్షణం, దాని నడక, ఆ ఛందస్సు ఎవరెవరు ఏయే విధంగా ఉపయోగించుకొన్నదీ చెప్పి, తను ముత్యాల సరం ఛందస్సు ఏ విధంగా వాడుకొందీ వివరించటమూ, 'ఆధునిక గద్య వాఙ్మయ ప్రవర్తకుడు'లో గద్య రచనలో ఉన్న సాధక బాధకాలు, వచనం పద్యం స్థాయికంటే భిన్నమయిన, మరో విధంగా ఉన్నతమయిన పద్ధతిలో వ్రాయటానికి ఉన్న ఆ కాలం పరిస్థితి వ్యక్తం చేయటమూ; గురజాడ ఆధిక్యానికి కారణాలలో గురజాడ కందుకూరి వీరేశలింగం, తిరుపతి వెంకటేశ్వర కవులు, ఆఖరికి రాయప్రోలు సుబ్బారావు కంటే ఏ విధంగా ఆధిక్యం పొందగల వ్యక్తో చూపటానికి చేసిన ప్రయత్నమూ; 'ముత్యాల సరాలు'లో పూర్ణమ్మకథ ఔన్నత్యం, రచనా వైశిష్ట్యం, 'నరకం'లో గురజాడను జబర్దస్తీగా పలకరించే దమ్ము, 'కన్యాశుల్కం'లో ఈ వ్యాస

రచయిత, శ్రీ అబ్బూరి రామకృష్ణారావు, శ్రీ ఆరుద్ర కన్యాశుల్కంలోని పదజాలం సంభాషణలలో వాడుకొన్న తీరు; 'సెల్యులాయిడ్‌లో కన్యాశుల్కం' ఎంతో చిత్ర వధకు గురి అవుతుందన్న భవిష్యద్దృష్టి పాఠకులు గమనిస్తారు.

శ్రీ శ్రీశ్రీ తెలుగు వచనం నిర్వివాదంగా ఉత్తమశ్రేణికి చెందింది! అభిప్రాయ ప్రకటనంలో ఈ వ్యాసకర్త అందె వేసిన చేయి. చెప్పిన విషయం అందరూ అంగీకరించినా, అంగీకరించకపోయినా, చెప్పినతీరు మాత్రం ఒప్పించేటట్టుంది. చాలా మంది రచనంలో కనిపించే పులుముడు ఈ వ్యాసరచయిత వచనంలో లేదు. స్థిరమయిన అభిప్రాయాలు. కొందరు భిన్నాభిప్రాయం కలిగి ఉండవచ్చు. సూటిగా చెప్పటంలో, స్పష్టతలో, మానసిక వైవిధ్యం గోచరిస్తుంది. పాఠకులు నిరభ్యంతరంగా ఈ వచనం గౌరవిస్తారు. వ్యాసరచయితగా శ్రీ శ్రీశ్రీ, కవి అయిన శ్రీ శ్రీశ్రీ, చాలామంది వ్యాసరచయితలు, పూర్తిగా వ్యాసరచయితలు అయినవారికంటే ఉన్నత శిఖరంలో గోచరించటం పాఠకులు చూడగలుగుతారు.

ఈ వ్యాసాలు అన్నీ ఒక పథకం ప్రకారం వ్రాసినవి కావు. ఒక్కొక్క అభిప్రాయం, భిన్నభిన్న వ్యాసాలలో ఎదురవుతుంది. ఉదాహరణకు పూర్వం తిక్కన, ఆ మధ్య వేమన, ఇప్పుడు గురజాడ తెలుగు సాహిత్యానికి పుష్టిగలిగే సాహిత్యం సృష్టించిన వాళ్ళనే అభిప్రాయం. శ్రీ శ్రీశ్రీ, గురజాడగూర్చి విపరీత మయిన గౌరవం గల కవి. అందుకు కారణాలు అనేకం. చాలా, చాలామందికి స్పష్టం!

'మనవి'లో శ్రీ తాపీ ధర్మారావుగారిచే 'ఆవిష్కృతం చేసిన ఈ గ్రంథం' అనే వాక్యం తొందరపడింది. "అయితే అప్పారావుగారి పేరు స్ఫురించినపుడల్లా 'పాయక పాకశాసనికి భారత ఘోరరణంబు నందు నారాయణునట్లు.... సాయపడి' నిలుచున్న గిడుగు రామ్మూర్తి కూడా జ్ఞాపకం వచ్చి తీరుతారు" అనే వాక్యంలో 'కూడా' బాధ కలిగిస్తుంది. గిడుగు వ్యావహారికవాది. సిద్ధాంత. కర్త గురజాడకు

గిడుగు ఆత్మబలం, గిడుగుకు అప్పారావు దర్పణం. గురజాడ విషయంలో గిడుగు గుర్తుకు వచ్చి తీరాలి. గిడుగు విషయంలో గురజాడ గుర్తుకు వస్తాడు. ఇక్కడ 'కూడా' బాధాకరం.

“సొంతమైన వాస్తవికతను దర్పణంలో వలె యథాతథంగా ప్రతిబింబించిన ఈ నాటకం మన భాషలోనేకాదు మరి ఇతర భారతీయ భాషల్లోనైనా మొదటిదీ, ఆఖరుదీ కన్యాశుల్కమే అనుకొంటాను!” అని శ్రీ శ్రీశ్రీ వాక్కు. అనుకోవటానికి ఏముంది? ఏమైనా అనుకోవచ్చు. ఇంతకు పూర్వం మన సాహిత్యంలో అంత ఉత్తమ నాటకం లేదని నిర్భయంగా చెప్పవచ్చు. ఇతర భారతీయ భాషలతో చూసి, భారతీయ సాహిత్య వ్యాసంగం సంపూర్ణంగా చదివితే అనవచ్చు. కానీ ఆఖరుది అనటం ఎలా సాధ్యం? భవిష్యత్తు మీద అంత విశ్వాస రాహిత్యం ప్రదర్శించటం ఏం సబబు? ఆంధ్రజాతి భవిష్యత్ మానసిక దారిద్ర్యంపట్ల ఎలా వకాల్తా పుచ్చుకోగలగటం? అంతటితో ఆగకుండా సమస్త భారతీయ భాషా సారస్వత భవితవ్యాన్ని నాశనం మీద నిషార్సుగా భరత వాక్యం పలకట మేమిటి? పాఠకుల్లో ఆలోచించేవాళ్ళు బాధపడతారు. గురజాడను కవి ఎడమల అద్దయాకలులేని వ్యక్తిగా, నాటక రచయితగా పేర్కొన్నందుకు కొందరు ఆనందింపవచ్చు, కానీ, ఈ విధంగా గురజాడను అభిమానిస్తే, లేదంటే తెలుగుదేశ భవితవ్యాన్ని పరాభవిస్తే, గురజాడ ఆత్మ దుఃఖిస్తుంది.

శ్రీ శ్రీశ్రీ, గురజాడ వచన రచనలను నాల్గు భాగాలుగా విభజించి, నాటకీయం, కథనాత్మకం, విమర్శనాత్మకం, వ్యక్తిగతం అని ఒక్కొక్క దానిని వివరిస్తూ, వ్యక్తిగత వచన రచనా విభాగ భావ వివరణం మాట మరచిపోవటం ఎవరైనా గమనిస్తారు.

శ్రీ శ్రీశ్రీ గురజాడపై వ్రాసిన వ్యాసాలున్న ఈ సంపుటి చదవటం విద్యార్జన; వ్యాస రచయితగా ఇంచిల్లోపభూయిష్ఠంగా అతివ్యాప్తి, అవ్యాప్తి గల ఫాత్యాలుగా ఉన్న వ్యాసాలే అయినా ఇంత తీక్షణమైన వ్యాసాలు గురజాడపై

ఇంకెవరు వ్రాశారో ఆలోచింపవలసే ఉంటుంది. చెన్నయనూరి 'నవీన కాలంలో పరిశోధించిన ప్రాచీనుడు' - ఎంత మంచి వాక్యం! కందుకూరిని గూర్చి ఈ వ్యాస రచయిత తొందరపడి ఏదో అనబోయే ప్రయత్నం చేసి కూడా తొణక లేదు. ఒక మహాకవిని గూర్చి, మరొక మహాకవి విమర్శ వ్రాయటం ఆంధ్ర సాహిత్యంలో ప్రారంభమయిన సత్సంప్రదాయం.

2. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి 'వెలుగుబాటలు' స్త్రీ జనాభ్యుదయం కాంక్షించే వ్యాస సంకలనం. స్త్రీ భిన్నరంగాలలో పొందవలసిన పురోగతిని వివరించేదిగా వ్యథాస్ఫూర్తి బాధాదీప్తిగా వుంది.

స్త్రీలూ, పురుషులూ సమానులు, ఏ రంగంలోనూ స్త్రీ పురుషుడు కంటే తీసిపోదు. అందుచేత స్త్రీ పురుషులకు హక్కులు సమానంగా వుండాలని అందరూ అనటం వినటం పరిపాటి అలవాటూను. ఈ వ్యాసాలలో ఆ భావవ్యక్తీకరణ వుంది.

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి స్త్రీలు అభివృద్ధి చెందాలనీ, వారికి సర్వ సంక్షేమాలు కలగాలని, భావ స్పందనతో వ్రాసిన ఈ వ్యాసాలలో శారీరకంగా మానసికంగా సామాజికంగా సర్వరంగాలలో స్త్రీ ఎలా అభివృద్ధి చెందాలో సమాజాన్ని ఏ రీతిగా నడిపించాలో చూపిన తీరు ప్రజాదరణ పొందింది.

స్త్రీలు ఆరోగ్యంగా ఉండాలి. సామాజాభివృద్ధిలో భాగస్వాములు కావాలి. కనుక సూరత్ నివాసి అయిన స్త్రీ లాగా ఆరోగ్యం కాపాడుకోవాలి. ధోండో కేశవ కార్వే పండితుడులాగా పురుషులంతా స్త్రీలకు చేయూత నివ్వాలి. అభివృద్ధి పథంలో నడిపించాలి.

స్త్రీ భోజన విషయంలో అశ్రద్ధ చేయరాదు. తక్కువ ఖర్చుతో ఎక్కువ పుష్టిని ఇవ్వగల బహ్వార్థ సాధకాహారం గూర్చి, వంట ఇంటి విశేషాల చర్చ తగుమాత్రంగా వుంది. క్లిఫర్డు క్లింటన్ అనే హోటల్ యజమాని తయారు చేసిన అధిక పుష్టి నిచ్చే అల్పాహార వ్యవహార విషయం ప్రస్తావించి, బెంగుళూరులో అటువంటి ఆహారం చేస్తున్న వార్తను ప్రకటించి, శాకాహారులకు ఆకు కూరలు,

కూరగాయలు, పప్పు కూరలతో పుష్టికరమైన ఆహారం ఎలా తయారు చేసుకో వచ్చునో, దాన్ని గూర్చి చెప్పటం వుంది.

తిన్నతిండి జీర్ణం కావటానికి క్రీడలు అవసరమే! ఇండోర్ గేమ్స్‌వల్ల ఏ విధమైన వ్యాయామం స్త్రీలకు కలుగుతుంది.ఆసనాలూ మంచివే! శరీరారోగ్యం ఉన్నంత మాత్రంతో సరిపోదు. మానసికారోగ్యం కూడా తప్పనిసరి! స్త్రీలు చదువురానివారు, చదరంగం వంటి ఆటల మూలంగా మనస్సుకు పదును పెట్టుకోవచ్చు.

ఆరోగ్యవంతురాలయిన స్త్రీ సంతానం దేశానికి ఆరోగ్యం కలిగిస్తుంది. పిల్లల్ని పెంచుకోవటంలో జాగ్రత్త వహించాలి. తగిన పోషణా, ఆదరణ లేని, పిల్లలు అల్లరివాళ్ళై, విచ్చలవిడిగా పెరిగి పాడైపోతారు. దేశానికీ, తల్లిదండ్రుల కూ కళంకం తెస్తారు. పిల్లల్ని పనిపెట్టి వుండాలి. వాళ్ళకూ ప్రత్యేక వ్యక్తిత్వం వుందని గుర్తించాలి. చులకనగా చూడకూడదు. హేళన చేయ కూడదు. మనస్సు నొప్పి కలగకుండా చూసుకోవాలి. ఆధిక్యం ఫరవాలేదు కానీ అనాధిక్యం చూపించకూడదు. ఇక్కడ రచయిత్రి భారతదేశ పరీక్షా విధానంపై కూలంకష చర్చానంతరం ప్రకటించిన వ్యక్తిగతాభిప్రాయం గమనార్హం.

బాలల అభివృద్ధికి జాగరూకత వహించాలి దేశం. పసిపాపల సౌభాగ్యంపై దేశ సౌభాగ్యం ఆధారపడి వుంది. పాశ్చాత్య దేశాలలో బాలబాలికల పట్ల చూపబడే జాగ్రత్త భారతదేశంలో కొరవడింది. ఈ వ్యాసాలలో అధిక సంత నాన్ని గూర్చి కానీ, కుటుంబ నియంత్రణ గూర్చి కానీ, రచయిత్రి చర్చించలేదు.

స్త్రీకి విద్య అవసరమే! అందుకు అనుగుణంగా ఆ రంగంలో కృషి జరుగుతూ వుంది. అయితే సహ విద్య పట్ల రచయిత్రి అభిప్రాయం స్పష్టంగా లేదు కానీ, భావనాత్మకంగా భారతదేశంలో సహవిద్య అనవసరమే అనే భావన ద్యోతకమవుతుంది.

దేశంలో పురుషులెంత మంది ఉన్నారో దాదాపు అంత మంది స్త్రీలు ఉన్నారు. సహవిద్యవల్ల కల్గే నష్టాలకంటే సహవిద్య లేకపోవటం వల్ల కలిగే నష్టాలే ఎక్కువ.

సహ విద్యలో యువతీయువకులు పరస్పరం అర్థం చేసుకొనే అవకాశం వుంటుంది. వివాహానికి పూర్వం యువతి, యువకుడితో మానసిక సామీప్యం ఏర్పరచుకోకపోతే, హార్దిక సాహచర్యం, కలిసి జీవించటానికి తగిన వాతావరణం వుండకపోవచ్చు.

నిజానికి సహవిద్య వున్న పాఠశాల, కళాశాలలలో యువతులు ప్రవర్తించి నంత సంస్కారయుతంగా, వ్యక్తిత్వ పాటవిష్ఠ్యంతో, ప్రత్యేక స్త్రీల కళాశాలలో చదువుకొన్నవారు నడచుకోలేరు. విద్యార్థి దశలో యువతీ యువకులు ఒకరికొకరు ఆంక్షలు, హద్దులు, అవధులు. సహవిద్య ఉన్న సంస్థలో విద్యార్జన ముగించిన యువతి జీవితంలో ప్రవేశించి సాధించిన విజయాలు, సహవిద్యలేని సంస్థలో చదువు ముగించిన యువతులు పొందలేకపోవచ్చు.

సహ విద్యనుగూర్చి ఇంతగా ఎందుకు వ్రాయవలసివచ్చిందంటే, రచయిత్రి స్పష్టంగా సహవిద్యను అంగీకరింపకపోవటమూ, వ్యక్తం చేసిన అభిప్రాయాలలో సహవిద్యకు వ్యతిరేకస్ఫూర్తి ధ్వనించటం కారణం.

దేశంలోని అంగవైకల్యం వున్నవారికి అవకాశాలు కల్పించాలని రచయిత్రి సూచన. వాళ్ళు హెలెన్ కెల్లర్ అంత గొప్పవాళ్ళు కావచ్చు. ఈ విషయాలు చర్చించిన వ్యాసాలు ఆసక్తికరంగా వున్నాయి.

మేడమ్ క్యూరీ విషయమాదిగా, మేడమ్ మేయర్ (బొంబాయిలో మేయరుగా 1956 లో ఎన్నికయిన స్త్రీ) వరకు పలువురు స్త్రీలు సాధించిన ఘనకార్యాల ప్రస్తావన చదవబుద్ధి పుడుతుంది.

రచయిత్రి వక్కాణి భాషలో అభిప్రాయ వ్యక్తీకరణ చేసినా, నిర్దుష్టమైన భాషలో చేయలేదు. భాషాదోషాలు, వాక్యదోషాలు, అనువాదంలా కనిపించే వాక్యాలూ చెదురుమదురుగా వున్నాయి.

3. శ్రీ దిగవల్లి వేంకటశివరావు ప్రజాప్రభుత్వంగూర్చి విభిన్నాంగ్ల మేధావుల ఆలోచనలతో తన పరిశీలన జోడించి భిన్న వ్యాసాలలో తెలపటం రాజకీయ విషయ వివరణ సామర్థ్యం గోచరింపచేస్తూ ఉంది.

ప్రజా ప్రభుత్వం ప్రపంచంలో పరిమితంగానో, అపరిమితంగానో, దాదాపు పూర్తిగానో, అసంపూర్తిగానో రమారమి అన్ని దేశాలలో వుంది. ఈ గ్రంథంలోని వ్యాసాలలో సృజించిన విషయాలు అన్నిదేశాల ప్రజా ప్రభుత్వాల లోని సామాన్యతను చూపవేదు. భారతదేశాన్ని గూర్చి కూడా సమగ్రంగా, విపులంగా వ్రాయలేదు. ఎక్కువగా బ్రిటిష్ ప్రజా ప్రభుత్వాన్ని గూర్చి చెపుతూ వున్నప్పుడు అక్కడక్కడా భారతదేశాన్ని గూర్చి వ్రాయబడింది.

సిద్ధాంతరీతిగా భారత ప్రజా ప్రభుత్వం ప్రపంచంలో మంచి ప్రజా ప్రభుత్వాలలోని మంచికి మచ్చుతునక. అయితే ఆ మంచి ఎక్కువగా బ్రిటిష్ ప్రజాప్రభుత్వంనుంచి పుణికి పుచ్చుకొన్నది. మన రాజ్యాంగంలో దోషం కనబడితే బ్రిటన్‌లో ఇలా ఉండదు అని అనుకోవటం సహజమే అయ్యింది. మన ప్రజా ప్రభుత్వ పాలనలో, రాజ్యాంగ నిర్మాణంలో, నిర్వహణలో వున్న అపకతవకలు, అతివ్యాప్తి, అవ్యాప్తులు చూపించే దృష్టితో విజ్ఞానాత్మకమైన ఈ వ్యాస సంపుటి ప్రకటించిన విజ్ఞులు శ్రీ దిగవల్లి వేంకటశివరావు.

ఈ వ్యాస సంపుటిలో, అనేక కోణాలనుంచి భారత ప్రజాప్రభుత్వం నడుస్తున్నతీరు తులనాత్మక పరిశీలనకు గురిఅయ్యింది. మన దేశంలో పార్ల మెంటుకు గానీ, అసెంబ్లీకి గానీ ఎన్నికయిన వ్యక్తి చాలాచోట్ల మళ్ళీ అయిదేళ్ళ దాకా, కనీసం ఆ నియోజక వర్గం ఎలా ఉంటుందో గమనించే స్థితి వుండదు. బ్రిటిష్ దేశంలో 'పొలిటికల్ క్లబ్స్'తాము ఎన్నుకొన్నవ్యక్తి రాజకీయ జీవితాన్ని ఎలా దిద్దుతాయో ఈ సంపుటిలో చదివితే, ఆశ్చర్యం కలుగుతుంది.

మరి ఆ స్థితి మన దేశంలో ఎందుకు లేదు? రాజకీయ చైతన్యం లేదు కాబట్టి. అదెలా సాధ్యం? అన్ని రంగాల్లో అభివృద్ధి వస్తే! అదెప్పుడు వస్తుంది? ప్రజా ప్రభుత్వం బాగా పనిచేస్తే? అదెప్పుడు బాగా పనిచేస్తుంది? ప్రజలు బాగా జాగరూకతతో వుంటే! జాగ్రత్త ఎప్పుడు వస్తుంది? రాజకీయ చైతన్యం వుంటే-మళ్ళీ అదే చక్రం —

మొదట సాంఘిక చైతన్యం రావాలి. సంఘంలో వున్న అందరూ, దేవుడు - కర్మ - యోగం - జాతకం కంటే భిన్నంగా ప్రవర్తించి, అందరం సమానులమే అనే భావం పెంచుకోవాలి. దానికి అవసరమైన వాటిలో భాష, మతం ముఖ్యమే! ఒకే భాష, ఒకే మతం ఏర్పడితే - కనీసం ఆ భావం ఏర్పడితే భారతదేశంలో సాంఘిక చైతన్యం వస్తుంది.

సాంఘిక చైతన్యం వస్తే, ఆర్థిక చైతన్యం వచ్చే అవకాశం దూరంలో వుండదు. అందుకు గుర్తించవలసింది దేశస్థితి. మన దేశంలో వ్యవసాయ రంగం సాధించగలిగినంత పురోగతి పారిశ్రామిక రంగంలో సాధించలేదు. దానిలోను ప్రభుత్వ రంగం బలపడి, ప్రయివేటు రంగం బలహీనమైతే, బలహీనమయ్యేటట్లు చేస్తే తప్ప, పారిశ్రామిక రంగానికి మోక్షం లేదు. వ్యవసాయం, పరిశ్రమ నిరాఘాటంగా సాగితే తప్ప, గత్యంతరం లేదు. ఈ రెండు విధాలా అభివృద్ధి అయితే ప్రపంచ ఆర్థిక స్థితిలో భారతదేశం కోటి కోణం అందుకొంటుంది. ఆర్థిక చైతన్యంతో తక్షణం రాజకీయ చైతన్యం వస్తుంది. అది పూర్తిగా వస్తే ప్రజా ప్రభుత్వం నూటికి నూరుపాళ్ళు విజయవంతం.

బ్రిటన్‌లో మంత్రులు చూపే బాధ్యత మన మంత్రులు చూపటం లేదు. అక్కడ అపోజిషన్ పార్టీ చూపే దక్షత, దీక్ష, మన అపోజిషన్ పార్టీలు చూపటం లేదు. ఆ దేశంలో ప్రభుత్వం ఒక పార్టీ చేతుల్లోంచి, మరొక పార్టీ చేతుల్లోకి మారినట్లు, ఆ మార్పు మంచికోసమే వచ్చినట్లు మనదేశంలో రావటం లేదు. రాదు. అన్ని దేశాల ప్రజా ప్రభుత్వాలలోని సుగుణ సంపత్తిని ఏరి

కూర్చినా భారత ప్రజా ప్రభుత్వం సర్వశ్రేష్ఠంగా రూపుదాల్చలేదు. దీనికి కావలసింది మారుతున్న దేశంలో మారవలసిన సర్వ ప్రజా మనస్తత్వం.

ఈ వ్యాస సంపుటి బహు గ్రంథ పరిశీలనతో తయారయింది. ఆంగ్లంలో బ్రిటిష్ ప్రజా ప్రభుత్వం గూర్చి వెలువడిన గ్రంథాలూ, భారత రాజ్యాంగ చట్టమూ, ఈ రెండు దేశాల రాజ్యాంగ నిర్మాణం గూర్చిన గ్రంథాలు ఆధారంగా, ఆంధ్రంలో ఈ వ్యాస సంపుటి తయారయింది. పలుతావుల్లో రచయిత వ్యక్తం చేసిన స్వతంత్రాభిప్రాయాలు, సూక్ష్మ పరిశీలనానంతరం ప్రపంచిత రాజకీయ భాష్యాలు.

సంపుటిలో ఎక్కువ భాగం అనువాదమే. అనువాదం చాలావరకు స్పష్టత సంతరించుకొంది. భారత రాజ్యాంగంలోని కొన్ని అంశాలు అనువాదం చేయటంలో కొన్ని చోట్ల అతివ్యాప్తి, అవ్యాప్తి కలిగాయి.

అనువాదం ఎలా జరిగిందో మచ్చుకు-

"ప్రజా ప్రతినిధుల వలన, ప్రజల క్షేమ లాభముల కొరకు, ప్రజా ప్రాయముగా జరుపబడు ప్రభుత్వమే ప్రజాప్రభుత్వం."

దీని కాంగ్ల మూలం-

"Democracy is a form of Government of the people, by the people and for the people."

ఆంగ్లంలో కొన్ని పదాలకు పూర్ణార్థస్ఫూర్తి కలిగించే తెలుగు మాటలు తక్కువ. రచయిత శ్రీ దిగవల్లి వేంకట శివరావు కొన్నింటికి చూపిన తెలుగు పదాలు—

ఉదా: Directive Principles : నిర్దేశక సూత్రములు
Fundamental Rights : ప్రాతిపదిక సత్వాలు
Veto : ప్రత్యాఖ్య
Instrument of Instruction : విజ్ఞాపన పత్రము

| | | |
|---|---|---|
| Dissolve | : | విలయము |
| Trade Unions | : | కట్టడి సంఘములు |
| Preventive Detention | : | నివారక నిరోధము |

ఇట్టివి చాలా వున్నాయి. వీటి యోగ్యతా యోగ్యతలు వాటి ప్రయోగం మీదే ఆధారపడి వుంటుంది.

రాజ్యాంగము, పుట్టు పూర్వోత్తరాలూ; ప్రజా ప్రభుత్వము, పరిపాలనా విధానము, ఈ విషయాలను గూర్చిన ఆంధ్ర గ్రంథాలు తక్కువ. ఆ లోటును ఈ గ్రంథం కొద్దిగా తీర్చగలదు. రచయిత విషయమంతా ఆకళింపు చేసుకొని, జీర్ణించుకొని, చాలా మందికి అర్థమయ్యే రీతిలో ఈ వ్యాససృష్టి చేశారు.

శ్రీ శ్రీశ్రీ 'గుడజాడ' విమర్శనం సాహిత్య పరిధికి చెందింది. సృజనాత్మకంగా వుంది. వివరణం ప్రధాన ధర్మం వుంది. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి 'వెలుగు బాటలు' స్త్రీ చిన్నతనంనుంచి వృద్ధాప్యందాకా చేయవలసిన అన్ని కార్యకలాపాలను అభ్యుదయ మార్గంలో వివరించింది. దిగవల్లి వేంకట శివరావు ప్రజా ప్రభుత్వం వ్యాసాలలో ఒక సారస్వతావసరం తీర్చాడు. తెలుగులో ఈ రాజకీయ పరిశీలనం కొత్తబాట. ఒక కవితా హృదయం, మరో స్త్రీ వ్యథ, ఇంకో మేధావి ప్రయత్నం వ్యాసగతంగా నిలిచాయి. అన్నీ కొత్త కోణాలు వెలార్చాయి. వ్యాసం విషయ బోధకు, బుద్ధి క్రీడకు వేదిక అయింది.

# 5. నాటక ప్రయోగం

తెలుగులో దృశ్య, శ్రవ్య నాటక వాఙ్మయం విశాలంగా పెరుగుతూ ఉంది. దృశ్యం శ్రవ్యధర్మాన్ని, శ్రవ్యం దృశ్యధర్మాన్ని కలిగి వుండటము వుంది. నాటకం ప్రయోగింపబడితే ప్రయోజనకరం. పఠించటానికే ఉద్దేశింపబడితే అది నాటకం కానక్కరలేదు. తెలుగులో ఆరంభంలోని అనువాదనాటకాలు ప్రధానంగా శ్రవ్యధర్మం కలిగివున్నాయి. ఇప్పుడలా కాదు. తెలుగులో స్వతంత్ర నాటకసృష్టి మొదట్లో శ్రవ్యధర్మమే ప్రముఖంగా కలిగివుంది. కన్యాశుల్కం, ప్రతాపరుద్రీయం యథాతథంగా ప్రదర్శించటం సమర్థులైన ప్రయోక్తలకే సమస్య, అగ్నిపరీక్ష, అవకాశంలేదు.

అనంతర కాలంలో వెలువడుతున్న అనేక నాటికా నాటకాలలో ప్రయోగ గుణం విశిష్టంగా ఉంది. దృశ్యధర్మం పెరిగింది. అది ఆనందింపదగ్గ పరిణామమే అయినా ప్రమాదకరంగా రూపం దిద్దుకొంది. ఈ స్థితిలో ప్రదర్శించటమే కోరి నాటకం కళారూపం కాకుండా అయిపోయింది. దృశ్యధర్మం మాత్రమే ఉంది. శ్రవ్యధర్మం పూర్తిగా అగోచరమయింది,

పోటీ తీవ్రంగా ప్రయోగమే పరమప్రయోజనంగా తెలుగులో నాటకవాఙ్మయం నిర్మాణమవుతూవుంది. ఇంకే ప్రయోజనమయినా ప్రధానం కాదు. వస్తు, పాత్ర, సమస్య, అభివ్యక్తి అన్నీ కలిసివున్నా ప్రయోగ విధేయంగా ఉండవలసిందే! ప్రయోగించటంలో ఉండే చమత్కారం సంతరించుకొంటూ నాటకం అవతరించింది. సామాజికుల్ని అలరించింది. ఈ చమత్కారంలో భాగంగానే హాస్య నాటిక, నాటకాలు వెలువడ్డాయి. స్త్రీ పాత్ర లేకుండా సిద్ధించాయి. ప్రయోగ కాల పరిమితి నిర్ణయించాయి. సన్నివేశ సమస్యలు సంకోచించాయి. పరిమితి నాటక ప్రాణం అయింది. నాటకం చిన్న పరిధిని

కోరుకొంది. నిరసించింది. ప్రతిఘటించింది. విశాలంగా ఆదరించటానికి చేరుకోలేకపోయింది. శ్రవ్య ధర్మం తగ్గిపోయింది. ఉత్తమ రచనా ప్రణాళిక దూరమయింది. గొప్ప నాటకం అవతరించకపోగా, అవతరించటానికి అవకాశం కలిగించే రంగ స్థలం తగ్గుతూఉంది. మొత్తం మీద ఆరంభంలో వచ్చినంత మంచి నాటకాలు అనంతర కాలంలో ఎక్కువగా రాలేదు.

వర్తమానాంధ్ర సాహిత్యంలో ఉత్తమ రూపక వాఙ్మయంగా చెప్ప బడేవి, విభిన్న నాటక సంస్థల పోటీలలో ఉత్తమ రచనకు బహుమతి పొందేవి, గొప్ప ప్రయోగ సామర్థ్యం ఉన్న నాటకాలు అయితే అవుతున్నాయి కాని 'ఉత్తమ సాహితీధర్మం, కళా సంపద, ఉన్న ఉదాత్త సాహిత్యంగా మాత్రం ఉండటం లేదు. రచనా గుణంవల్ల, ప్రయోగ ధర్మం వల్ల ఉత్తమంగా ఉన్న నాటకం ఆవిర్భవించటాన్ని ఆంధ్రదేశం కోరుకొంటూ వుంది.

అందుకు రచయిత, నటుడు, ప్రయోక్తల సమిష్టి ప్రయత్నం, సాఫల్యం అవసరం. నాటకం భిన్న కళాంశాలున్న సమాహారం కావటమేకాదు, భిన్న కళామూర్తుల ఆత్మావిష్కరణం ఉన్న కళారూపం. ఈ నాటకం ఏ ఒక్క దృక్కోణం నుంచి పరిశీలన పొంది ప్రభవించినా పాక్షిక సామాజిక సత్యానికే వ్యాఖ్యానం అవుతుంది. సంపూర్ణ కళాసత్యంగా అవతరించటానికి కళా మూర్తుల సంపూర్ణ కళావిష్కరణం రావాలి. అది ఒక దీక్ష. ఒక పరీక్ష. ఒక నిరంతర నిర్విరామ చింతన.

విభిన్నంగా ఉన్న తెలుగు నాటకాలలో దేనికొకటి తీసి చూస్తే ప్రయోగం కోసం జరిగిన ప్రయత్నం, పొందిన రూపం తెలుస్తుంది. విద్యాలయాలలో పాఠ్యగ్రంథాలుగా ఉండే నాటకాలలో దృశ్యధర్మం పరిశీలించే అవసరం లేదు. ఆకాశవాణి నాటిక, నాటకాల్లో శ్రవ్యధర్మం ఆత్మదవ్యం కాబట్టి దృశ్యధర్మం గూర్చి ఆలోచించే అవకాశం లేదు.

అది సామాన్యమైన జీవిత సన్నివేశం, పాత్రలు, పరిస్థితులు, భాష ఈ రూపక వాఙ్మయంలో ప్రయోగమే ప్రధాన లక్ష్యంగా ఉన్న నాటకాలలో ఉంటు న్నాయి కాని సాహిత్యపు విలువలు ఉండటం లేదు. సహజత, సామాన్యత నాటక చిత్రీకరణంలో దీక్షగా జరుగుతున్నా, నాటకీయత సాధింపబడుతున్నా, ఉచిత సంభాషణలు ఊపిరి పీలుస్తున్నా, నాటకం కళగా రూపం దిద్దుకోవటం రావలసిక పరిణామంగా ఉంది. అయితే ప్రయోగ వైవిధ్యమే ఈ సందర్భంలో పరిశీలించ టానికి ఈ ప్రయత్నం ఉద్దిష్టం.

1. కన్యాశుల్కం నాటకంలోని పాత్రలమీద సదభిప్రాయం ఉంది. పరిస్థితిమీద గురి ఉంది. రచనమీద విశ్వాసం ఉంది. అన్నీ అలాగే ఉంటే ప్రయోగం సుఖం అనుకొన్న స్థితినుంచి 'గిరీశం ది గ్రేట్ సెకెండ్ స్టెప్' అనే నాటకం అవతరించింది. శ్రీ వడ్లమన్నాటి కుటుంబరావు కన్యాశుల్కం ప్రభా వంతో ఈ నాటకం ప్రయోగ సారళ్యం సంతరించుకొంటుందని తలంచినా అది సిద్ధించటం సమస్యే!

కన్యాశుల్కంలోని పాత్రలు సజీవంగా వున్నాయని రచయిత భావం. అవి సజీవ పాత్రలు కాబట్టి తదనంతరం ఏమయ్యాయి. గిరీశం సినిమాలలో ప్రవేశించాడు. రచయితయ్యాడు. ప్రొడ్యూసర్ అయ్యాడు. బుచ్చమ్మ సినిమా తార అయ్యింది. వెంకటేశం కారు డ్రైవరయ్యాడు. కాదంటే స్టుడియో ఓనర్ అయ్యాడు.

గిరీశం ఆహ్వానం మేరకు, రామప్పంతుల్ని వదిలేసి మద్రాసు మకాం మార్చిన మధురవాణి, గిరీశం ఇంట్లో పని మనిషై, ఆపైన సినిమా ఛాన్సులు కలిసివస్తే నటి అయ్యింది. మూర్తి కన్యాశుల్కంలో లేని పాత్ర, చాలావరకు గిరీశం మూసలోంచి తయారయిన పాత్ర. అచ్చంగా గిరీశం ధోరణిలో మాట్లాడే పాత్ర.

కన్యాశుల్కం లాగానే ఇదీ నాటకం. దాన్ని ప్రయోగించడంలో వుండే కష్టనష్టాలే ఇందులో వున్నా, స్వరూప స్వభావాలలో చెప్పలేనంత మార్పు. అసలు గుర్తుపట్టటమే అసాధ్యంగా మారిపోయాయి పాత్రలు. రెంటింటిలో హాస్యం వుంది. స్థాయిలో తేడా వుంది. రెంటింటి భాష వ్యావహారికమే. దాని కున్నంత సహజత ఈ భాషకు లేదు. గురజాడ అప్పారావు వ్రాసినట్టుగా నాటకం వ్రాయటం, ఆ పాత్రలే స్వీకరించటం, అంతా కన్యాశుల్కం ధోరణిలో రచన చేయటం బాగానే వుంది కానీ మెప్పించటం కష్టం.

ఈ రచనలోని హాస్యం నవ్వించలేదు. నవ్వుల పాలవుతుంది. ఒక్కొక్క చోట అపహాస్యం చేస్తుంది. ఇది ప్రఖ్యాత నాటకం ఛాయల్లో సాగిన రచన కాదనుకొన్నా, పాఠకులు సరదాగా చదువుకొంటారు గానీ, ఆ నాటకం దృష్టిలో వుంచుకొంటే, ఈ నాటకం నిలవదు.

సినీజగత్తులో సామాన్యులకు తెలియని రహస్యాలు ఆ 'లైను'లో పని చేసే ఈ రచయిత కొంతవరకు తెలిపే ప్రయత్నం చేయటం పాఠకులు గమనిస్తారు.

మగదిక్కు లేన్న ఆడమనిషికి నటికి కలిసివచ్చే అవకాశాలూ, అండలేని నటి మంచి లక్షణాలు ఎన్ని ఉన్నా, ఎదుర్కొనే అవకతవకలు మూర్తి గిరీశం సంభాషణలో వినబడతాయి.

మునుపు తను ప్రేమించిన మధురవాణితో స్వేచ్ఛగా వుండలేక గిరీశం పడే తిప్పలు చూస్తుంటే పాఠకులకు సరదా వుడుతుంది.

చుంబన్, మర్దన్ సినిమాల పేర్లమీద తప్పుడు శ్లేషలు ప్రయోగించినా బాధ కలుగుతుంది. అసహ్యత వరిస్తుంది. అశ్లీలమైన హాస్యం పోషించాలని రచయిత ప్రయత్నించకుండా వుండవలసింది.

పాత్రపోషణ దృష్టితో ఈ నాటకం చదివితే బాధ కలుగుతుంది. ఆంధ్రుల మనస్సులో గురజాడ నిలిపిన పాత్రలు ఈ రచయిత న్యూనపరచినట్టే భావించు

కోవలసివస్తుంది. మధురవాణి చలాకీతనం మాయమైంది. గిరీశం అనుమానం మనిషయ్యాడు. బుచ్చమ్మ నేర్పరయ్యింది. వెంకటేశం రాటుదేలాడు.

సినిమాలలో డబ్బు దాచుకొనే తీరు ఘోరంగా వుంటుంది. అంత డబ్బున్న వాళ్ళ తిప్పలవి. డబ్బు దాచుకొనే మార్గం బుచ్చమ్మ చూపుతుంది. అవసరం అయితే, ఎవరైనా అనుసరించవచ్చు. ఆ పద్ధతి తెలిసిపోయింది కాబట్టి-ఈ పుస్తకం ద్వారా ఇన్‌కమ్‌టాక్స్ వాళ్ళు పట్టుకోవచ్చు.

బుచ్చమ్మ గిరీశంతో 'నువ్వు డైరక్షన్ నేర్చుకొంటే మంచిదని' సూచన చేసినచోట సరదా కలుగుతుంది. గృహ ప్రవేశం ఏర్పాటులో ఇంత లాభేచ్ఛ వుందా అని సామాన్యులకు ఆశ్చర్యం కలుగుతుంది.

పెద్ద బాలశిక్షను, గాడిదను గూర్చి విపులీకరించిన రచయిత వ్యక్తిత్వంపై గౌరవం ఏర్పడుతుంది.

ఈ నాటకం పాత్ర పోషణకు చదవనక్కరలేదు. కథకోసం చదవ నక్కరలేదు. హాస్యం కోసం ఆశించనక్కరలేదు. అయితే హాయిగా, సరదాగా, మంచిలేదూ, చెడూలేదూ కాలక్షేపంగా చదువుకోవాలంటే ఈ నాటకం చదవ వచ్చు.

ఈ పాత్రలు వదలి, ఔచిత్యం దృష్టిలో ఉంచుకొని, అశ్లీలంతపని హాస్యం సృష్టించాలనే ప్రయత్నం స్థిరం చేసుకొని, సినీ జగత్తుకు సంబంధించిందే అయినా కథ పటిష్ఠంగా, ఇతివృత్తం నిర్ణయించుకొని రచన చేస్తే మేలు.

2. సినిమా చూచినవాళ్ళు దానినే నాటకంగా వేయవలసివస్తే సంతోషంగా ప్రయోగిస్తారన్న ఆశతో సినిమా స్క్రిప్టును నాటకంగా మార్చటం జరుగుతూ వుంది. చాలా సందర్భాలలో సినిమా స్క్రిప్టు శ్రవ్య నాటకమే - చదువుకోవటం - అయిపోతూ వుంది. శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ 'సాక్షి' నాటకంగా మార్చినా చలనచిత్ర విధానమే వుంది. ప్రదర్శనకు అవకాశం

లేకుండా ఉంది. ప్రయోగ సామర్థ్యం పెంచుకోలేదు. సినిమా శిల్పం వేరు. నాటక కళ వేరు. సినిమా స్క్రిప్టు ఎంత శ్రమపడి సాధించినా నాటకం కాలేదు. మంచి నాటకం శ్రమపడితే మంచి సినిమా స్క్రిప్టు కావచ్చు. ఈ దృష్టితో, వీటి వైవిధ్యం వల్ల సినిమా స్క్రిప్టు ముద్రించినా నాటకంగా రూపొందలేదు. ప్రయోగింపబడదు కానీ శ్రవ్య నాటక దృష్టితో చదువుకోవటానికి ఉపయోగ పడుతుంది. అంతే సాక్షి నాటకం. చదువుకోవచ్చు. ప్రదర్శింపరాదు.

'సాక్షి' చిత్రంలోని సంభాషణలు యథాతథంగా పొందుపరచిన పూర్తి సినిమా స్క్రిప్టు. అందులో సంభాషణలు మాత్రమే లేవు. స్థలము, స్థల వర్ణనము, నటనానుసారాల సూచనలూ విపులంగా చెప్పబడి ఉన్నాయి. సన్నివేశ వర్ణనం కూడా ఉంది.

శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ వ్రాసిన ఈ సాక్షిలో సుమారు పాతికేళ్ళ క్రితం కోనసీమలో ఎటువంటి తెలుగు ప్రయుక్త మవుతూ వుండేదో, పల్లెలలోని జనం తీరుతెన్నులు ఎలా ఉండేవో, చూపటానికి ప్రయత్నం జరిగింది.

రచయిత రెండు విధాల కృతకృత్యుడు. సజీవమైన భాషను సజీవంగా వ్రాయగలగడం, పల్లెవాతావరణం కళ్ళకు ప్రత్యక్షీకరించడం, పల్లె వాతావరణంలో ప్రకృతి, మానవ ప్రకృతి రెండూ అంతర్భూతంగా నిలిచివున్నాయి. పల్లె చుట్టుపట్ల వున్న ప్రకృతి చక్కగా చిత్రింపబడింది.

పల్లెప్రజల కట్టుబాట్లు, మానాభిమానాలు, తీరుతెన్నులూ, ఆశలూ, ఆకాంక్షలూ, జీవిత విధానం, పట్టణ నాగరికతతో అప్పుడే కలుషితం కావటం ప్రారంభించిన పల్లె ప్రజల మనస్తత్వాలు, ఊరిపెద్దల దౌర్జన్యాలు, కండబలమూ, గుండెబలమూ గల వ్యక్తులు, కుట్రలు, కుయుక్తులు చేసే మనుష్యులు - వివిధ విధాలుగా పల్లె వాతావరణం గోచరమవుతుంది.

ఆత్మార్పణ చేసుకొన్నంత అధికంగా ప్రేమించగల స్త్రీలు గోచరమయ్యే ఈ సాక్షి ఆధారంగా, ఆ సమాజం ఊహించుకొంటే అక్కడేమీ విపర్యస్తం కలక్కపోతే ఈ రచన గొప్పది.

పకీరు అంతటి దుర్మార్గుడు, కిష్టప్ప అంతటి అమాయకుడు ఎక్కడైనా ఉంటారా అన్నది సినిమా చూచింతర్వాత చాలామంది అడుక్కొన్న ప్రశ్న! సినిమాగా కాకుండా, నాటకంగానో, నవలగానో ఈ సాక్షి చదివితే అటువంటి అనుమానం రావటానికి అవకాశం అల్పం మాత్రమే.

పకీరు దుర్మార్గుడే. అతని దుష్టతకూ అవధి ఉంది. కిష్టప్ప అమాయకుడే! అమాయకత్వానికీ హద్దు ఉంది. అవధినీ హద్దునూ సాక్షిలోనే చూపించిన రచయిత జాగ్రత్త కలిగి వున్నట్లే!

అయితే ఆ పాత్ర చిత్రణలో అతిశయోక్తి వుంది. గుణలేశం, గుణాధిక్యంగా చూపించటం, కావంటే దోషలేశం, అధికతరంగా ప్రదర్శించటం స్పష్టంగా బాహాటంగా ఈ రచనలో గోచరిస్తుంది.

కథా రచనలో రచయిత సాధించిన నిపుణత ఉదాత్తమయింది. కథను అల్లుకోవటంలో త్రిప్పిన మెలికలు చుట్టుకుపోయిన పాత్రలు విధిచేతిలో కీలు బొమ్మలు లాగా సంచరించాయి.

చెల్లికి అన్నపై ఉండే ఆత్మీయత, భర్తపై ఉండే అనురాగానికి మధ్య సంఘర్షణ వస్తే, ఫలితం ఇలా వుంటుంది అని సాక్షిలో చూసినరీతి సహజతకు సామీప్యంలో వుంది. పురుషత్వంపై మమకారం పెంచుకొన్న స్త్రీ, పురుషుడిలో నెలకొన్న దుష్టతను గ్రహించలేదనీ, బంధువులందరకూ దూరమయి పోవటం అయినా సహిస్తుందనీ చెప్పిన తీరు వాస్తవికతకు చేరువలో ఉంది. అవసరం ఉన్నంతవరకు ఆప్యాయత నటించి, అది తీరిపోగానే అసలు రంగులో కనిపించే మనుష్యుల మధ్య అమాయకుడైన అర్భకుడు పొందిన అగచాట్లు కన్నీళ్ళు తెప్పిస్తాయి. కొన్ని చక్కని సూక్తులు రచనలో రూపొందాయి. శారీరకబలంకంటే దైవబలం గొప్పది అనే పౌరాణిక సత్యం ప్రదర్శితమయింది. రెచ్చగొడితే చచ్చుపిల్లి అయినా తిరుగబడుతుందనీ తెలియజెప్పినట్లు అయింది. రచయితగా పలువురకు పరిచయమైన శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ ఈ రచనలో ఏ లోపమూ

రానీయలేదు. గుండె ధైర్యం ఉన్న రచయిత మాత్రమే సినీమా స్క్రిప్టును పుస్తకంగా వెలువరించటానికి ప్రయత్నిస్తాడు. ఆ ధైర్యం రచయితకుంది.

3. సామాజికుల సానుభూతిని కొల్లగొట్టగలిగితే నాటకం రక్తి కడుతుందన్న అభిప్రాయం నాటక వాఙ్మయ నిర్మాణానికి దోహదం చేస్తూ వుంది. సానుభూతి పాత్రలవల్ల, పరిస్థితులవల్ల, ప్రభావాలవల్ల కలుగుతుంది.

శ్రీ కింపర్తి అప్పారావు సృష్టి 'అందని ఆదర్శం' ఈ సానుభూతి చమత్కార ప్రయోగం. రంగస్థలంమీద రక్తి కడుతుంది. చూస్తున్నంత సేపు బాగుంటుంది. తర్వాత ఏమీగుర్తుండదు. అతి సామాన్యమయిన ఈ రచన ప్రయోగంలో విశేషంగా ఉంటుంది. రచన విశిష్టంగా లేకపోయి కూడా ప్రయోగం బాగుండగల రచనకు దీనిని ఉదాహరణంగా చెప్పవచ్చు.

ఈనాడు ఆమూలా ఈమూలానుంచి అసంఖ్యాకంగా వెలువడుతున్న ఈ రకం నాటికల్లో ఇది ఉత్తమ రచన కాకపోతే, ఆరు ఉత్తమ బహుమతులు వచ్చుండేవి కావు.

ఇప్పుడనేక గ్రామాల్లో నాటక సమాజాలు ఉన్నాయి. ప్రతి యువకుడు ముఖానికి రంగు పులుముకొని స్టేజీమీద నాటకమాడాలని అనుకొంటే అనుకోవచ్చు. అలా ఎవరయినా ఆడడానికి వీలుగా వస్తున్న నాటికలలో ఏ విషయం అయినా ఎంత తగ్గితే అంత మంచిది.

ఆ తగ్గటం ప్రారంభమయిన దగ్గర్నుంచి పాత్రలు తగ్గాయి. రంగాలు తగ్గాయి. పేజీలుకూడా తగ్గాయి. భాష తగ్గింది. భావాలు వెనక్కు తగ్గాయి. ఆ తగ్గిన నాటికల పోటీలలో నెగ్గి బహుమతులు పొందిన నాటిక యిది.

ఈ నాటికలో పాత్రలు నాలుగు. అందులో ఒక స్త్రీ పాత్ర. ప్రదర్శన కాలం ముప్పావుగంట. సంభాషణ చాతుర్యంవల్ల ప్రదర్శన రక్తికట్టవచ్చు. అనాయాసంగా ప్రదర్శింపవచ్చు. ఒకే రంగం లాడ్జి రంగస్థలం.

అన్ని చెడ్డలవాట్లు వున్నవాడు విశ్వం. లాడ్జిలో రూంబాయ్‌తో లెక్కా పత్రం లేకుండా మాట్లాడతాడు. రామంతో ప్రేమ సంగతి చెప్పాడు. రామం నాలుగు నీతులు చెప్పాడు. విశ్వం బాగుపడాలంటే రామం తన భార్య అయిన సరళను విశ్వంతో ముడిపెట్టాల్సి వచ్చింది. ఆమె తన భార్య అని చెప్పకుండా, ఆమెను తీసుకు వచ్చాడు. ఆమె రామం భార్య అని తెలిసి సరళ చనిపోవాలని తెచ్చుకున్న విషం మ్రింగి విశ్వం చనిపోతాడు.

తాగుబోతు, వ్యభిచారి ఆడదాన్ని అనుభవించి వదిలేయాలేగాని, అన్యాయం చేయకూడదన్న ఫిలాసఫీ ప్రదర్శించే విశ్వం, రామం చెప్పిన నాలుగు మాటలువిని మారిపోయాననటం సహజతకు దూరంగా వుంటుంది. పెళ్ళి అయ్యాక చెడ్డలవాట్లు వదిలేస్తాననడం స్టేజీ మీద నాటకంగా వుంటుందేమోకాని నిజ జీవితంలో అసహజంగా వుంటుంది. రామం విశ్వంలో మార్పు తేగలిగే సంత గొప్ప సత్యాలేమీ చెప్పలేదు. విశ్వం మార్చుకోగలిగినంత పటిష్టమైన సంఘటన ఏమీ జరగలేదు.

తన భార్యను సోదరుడివంటి విశ్వానికి ఇచ్చి పెళ్ళి చేస్తాననే రామంవంటి మంచి మనిషి సంఘంలో ఉన్నాడో, లేడో అనుమానంగానీ ఊహల్లో, సినిమాల్లో, ఈ నాటకంలో వున్నాడు.

విశ్వంతో వివాహం ఇష్టంలేని సరళ భర్తతో ఇంటిదగ్గరే వాదించి, తేల్చుకోని ఒప్పుకొనే లాడ్జికి వచ్చింది. వచ్చింతర్వాత వాదన వల్ల ప్రయోజనం లేదు. వస్తూ విషం తెచ్చుకోవటంలో అర్థంలేదు. విషం పుచ్చుకోవటమే ఇష్టమయితే, ఇష్టంలేని మాట భర్త చెప్పగానే ఇంటిదగ్గరే విషం తీసుకోవలసింది.

ఆడవాళ్ళ గురించి విశ్వం పలికే తీరు వింతగా ఉంటుంది. విశ్వం మారిపోయినట్లు ప్రవర్తించటం విడ్డూరంగా ఉంటుంది. మరణించటం మరీ విడ్డూరంగా ఉంటుంది.

ఈ నాటక కథా వస్తువులో ప్రత్యేకత లేదు. పాత్ర చిత్రణంలో వాస్తవికత లేదు. రచయితకు సంభాషణ చక్కగా వ్రాసే నేర్పువుంది. అందువల్లే నాటక ప్రయోగార్హత పొందింది. బాగా నటించగల నటులుంటే ఈ నాటకం ప్రదర్శింప వచ్చు. ఇంతకంటే మంచి నాటికలు పోటీకి రాకపోతే ఈ నాటికకే బహుమతి రానూవచ్చు.

4. గేయ నాటిక నృత్యం సంగీతంపట్ల మొగ్గులు నాటిక వుంటే ప్రయోగ సౌలభ్యం పొందుతుంది. దానికి ఇబ్బంది కూడా వుంది. నటులే కాక నర్తకులు సంగీతకారులు కావలసివుంటుంది. అన్నీ ఉంటే అది ఉత్తమ ప్రయోగం అవుతుంది. రూపకం, ప్రయోగం కోసమే గేయరూపకం కావటం ఇక్కడ ప్రస్తుతం.

ఈ స్ఫూర్తిశ్రీ 'సూర్యముఖి' గేయ సంపుటి శ్రవ్యధర్మంతో ప్రచురణం పొందింది. దృశ్య ధర్మంతో ప్రయోగం పొందింది. ధర్మద్వయం సంతరించు కోవటమే 'సూర్యముఖి' ప్రత్యేకత.

ఈ సంపుటిలో నాలుగు గేయ నాటికలున్నాయి. అందులో 'సూర్యముఖి', 'రససూక్తము', 'దీపశిఖ' - స్వతంత్ర రచనలు. ఇవి 'యువ', 'సాహితి' పత్రికలలో ప్రచురితాలు. 'సువర్ణద్వారం' - శ్రీమతి సరోజినీ నాయుడు వ్రాసిన 'గోల్డెన్ థ్రెషోల్డ్' ఆధారంగా రచయితమయి, ఆకాశవాణిలో ప్రసారమయిన సంగీత రూపకం.

భాస్కరుని ప్రియురాలయిన సూర్యముఖి గుట్టుచప్పుడు కాకుండా జీవిస్తూ వుంటే, వాళ్ళ శృంగార జీవితం తెలసీ తెలియని తోటి పూల చెలికత్తెలు వంచింప చేయబోయి వంచింపబడటం, అక్కడ పరామర్శలు, పరాచికాలు, పరాజయాలు, సూర్యముఖిలో చూపింపబడ్డాయి. స్త్రీ హృదయం వంటి పూలలో మార్దవం, పరిమళం కనిపించే రచన.

సృష్టి ప్రయత్నంలో ఉన్న బ్రహ్మ, సరస్వతి గానామృతంలో తల మున్కలయి, సృష్టి సూత్రం తెగిపోతుందేమోనని శంకించి ఆమెను వారించగా

జవాబు చెపితే, ఏర్పడ్డ వాదోప వాదాలు, నువ్వులేకుండా నేను, నేను లేకుండా నువ్వు లేవనుకోవటంతో ముగిసే నాటిక రససూత్రం. స్త్రీ, పురుషుల్లో అవినాభావ సంబంధం చూపి, అద్వైతం ప్రబోధించే రచన. నాటకీయత వున్న నాటిక.

చీకటిని తిరస్కరించి, వెలుగును ఆహ్వానించే, మానవునిలో మార్పు తెచ్చి, వెలుగుకు తల్లి చీకటి అని తెలిపే ప్రయత్నమే దీపశిఖలోని కథ. ఉన్నత భావస్ఫూర్తి ఉన్న రచన.

భారతజాతి జీవన విధానం - దాని రూపురేఖలు రేఖా మాత్రంగా చూపే రచన 'సువర్ణ ద్వారం'. చరిత్ర స్వర్ణాక్షరాలుగా సువర్ణ ద్వారం రచించిన శ్రీమతి సరోజినీ నాయుడు ప్రసక్తి కూడా నాటికలో కనబడటంతో రచనలో స్వతంత్రత కనబడుతుంది.

తాత్కాలిక సంతోషము
తాత్పర్య విహీనవాంఛ

రచనలో అందమయిన పదాల పొందిక సుందరంగా, రసతుందిలంగా అనుప్రాస బంధురంగా వుంది.

'ఎవరే ఆ పుణ్యశాలి
వైవాహిక పుష్పమాలి
విస్ఫారిత నేత్రకేళి
విజయోత్సవ కళాహేళి'

సువర్ణద్వారంలో తప్ప తక్కిన నాటికలలో వ్యావహారిక భాషకాక గ్రాంథికమే ముద్ర! ప్రయత్నిస్తే ఈ సంపుటిలోని అన్ని నాటికలు కొద్ది శ్రమతో నృత్య నాటికలుగా ప్రయోగించవచ్చు; ప్రదర్శన రక్తి కట్టవచ్చు. గ్రంథాలయాలకే కాక, చదువుకోవటానికి, పాడుకోవటానికి ఇది మంచి రచన.

కవిగా, నవలాకారుడిగా, వ్యాసరచయితగా పలువురికి పరిచయమయిన శ్రీ స్ఫూర్తిశ్రీ ఇతర రచనల లాగా ఈ సంపుటి ఉత్తమ గేయ నాటికా సంకలనం.

5. జనం చెయ్యలేని దానిని, ఆచరించలేని దానిని, వీలుకాని దానిని వస్తువుగా గ్రహించి చెయ్యగలిగినట్లు, ఆచరించగలిగినట్లు, వీలయినట్లు సృష్టిస్తే ఆ నాటకం ప్రయోగంగా విజయవంతం అవుతూవుంది. ప్రేమ, భక్తి, విశ్వాసం, నీతి, న్యాయం విషయంలో సంఘంతో పేచీ వచ్చినపుడు ఎదుర్కోలేక తప్పించు కోవడం సామాన్యుల పని అయితే ఎదురు తిరగడం గొప్పవాళ్ళ వ్యవహారం. ఆ గొప్ప కథ సామాన్య సామాజికుల కల, ఊహ, భావన, ఆందం. అందుకని అది నాటకంగా మంచి ప్రయోగం.

శ్రీ రావి వెంకటచలం నాటకం 'మాట తప్పకు' ఒక నీతి తప్పని మనిషి కథ. ప్రయోగం బాగా వుంటుంది. ఉదాత్తంగా, ఉన్నతంగా కాకపోతే మాత్రం ఏం కానీ సాహిత్యపు విలువలు కూడా కించిన్మాత్రంగా సంతరించుకొంది.

విజయనగరం రాఘవ నాటకం పోటీల్లో, (1960), సర్సాపూర్ నాటక కళాపరిషత్తులో (1961), రాజమండ్రి కళానికేతన్ పోటీలో (1964), అనంత పురం 23 వ ఆంధ్ర నాటక కళా పరిషన్మహాసభలో (1964) ప్రదర్శింప బడినప్పుడు ఈ నాటకం రచనకు ప్రథమ బహుమతో, ద్వితీయ బహుమతో వచ్చింది.

సత్య హరిశ్చంద్ర కథకీ, 'మాట తప్పకు' కథకి భావంలో తప్ప కథలో సంబంధం లేదు. ఆడిన మాట తప్పకూడదనే భావం పైన అల్లుకుపోయిన రచనలో ధ్వనిగా అనాథలను రక్షించాలి అని వినిపిస్తుంది. ఒక అనాథకు అభయమిచ్చిన శంకరశాస్త్రి ఆ మాటా ఏ పరిస్థితుల్లోను తప్పకుండా వుండటమే 'మాట తప్పకు.'

నాటకంలో ధర్మానికీ, అనురాగానికీ సంఘర్షణ, మనస్సుకీ, హృద యానికీ ప్రేరణ కలగగా, ధర్మమూ, మనసూ జయిస్తాయి అని చూపే రచన,

చదివి చూడాలి. మాట తప్పకుండా అనాథను ఇంటిలో పుంచాలో, పుత్ర ప్రేమతో కొడుకును ఇంటిలో పుంచాలో అనే భావ సంఘర్షణకు సంబంధించిన ఆలోచనలో ఆవేశం పాలు హెచ్చు.

ఈ నాటకంలో కొన్ని పాత్రలు జీవితం నుంచి దూరంగా పోతాయి. కొన్ని ఒకవైపు పోతే, తద్భిన్నంగా మరికొన్ని. మంచితనం తప్ప మరో గుణం లేని పాత్ర శంకరశాస్త్రి. దుర్గుణం తప్ప అన్యం ఎరుగని పాత్ర కామరాజు. మగాడి దుర్మార్గతకు బలి కావటం తప్ప తెలియని స్త్రీ పాత్రలు తెరమరుగున విశాలాక్షి, తెరపైన శారద.

విశాలాక్షి తెరమరుగు జీవితానికి కానీ, కామరాజు చివరికి మరణించటానికి కానీ, రామశర్మ ఇంటి నుంచి పారిపోవటానికి కానీ, 'ఒక వ్యభిచారిణికి జన్మించి మాలదాని చేతులమీదుగా పెరిగిన అనాథ' గా శారదపాత్ర - సృష్టిలో గానీ కారణం అంతు చిక్కకపోతే శంకరశాస్త్రి పాత్రలో ఔన్నత్యం పోషించటానికే అనుకోక తప్పదు.

ఇంక శంకరశాస్త్రి "అగ్నిహోత్రం వంటివాడు", "వేదపండితుడని పేరు పడ్డ విశిష్ట బ్రాహ్మణుడు" అయితే "వేద పాండిత్యానికి పరిణామం జాత్యహంకారం కాదు, జాతి ఐకమత్యం, వేద విద్య గుర్తించేది కుల గౌరవం కాదు, గుణ గౌరవం!" "తను అగ్రకులస్థుడని, అన్యకులాలకు అతీతుడనని గర్వించే బ్రాహ్మడు ఛండాలుడు గాని బ్రాహ్మడు కాడు" అంటాడు.

ఉత్తమ నటుడుగా నలుగురికీ తెలిసిన శ్రీ రావి వెంకటచలం రచయితగా ఈ రచనలో నటనకు పుష్కలంగా అవకాశం ఇచ్చాడు. సంభాషణలు, ఉపన్యాసాల్లాగా దీర్ఘంగా వున్నా, చతురత చూపి, మెలుకువలు సాధించాడు!

6. సామాజికుల కల, ఊహ, భావన, ఆనందం భిన్నవస్తువులను ఆశ్రయించుకోకుండా నటనను చుట్టుకొని తిరగటంలో నాటకం ప్రయోగంగా విలువ మరింత సంతరించుకొంటుంది. నటులు, నటన, నాటకరంగం, నాటకవస్తువులుగా వచ్చిన నాటకాలలో 'నటనాలయం' గుర్తింపు పొందుతుంది,

ఊహారూపంగా శ్రీ మోదుకూరి జాన్సన్ నుండి వెలువడ్డ 'నటనాలయం' మంచి ప్రయోగంగానేకాక మంచి సాహిత్యంగా కూడా ఉంది. ఉత్తమ రూపకం ఆవిర్భవించటానికి ఈ ధర్మద్వయ విశిష్ట నాటక సాహిత్యం దోహదకారి అవుతుంది.

కొన్ని నాటకాలు ప్రదర్శిస్తే బాగుంటాయి. చదవటానికి బాగుండవు. చదివితే బాగుందీ నాటకం. ఒక తరగతి రచనలో కనిపించే లోపం-వస్తులోపం, అదీ రచనలో లేదు. ఏవో రెండు సంఘటనలు, సంఘర్షణలు వుండి ప్రయోగంలో అల్ప విజయం పొందే రచనలకు దూరంగా ఉందీ నాటకం; ఒక ప్రయోజనంతో. ఈ ఇతివృత్తంలో కొన్ని నాటికానాటకాలు ఉన్నాయి. కాని ఈ రచయిత ఈ వస్తువు దర్శించిన పద్ధతిలో కొత్తదనం వుంది.

ప్రధాన పాత్ర రాజారావు. ఈ పాత్ర సృష్టి వెనుక 'పుట్టిల్లు' సినిమా తీసిన కీ॥శే॥ రాజారావు స్మరణ వున్నట్లు అనిపిస్తుంది.

నాటకంలో కథ కీ॥శే॥ రాజారావు జీవితానికి వ్యాఖ్యానం అనిపించవచ్చు. రచయిత ఆత్మీయత ద్యోతకం కావచ్చు.

నటన జీవిత ధ్యేయంగా- ఉత్తమ కళగా, ఆరాధ్యంగా భావించే ఒక వ్యక్తి తపస్సులో జరిగిన గృహ విచ్ఛిత్తి రచనలో ప్రధానాంశం.

నటన పూజగా, నటులు పూజారులుగా, నటనాలయం దేవాలయంగా భావించి, బాధలలోనూ ఆనందం ఆకాంక్షించిన ఒక మహనీయ వ్యక్తి బాధల క్రోడీకరణ మీనాటకం.

ఈ నాటకంలో రచయితకు అసందిగ్ధంగా వున్న విషయాలు రెండు. మొదటిది నటుడు పాత్రలో లీనమయిపోయి, తన వ్యక్తిత్వం మరచిపోయి నటించడమా? లేక, నటుడు పాత్రలో లీనమయి కూడా తన వ్యక్తిత్వం మరచిపోకుండా వుండటమా? నటుడయిన శ్రీ మోదుకూరి జాన్సన్ రచయితగా ఈ సందేహం నివృత్తి చేసుకోలేదు.

నటుడు తను ధరించిన పాత్రలో లీనమయిపోయి ఆ పాత్రలో జీవించినట్లు నటించాలి కానీ జీవించకూడదు. సంస్కృతాలంకారికులు జీవించినట్టు నటించ మన్నారు కానీ జీవించమనలేదు. ఈ అవ్యవస్థ మారినా నాటకం విలువ మారదు. రెండు-రసం సామాజిక గతమా? పాత్రగతమా! సంస్కృతాంగ్ల నాటక లక్షణానుగుణంగా పరిశీలిస్తే రసం సామాజిక నిష్ఠమే. నాటకంలో రసానుభూతి పొందేది ప్రేక్షకులుగాని పాత్రధారులుకాదు.

నటుడు పాత్రలోని భావ తీవ్రతకు ప్రభావితుడై, మనసా, వాచా, కర్మణా లొంగిపోతే, ఆ నటుడు సమాజంలో వ్యక్తిగా జీవించలేక పిచ్చివాడయి పోతాడు. రాజారావు, చిట్టిబాబు అలా పతనమయినవాళ్ళే !

రెండు విధాల జీవితాలు పరస్పర సంఘర్షణ రాకుండా జీవించగలిగితే నటుడు ఉత్తమ కళాకారుడవుతాడు. నటుడుగా జీవించాలి. వ్యక్తిగా జీవించాలి. వ్యక్తి నటుడులో ప్రవేశించినా కష్టమే! నటుడు వ్యక్తిలో ప్రవేశించినా కష్టమే!

ఏ కష్టనష్టాల తాకిడికి తట్టుకోలేక నమ్మిన నటనపై తపస్సు, తపన, ఆరాధన నిలుపుకోలేక ఇటు సహజంగాగానీ, అటు పూర్తి అసహజంగా కానీ జీవించలేక త్రిశంకు స్వర్గంలో పిచ్చివాడయిన పాత్ర రాజారావు.

తన జీవితం కళకు అంకితం చేసుకొని, అంతా కళే, భూమి మీద కళే తరం లేదనుకొన్న పాత్ర చుట్టూ తిరిగిన పాత్రలు అన్నీ కళేతరంగా వున్నాయి. కళకంటే భిన్నమయిన జీవితం కలిగి వున్నాయి. నటుడు జీవితమనే మహా ప్రవాహంలో కళ తరంగ ప్రాయమే అనుకొనేకంటే అంతర్వాహిని అనుకొంటే చిక్కులేదు. ప్రవాహమంతా నటనే అనుకొంటే ప్రమాదం.

సరళ మీద సానుభూతి వున్నట్లు రచయిత చూపించినా, రచయిత సానుభూతి లేనట్లు పర్యవసానంలో గోచరమవుతుంది. సరళ, సరళజీవితం జీవించింది. కృత్రిమత్వం లేదు. ఏ పాత్రనయినా అసహజతా దోషంతో కొట్టి పారవేయవచ్చుగానీ, సరళ పాత్ర కి అవకాశం లేదు,

నాటకంలో కథ కొంతవరకు కల్పనా జగద్వ్యాహారం చేస్తుంది. పాత్రలు ఊహాలోకంలోంచి ప్రభవించినట్లు కనిపిస్తాయి. నటనపట్ల విరహం కనిపిస్తుంది. వాస్తవికతాదృష్టితో సహజ జీవితాలకు కవితా చిత్రణ 'నటనాలయం'.

నటన, (రచయిత : శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి, ఆంధ్ర యూనివర్సిటీలో ప్రదర్శితం. అప్పుడు శ్రీ మోదుకూరి జాన్సన్ 'లా' విద్యార్థి) ప్రభావం 'నటనాలయం' పై పేరులోనూ, నాటకంలో అంతర్నాటకాలు ప్రవేశపెట్టటంలోనూ, సంభాషణలలో కవిత్వ పద్ధతి ప్రవేశపెట్టడంలోనూ ఉంది. అయితే 'నటన'లో అంతర్నాటకాలు కథకు సంబంధించినట్టుండవు. నటనాలయంలో సంబంధించినట్టున్నాయి.

'మరో మొహంజదారో'లో (రచయిత; శ్రీ యన్. ఆర్. నంది) నటనా సామాగ్రి లేకుండా నటించ మనటం వుంది. ఇది నటులకు అగ్నిపరీక్ష. ఈ పద్ధతి ''నటనాలయం'లో గోచరమవుతుంది.

'మాటతప్పకు' (రచయిత; శ్రీ రావి వెంకటచలం)లో తండ్రీ కొడుకుల భావసంఘర్షణ వంటిది. రామయ్య-రాజారావు సంభాషణలో గోచరమవుతుంది.

"పునర్జన్మ" ప్రభావం సరళా, నాగభూషణం నటించిన దృశ్యాలలో కనిపిస్తుంది. ఈ నాటకాల ప్రభావం ఎక్కువగా కనిపించినా ప్రత్యేకత ప్రోది చేసుకొన్న నాటకం 'నటనాలయం'.

గాయకుడుగా, నటుడుగా పలువురి పరిచయం కలిగివున్న శ్రీ మోదుకూరి జాన్సన్‌ని ఈ నాటకం రచయితగా పరిచయం చేస్తుంది. నటనానుభవం పుణికి పుచ్చుకున్న ఈ రచన నటనకు అవకాశం ఇచ్చింది.

ఇప్పుడు వస్తున్న నాటకాలలో భాషను గూర్చి ఆలోచించ నవసరం అంతగా లేదు. ఈ నాటకంలో ఆలోచించవచ్చు. ఇందులో గ్రాంథిక రచన, వ్యావహారిక రచన ఉన్నాయి. వ్యవహార సాన్నిహిత్యం వల్ల వ్యావహారికం బాగుంది. గ్రాంథికంలో వ్యావహారికం వుంది. కొన్ని అపశబ్దాలు, తప్పు సమాసాలు ఉన్నాయి.

చంపటానికి వచ్చి వెళ్ళిన నాగభూషణం, విడిచిన భయాందోళనలు గుండె నిండా నిండిన సమయంలో జగన్ వచ్చినపుడు సరళ ఆ విధంగా మాట్లాడటం అసహజం. ఈ అల్పలోపం మినహాయించితే పాత్రల చిత్రణ హృద్యంగా ఉంది.

చిట్టిబాబు పాత్ర మీద సామాజికులకు జాలి, సానుభూతి వుంటాయి. ఊహాత్మకత తగ్గి వుంటే రాజారావు పాత్ర హృదయాలు దొంగిలించేది. 1965 ఆంధ్ర నాటక కళాపరిషత్తు పోటీలలో ఈ నాటకం ఉత్తమ రచన.

ఒక తెగ రచనలలో 'నటనాలయం' నిర్వివాదంగా ఉత్తమం. చదవటానికి బాగుంటుంది. ప్రదర్శించటానికి అంతకంటే బాగుంటుంది. ఫార్సులు, మెలో డ్రామాలు ఎక్కువైన ఈ కాలంలో ఆంధ్ర రంగస్థలానికి నాటకీయత కలిగిన ఈ 'నటనాలయం' మిగులుతుంది.

సామాజికులకు పరిచయమైన వస్తు, పాత్ర, సన్నివేశ, సంభాషణాది సంగతులు నాటక ప్రయోగానికి దోహదం చేస్తాయి. ఒక కళారూపం ప్రభావం వల్ల నాటక ప్రదర్శనం విజయవంతం అవుతుంది. సామాజికుల సానుభూతి, కల, నాటక ప్రయోగానికి అండగా వుంటాయి. అంతదాకా మంచి ప్రయోగ ధర్మం ఉన్న నాటకం సిద్ధిస్తుంది. వాస్తవికతా నేపథ్యంతో, సామాజికావగాహనతో కళాధర్మంతో, సాహితీ వైశిష్ట్యంతో, కళామూర్తుల సమ్యక్ సమ్మేళనంలో రూపక ధర్మద్వయ సమన్వయంతో, ఉత్తమ నాటకం వెలువడుతుంది.

# 6. ఇసుకపల్లి లక్ష్మీనరసింహ శాస్త్రి కథలు

కథావస్తువు స్వీకరించటంలోనే రచయిత మన స్తత్వం తెలుస్తుంది. కథా కథనంలో సంస్కారం, పాత్రల ప్రవర్తనలో అనుభవం తెలుస్తాయి. రచయిత ఎప్పుడో తప్ప సాధారణంగా తన అభిరుచి, పరిసర వాతావరణం-వీటి నుంచి వెలుపలికి రాడు. ప్రతిభావంతుడు, బుద్ధిశాలి అయిన రచయిత తన పరిధికి బాహిర ప్రకృతి దర్శించి, రచన చేయనూవచ్చు, మెప్పించనూవచ్చు. శ్రీ ఇసుక పల్లి లక్ష్మీనరసింహశాస్త్రి 'అన్నదమ్ములు' లో స్వీకరించిన కథావస్తువు, సర్వ మానవ హృదయ సన్నిహితమే అయినా పాత్ర చిత్రణలో, పరిసర కల్పనలో, తన పరిధి కవతల వున్న మానవ ప్రకృతిని దర్శించినట్లే!

శ్రీ శాస్త్రిగారి కథలలో ప్రధాన వస్తువు, మధ్యతరగతి కుటుంబం. రచయిత అనేక కోణాల నుంచి ఈ వస్తువును దర్శించి చేసిన కథా రచనలలో భావ పాటిష్ఠ్యం వుంది. ప్రతికోణంలో ప్రదర్శితమయిన పరిశీలనా నైపుణ్యం హృదయాన్ని కదిలిస్తుంది. ఈ రచయిత కథలలో ఈ యువతరం రచయితలు తొక్కిసలాడుతున్న ప్రేమ వాతావరణం, కాలేజీ పరిసరాలు కని పించవు. అంతేకాదు, ఆది మధ్యాంతాలలో అత్యాధునిక రచయితలు విచిత్ర భావనలో కవితా విహారాల కుతూహల పరికల్పితేతివృత్తాలు లేవు. శ్రీ శాస్త్రి కథానికలు చాలావరకు వాస్తవికతలోంచి పలికురికిన సత్యాలు, సంధించిన మేలి గుణాలు.

సర్వం సౌందర్యం, అంతా ఆనందం, నిర్విచార జీవితం, కార్లలో షికార్లు, బీచిలలో పచార్లు, పార్కులలో విహారాలు - నా హృదయం నీకర్పించాను, దేవుడు కూడా అడ్డురాడు, భగవంతుడు కూడా క్షమించడు వంటివి కనబడే కథలు శ్రీ శాస్త్రి వ్రాయలేదు. అంకా ఏడుపు, వ్యధ, ఆకలి వంటివి కూడా

వ్రాయలేదు. సుఖదుఃఖాలు సమ్మిళితమైన జీవితం చిత్రితమయింది. జీవితం తెలియని, జీవితం పట్ల వాస్తవిక దృక్పథం లేని యువతరం రచయితలకు అతీతంగా శ్రీ శాస్త్రి వుండటానికిగల ప్రత్యేక కారణం, జీవితంపట్ల వున్న అభిప్రాయాలు వాస్తవికతకు చేరువగా వుండటమే! 'జితేంద్రియుడు'లో మిస్ అనురాధతో పెరిగిన కథకు పర్యవసానంలో వాస్తవికత కవితాత్మకంగా వుంది. ముగింపును మరోవిధంగా జీవితం తెలియని రచయితలు చేస్తారు. 'గృహసీత'లో ఉమాపతి నర్సును దూరంగా నెట్టి భార్య దగ్గరకు పారిపోవటం వివేకవంతం, రాజీపడటం, జీవితం, జీవితంలోని వాస్తవికత.

ఆంధ్రదేశం కథా రచయితలలో మొదటి తరం వారి ప్రభావం ఈ రచయితపై గోచరమవుతుంది. ముఖ్యంగా శ్రీ కొడవటిగంటి కుటుంబరావు కథాకథనంలో చూపే నేర్పు, శైలి, విధానంలోని మెలకువ, రేఖా చిత్రాలు గీసినట్లు రెండు, మూడు పదాలతో ఒక ఉదాత్త భావం వ్యక్తపరచటంలోని ఒదుపులు శ్రీ శాస్త్రి రచనంపై ప్రభావం చూపినట్లు స్ఫురణ కలిగిస్తాయి. ఈ రచయిత రచనలు చదివి, ప్రభావితులై, తమ మార్గంలో రచనలు చేసుకొంటున్న మూడో తరం రచయితలు కొద్దిమంది లేకపోలేదు. 'కస్తూరి' చదువుతున్నంతసేపు స్త్రీని అర్థం చేసుకొనే ప్రయత్నంలో తిన్న ఎదురు దెబ్బకు రచయిత సృష్టించిన 'నేను' ప్రత్యక్ష సాక్ష్యం. ఇటువంటి కథలు ఇటీవల చాలామంది వ్రాస్తున్నారు.

శ్రీ శాస్త్రి కథల సంపుటాలలో సాధారణంగా స్త్రీ పాత్రల మనస్తత్వం సాంసారికంగా ఉంటుంది గానీ, పురుష పాత్రలు కొంచెం భిన్నంగా వుంటాయి. పెళ్ళయిన పురుషుణ్ణి ప్రేమించే పెళ్ళికాని స్త్రీ పాత్రలు కనిపిస్తాయి గానీ, పెళ్ళయిన స్త్రీని ప్రేమించే, పెళ్ళయిన లేక పెళ్ళిగాని పురుష పాత్రలు కనిపించవు. ఈ రచయిత బాలికల మనస్తత్వంలో దర్శించిన విచిత్రతర గమనార్హం. బాల్యదశ అతిక్రమించి, యౌవన ప్రారంభంలో ఆడపిల్లల మనస్సులలో కలిగే భావపరిణామం విచిత్రంగా వుంటుందని రచయిత సమ్మతం. ఆ సమ్మతం పూర్తిగా సత్యదూరం కాదు. ఈ దశను నిర్ణయించి, తేల్చి చెప్పటం వీలుకాదు.

ఈ పరిస్థితి తెలిపే కథలు చదువుకోవటానికి సరదాగా వుంటాయి కాని, పూర్తి వాస్తవాలా అనేది అనుమానం. 'నవ్వులా-పువ్వులా'లో పదిహేను సంవత్సరాల 'జయప్రద' తల్లిదండ్రులు అంత త్వరగా తనకు పెళ్ళి చేసినందుకు ఏడుస్తుంది. అదే వయసు సావిత్రి తనకింగా పెళ్ళి చేయలేదని ఏడుస్తుంది. 'పెళ్ళి కావాలి'లో చిన్న వయస్సులో పెళ్ళయి తల్లి అయిన 'పల్లి'ని చూసి మంచం పట్టిన పావని మనస్సులోని మాట పెళ్ళి కావాలని పల్లి పసిగ్రగట్టేసింది. 'మతులెన్ని చెప్పినా'లో నాకసలు పెళ్ళే వద్దు అంటున్న మధుమతిని పెళ్ళికి ఒప్పుకొనేటట్లు చేయటానికి, పెళ్ళాం పిల్లలున్న తమ్ముడికి ఎయిరుపెట్టిన అక్కమాట కాదనలేక వచ్చిన తమ్ముడు, చేసిన ప్రయత్న ఫలితం మామయ్యను తప్ప మరొకర్ని చేసుకోననే మధుమతి నిర్ణయం. 'చంద్రకాంత'లో సౌందర్యవతి, గుణవతి, ధనవతి అయిన చంద్రకాంత, వచ్చిన పెళ్ళి సంబంధాలకు వంకలుపెట్టి చివరకు సంగీతం మాష్టారును పెళ్ళాడుతాననటం వింత ప్రకృతి. ఈ కథలలో వాస్తవికత ఎలా వున్నా, యువతుల మనస్తత్వం మాట ఎలా ఉన్నా, రచనలు చదివి పుస్తకం దూరంగా వుంచి, పరిశీలిస్తే ఆలోచించటానికి వీటిలో అనంతంగా అవకాశం.

జగత్తు అంతా ఏక కుటుంబంగా, జనమంతా ఒక తల్లి పిల్లలుగా భావించటంలో ఆనందం, ప్రవర్తించటంలో పరమానందం, పరమార్థం వున్నాయి. ఏ పాపాయిని చూచినా, నా పాపాయితో సమానం అనుకోగలిగిన మనస్తత్వం విశిష్టమయింది. 'పెళ్ళి కావాలి'లో సుజాత, పావనిని అలాగే చూచుకొంది. తను తల్లి అయింతర్వాత చూడలేకపోయింది. ఇంతకు పైమెట్టు 'తప్పటడుగు'. పిల్లలు కలగకముందు భర్త అధ్యాపకుడుగా బడి పిల్లలలో తన సంతోషం నిక్షిప్తం చేసుకొంటే, భార్య నర్సుగా వార్డులో పిల్లలలో ప్రేమ దాచుకొంది. తమకు కొడుకు పుట్టాక, భార్యాభర్తలు ఆయా బాలబాలికలకే కాదు, ఉద్యోగ ధర్మానికి కూడ దూరం అయిపోయారు. పుట్టిన బిడ్డ గిట్టడంతో మళ్ళి ఆ పిల్లలతో ఆత్మానుబంధం పెంచుకోసాగారు. ఈ కథలో రచయిత, సార్వజనీనమయిన సత్యసందర్శనం చేసి, మానవతావాదం, ప్రేమమయ జీవితంలో కారుణ్య ప్రవృత్తిలో, సర్వసృష్టి

తమ సంతతిగా భావించటంతో ప్రత్యక్షీకరించుకోవాలని ఇచ్చిన తీర్పు ఉదాత్త మయింది.

సంతానం కలగకపోతే తల్లడిల్లిపోవటం ఉచితమే! ఎంతకీ పిల్లలు కలగక పోతే ఏదో విధంగా తల్లితండ్రులు కావాలనే తాపత్రయంతో పిల్లల్ని దత్తత తీసుకోవటం లోకంలో వింతకాదు. సత్తిన కొరివి పెడతాడనుకొని, దత్తత తీసుకొన్న కొడుకు సత్తిన కొరివి పెట్టవలసివస్తే, అందుకు కొంతవరకు తనదే బాధ్యత అయితే, తండ్రి పొందే వ్యథకు నిదర్శనం 'పున్నామ నరకం'. నిత్యం రంపపు కోతకు గురై, బలైపోయిన కూతుర్ని తలచుకొంటూ కుమిలిపోయే భార్యాభర్తలు, తమ కూతురు స్థానంలో ఒక అనాథను నిలుపుకోవటం మాన వత్వం. 'వినిపించని స్వరాలు'లో వినిపించే స్వరం ఎలుగెత్తి చాటే సత్యం మానవత్వం. శ్రీ శాస్త్రిని మానవతావాదిగా ఆంధ్రులు గుర్తిస్తారు.

'వలపులో మలుపు' చదివిం తర్వాత ఓ హెన్రీ కథ ది గిఫ్ట్ ఆఫ్ మాగీ గుర్తుకు వస్తుంది. శ్రీ శాస్త్రి కథలో ఆ కథ కంటే మార్పువున్నా, పై కథ ప్రభావం వుందనక తప్పదు. ఓ హెన్రీ కథలో ఉన్నంత గంభీరత, ముగింపులో ఉన్న పటిష్ఠత ఈ కథలో లేవు.

బస్సులు జాతీయం చేయటంవల్ల కలిగే లాభనష్టాలు చెప్పలేదు గానీ, జాతీయం చేయకపోతే కలుగుతున్న కష్టనష్టాలు 'తలపులో మలుపు'లో వాస్త వికంగా చిత్రిత మయ్యాయి. సమకాలీన సమాజ సమస్యలపై రచనలు వెలువడు తున్నాయి గానీ, ఇటువంటి వస్తువు ఏ కొద్దిమందో స్వీకరిస్తారు. శ్రీ శాస్త్రి కథా నిర్వహణ సంతృప్తికరంగా వుంది.

తెలుగువాళ్ళపై మామ్మల ప్రభావం అంతో ఇంతో వుంటుంది. మామ్మలు లేనియిళ్ళు అరుదుగా వుంటాయి. ఈ పరిస్థితి దేశంలోని ఆర్థిక స్వాతంత్ర్యం లేమికీ, సంస్కారయుతమైన ఐకమత్యానికి నిదర్శనం. క్రొత్తగా పెళ్ళయిన వారిపై మామ్మ ప్రభావం, 'మామ్మ'లో చూడవచ్చు.

'ఆఖరికోరిక', 'ఎప్పుడూ ఇంతే'- అనుభూతులు ఇలా జరిగితే బాగుండేదు అనే నిరాశకూ, ఇలా జరిగితే బాగుండేది అనే ఆశకు పై కథలు ఆత్మలు. అంత నిరాశా పనికిరాదు. అంత ఆశా ఆరోగ్యకరంకాదు. ఈ రెండు కథలలో ప్రదర్శితమైన భావాలు సంఘానికి శ్రేయస్కరం కావు.

భారత రామాయణాలలోనేకాదు, అసలు ప్రాచీన భారతీయ సంప్రదాయం బోధించేదె, సోదరప్రేమలోని విశిష్టత. నేటి సమాజానికి అత్యంతావశ్యకమయింది కూడా ఈ సోదరతత్వమే. అందరూ అన్నదమ్ములలాగా అన్యోన్యంగా వుండటం జాతి పురోగతికి అత్యవసరం! భార్యల ప్రేరణతో విడిపోయిన అన్నదమ్ములు పూర్ణ హృదయాంతో, మమతానుబంధాంతో ఏకం కావటం చెప్పే కథ 'అన్నదమ్ములు'

వస్తు వైవిధ్యం మాట ఎలా ఉన్నా, సంపుటాలుగా కథలు ప్రచురించేటప్పుడు, ఈ కథ, ఈ కథలతో చేర్చవచ్చునా లేదా అనేది, రచయితలు ప్రధానంగా ఆలోచించుకోవలసిన విషయం. ఈ సంపుటాలలో 'ఆత్మ స్వరూపం' పూర్తి కల్పన, 'ఎల్లోరా సుందరి', యౌవనపు పూహ', 'అంతరార్థం', మౌఢ్యం పై అర్థం లేని విరుగుబాటు; చేరటంవల్ల విశిష్టత, గౌరవం ఏమీ రావు. చేరకపోతేనే బాగుండేది.

'ఆడపిల్ల', 'పిచ్చివాడు' శ్రీ శాస్త్రిని భారతీయ సాహిత్యంలోనే కాదు, విశ్వ సాహిత్యంలో నిలపగల అర్హతలో వున్నాయి. ఇవి మా కథలు అని తెలుగువారు, రాష్ట్రేతరంగా, దేశేతరంగా చెప్పుకొనే కథలలో ఈ రెండూ ఛేర్చుకోవచ్చు. ఈ రెండు కథలలో కనిపించే మనస్తత్వంతోపాటు, అది ప్రదర్శించిన సామాజిక జీవితం ఉన్నతమయింది. ఆంధ్రుల జీవితాన్ని ఈ రెండు కథలూ చిత్రించాయి. ఆడపిల్లలో మాతృ హృదయం చక్కగా రూపొందింది. అందుకే ఆ కథకు సార్వజనీనమూ, సార్వకాలికమూ అయిన స్థానం లభ్యమవుతుంది.

కథానికలలో కథా కథనం ఎంత ముఖ్యమో, అంత ముఖ్యం ప్రారంభో పసంహారాలు. సాధారణంగా ఈ సంపుటాం కథంలో ప్రారంభ పటిష్ఠత అంతగా లేకపోయినా, ముగింపులు శక్తిమంతంగా వున్నాయి. ముగింపు బలం వల్ల కథలో మెరుపు వస్తుంది. కథా స్థాయి పెరుగుతుంది.

కథను చెప్పటంలో శ్రీ శాస్త్రికి ఒక ప్రత్యేకత వుంది. కథను పూర్తిగా చదివించే నేర్పు ఉంది. పాఠకులు ఉత్సుకతతో కథంన్నీ చదువుతారు.

భావ వ్యక్తీకరణకుగానీ, స్వభావ నిరూపణకుగానీ, కథను ఎత్తుక నన్ని వేశంలో పరిసమాప్తికి గానీ, పాత్ర మనోగత భావ ప్రదర్శనకుగానీ, ఆకార విశేష బోధకు గానీ రచయిత ఎక్కువ పదాలు వాడలేదు. తక్కువ పదాంతో విపులార్థం చెప్పగల సామర్థ్యం రచయితకు వుంది.

మానవతావాద ప్రభావం చేత, సామాజిక జీవితం రచనలో చూపించటం వల్ల, కథా కథనం, వస్తు గౌరవం, శైలి విధానం వల్ల శ్రీ శాస్త్రి కథలు తెలుగు దేశంలో నిలుస్తాయి.

# 7. భానుమతీ రామకృష్ణ అత్తగారి కథలు

1. ప్రఖ్యాత సినీతార శ్రీమతి భానుమతీ రామకృష్ణ ప్రాయగా, లరావమి ఈ 'అత్తగారి కథల'కు బహుమతి ఇచ్చింది. ఈ సంపుటిలో ఆరుమ్పెక్క కథలున్నాయి. అవన్నీ అత్తగారి అమాయకతను గూర్చే! ఇందులో అత్తగారు, కోడలు, కొడుకు, మనవడు ముఖ్య పాత్రలు. వాళ్ళిద్దరు భార్యలు. నరసింహ, అతని భార్య, వంటవాడు, మళయాళం కుర్రాడు ఇత్యాది అంత ముఖ్య పాత్రలు కావు. విధవలు, డ్రైవర్లు, చాకలి లెక్కతో కాకపోయినా, ఆవకాయ, గేదె, ఆంబోతు, అరటికాయ, పాడి వంటి పాత్రలు ఉన్నాయి.

అత్తగారు అమాయకురాలు. ఆచారం, చాదస్తం వున్న మనిషి. ఆమెకు 'నిమ్మకాయెంతో ఆవకాయెంతో', 'ఆవెంతో గేదెంతో'. రెండు కథల్లో ఆమె లావుగా వుంటుందని వర్ణన. అన్ని బొమ్మల్లోనూ ఆమె సన్నగా వుంది. ముక్కు పొడవు ఎక్కువయింది. శ్రీ కొడవటిగంటి చెప్పినట్లు ఆమె ముక్కుకోలత (3-డి) పాత్ర. రెండు చోట్ల చెప్పినట్లుగా ఆమె అంత వయస్సులోనూ అన్నం తనే వండుకొని ఎవరూ చూడకుండా తింటుంది. ఆమెకు ఆవకాయ పెట్టటం తెలియదు. (కోడలికి తెలియదు.) గేదెను పెంచటం తెలియదు. (డిటో కోడలు.) ఆమెకు వంట చేతకాదు. (కోడలు సంగతి చెప్పేపనిలేదు.) ఒక్క మాటలో చెప్పాలంటే అత్తగారి చాదస్తంమీద అవహేళన ఈ కథలు.

అత్తగారి కొడుకూ, కోడలూ నవనాగరికులు. వాళ్ళు ఒకేసారి భోజనానికి కూర్చుంటారు. కొడుకు ఉదయమే ఆఫీసుకు పోతాడు. (ఏం ఆఫీసో తెలియదు.) తరచుగా ఢిల్లీ వెళుతుంటాడు (ఎందుకో తెలియదు.) భార్యాభర్తలు [illegible] విమానంలో బొంబాయి నుంచి వస్తుంటారు. వాళ్ళకు పెద్ద బంగళా వుంది.

తిరుపతి పోవాలంటే కారులోనే వెళుతూ వుంటారు. వాళ్ళకు వెంకటసామి, మురగన్ సామి అనే డ్రైవర్లున్నారు.

అధునాతన నాగరికతా ప్రభావంలో పెరుగుతున్న కుటుంబంలో ప్రాచీన సాంప్రదాయానుగుణంగా, ఆచారానుసారంగా జీవించేది అత్తగారు. ఆమె ఆ యింటి ఓనరు రాణిలా అనిపిస్తుంది. అప్పుడప్పుడు ఆమె చేసే పనుల్ని కోడలు భూతద్దంలోంచి చూసి విసుక్కొస్తుంది. అయినా పాఠకుడికి సానుభూతి, జాలి కలుగవు.

అప్పుడు మనుమడు ఆటలు పట్టిస్తే పాఠకుడికి సరదాగా ఉంటుంది. నవ్వొస్తుంది. అత్తను కోడలు గుట్టుచప్పుడు కాకుండా, చుప్పనాతి లాగా ఎగతాళి చేయనూ వచ్చు. హాస్యంగా వుండనూ వచ్చు. కానీ అమ్మను ఎంత అమాయక మైందైనా కొడుకు అవహేళన చేయటం,అమ్మగానీ,పతివ్రలోకంగానీ సహించడం కష్టమే!

ఈ అత్తగారికి చాలామంది అత్తగారలతో, ఒక్క అమాయకత విషయ పోలిక వుంది. అమాయిక పుత్ర మమకారం, అమాయకంగా కోడలిమీద విరుచుకుపడటం, - అమాయకత తప్పు, తదన్యం ఎరుగక, హాస్యానికి పరిమిత మయినంతవరకు, అత్తగారు సజీవ పాత్ర. ఆమె అలవాట్లు బీదవి. ఉన్నస్థితి గొప్పది. కొడుకును ఆ దశకు తెసుకువచ్చిన భర్తృ విహీన అయిన తల్లి గొప్పదే కావాలి. తెలివితేటలుండి తీరాలి. లేకపోతే కోడల్ని రాచిరంపాన పెట్టాలి. అత్తగారికి ఏమిలేవు.

అత్తగారికి నోరుంటే కోడలికి ఆరళ్ళు, కోడలికి నేర్పుంటే అత్తమీద నేరారోపణలు తెలుగునాట రివాజు. అత్త అమాయకంగా ఆరళ్ళు పెట్టటం, కోడలు నేర్పుగా భర్తను మంచిచేసుకోవటం ఈ కథల్లో ప్రత్యక్షంగా అవగాహన అవుతుంది. తల్లి దయ్యంకాదు, అనిష్టమయిన వ్యక్తి. పెళ్ళాం బెల్లం కాదు. ఇష్ట మయిన వ్యక్తి ఈ విషయంలో కథలు వాస్తవికతను సంతరించుకొన్నాయి.

కథల్లో కనిపించే అత్తగారు, శ్రీమతి భానుమతీ రామకృష్ణ అత్తగారేమో అనే శంకతో ఆ విషయం పృచ్ఛించిన శ్రీ పి. వి. రాజమన్నారుతో, రచయిత్రి కాదని చెప్పటం జరిగిందట. అయితే గమనిక. ఈ కథల సంపుటిని రచయిత్రి అత్తగారికి, మామగారికి అంకితం చేసింది!

రచయిత్రి అత్తగారి పాత్ర చిత్రణలో వాస్తవానికి దూరంగా పోలేదు. కానీ వాస్తవికతకు పట్టిన రంగులు, మెరుగులు అధికమైపోయాయి. అలంకారాలు బాగానే వున్నా వాస్తవికత మరుగున పడింది. సరసులు అడ్డుతెర తొలగించి వాస్తవికతను దర్శించాలి.

ఈ సంపుటిలో ప్రధానం హాస్యం. అత్తగారి ఆకార వికారాల వల్ల హాస్యం వుంది. సంభాషణలో పదాలు, వాక్యాలు, విరుపుల్లో, కలయికల్లో హాస్యం వుంది. ఆమె మంచి పనులు అనుకొంటూ చేసే పిచ్చి పనులవల్ల (ఆవకాయ తయారీ, పంచెల ప్రహసనం, వంట సామానుల రవాణా) హాస్యం వస్తుంది. ఆమె అవక తవకలు చేసి పరాభవం పొందితే, సానుభూతి లేకపోయినా పాఠకుడికి నవ్వు వస్తుంది. బాధపడుతున్న పాత్ర స్థితి చూచి, పాఠకుడి కళ్ళవెంట నీళ్ళు, సంఘటనల్లో వున్న బలం వల్ల నవ్వు, ఏకకాలంలో తెప్పించగలిగిన రచన ఉత్తమ హాస్య రచన. అత్తగారు, పంచెలు పోయాయని చాకలిని హింస పెట్టినచోట, తిరుపతిలో నట్టింట నేలమీద కూర్చున్న చోట, జాలీ, నవ్వూ రేఖా మాత్రంగా కలుగుతాయి. అయినా అవి రస స్థితి పొందలేదు. హాసం హాస్య స్థితి పొందాలంటే బలవత్తరమైన కథ బిగువుగా సాగుతూ పాత్ర సృష్టి సడలి పోకుండా వుండాలి.

వస్త్వైక్యం, స్థలైక్యం, కాలైక్యం పరిధులు అతిక్రమించటం చేత రచనలు ప్రసిద్ధ కథా విధానం కంటే భిన్నంగా వున్నాయి. రచనల ముగింపులు చక్కని కథల ముగింపులాగా వున్నాయి. 'అత్తగారు-ఆవకాయ', 'అత్తా తోడికోడళ్ళయం' 'అత్తగారూ-అచ్చు తప్పులూ', అనేక కథా భాగాల్లో పూడుకొన్న రచనలు.

'అత్తగారూ-ఆచారాలూ', ఉపన్యాస సంపుటి వంటి రచన. 'అత్తగారూ-ఉపాసు యాత్ర' కథా శిల్పం గుర్తించిన రచన. అత్తగారుకానీ, కోడలుకానీ కథం గుండెల్లో నిలువలేదు. ఈ కథల సంపుటి స్వీయకథగా కానీ, అత్తగారి ఆత్మకథగా కానీ లేకపోవటం విశిష్టతే! సంఘటనల బలం కంటే అక్షరాల బలం అధికం కావటం ప్రత్యేకతే!

రచయిత్రి కథలన్నీ ఉత్తమ పురుషలో చెప్పినా, సాధించిన ప్రయోజనం వ్యగ్రమే! హృదయం ఉనికి తెరమరుగున వున్నాయి. కోడలు, ఆమె అస్తిత్వం వ్యక్తం కాలేదు. సంబంధం లేని పాత్ర చెప్పినట్లుగా వుంది. ప్రథమ పురుషలో కథ చదితే వచ్చే ఫలితం ఉత్తమ పురుషలో చెప్పినపుడు వచ్చింది. ఆ కోడలి స్థితి ఎలా ఉన్నా ప్రతి కథలో, వాక్యంలో, పదంలో శ్రీమతి భానుమతీ రామకృష్ణ అత్తగానో, కోడలుగానో, నిండు రూపంతో హాస్యధోరణిలో కనిపిస్తుంది. విని పిస్తుంది. ఆమె వ్యక్తిత్వపు ముద్ర వల్లనే ఈ కథల సంపుటి ఇంతగా కాంతి మంతమైంది.

కానీ, శ్రీమతి భానుమతీ రామకృష్ణ 'అత్తగారి కథలు' చదివే వాళ్ళకు శ్రీ మునిమాణిక్యం నరసింహారావు 'కాంతం కథలు' గుర్తుకు వస్తాయి. రెండిం టిలో ప్రధానం హాస్యం. అత్తగారిని అవహేళన చేస్తూ కోడలు, హాస్యం కలి గించాలనుకొన్న రచనలు, అత్తగారి కథలు; భార్యను ఉడికింప జేస్తూ, భర్త శృంగారాత్మక హాస్యం పలిగించిన రచనలు 'కాంతం కథలు'. ఈ రెండింటిలో 'కాంతం కథలు' ఆదిరచన; 'అత్తగారి కథలు' అనంతరం రచన. రసజ్ఞులు ఈ రెండు రచనలు పోల్చిచూసుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

2. శ్రీ మునిమాణిక్యం నరసింహారావు సృష్టి 'కాంతం'తో శ్రీమతి భానుమతీ రామకృష్ణ సృష్టి 'అత్తగారు'ను 'రసజ్ఞులు పోల్చి చూసుకోవలసిన అవసరం ఎంతైనా వుందని' ఈ సమీక్ష కర్త అత్తగారి కథలు మొదటి సంపుటి, ఆంధ్ర పత్రికలో సమీక్షిస్తూ చేసిన సూచన సోదర సమీక్షకులు ఇతరేతర

పత్రికలలో ఆ అభిప్రాయం బలపర్చటం, ప్రకాశకులు స్వీకరించటం ముదావహం.

ఈ రెండవ సంపుటిలో ఈ 'అత్తగారు' మన కథా సాహిత్యంలోని 'కాంతం, గిరీశం, బుచ్చమ్మ వగైరా పాత్రలవలె మరపురాని పాత్ర' అని ప్రకాశకులు ప్రకటన! ప్రకాశకులు 'మా మాట'లో ఎన్ని 'మహా'లు వాడారో చూచిన తర్వాత- మహా పాత్ర అనటం మాట వరుసకు మాత్రమేనని సహృదయులు గమనిస్తారు.

'అత్తగారు' 'కాంతం' వంటి పాత్ర అని అంగీకరించటం ఔన్నత్యానికి నిదర్శనమే అయినా, అత్తగారు పాత్రను గిరీశం, బుచ్చమ్మలతో పోల్చటం అత్తగారు పాత్రకు అపచారం. అంతే కాదు, 'కాంతం' పాత్రకు మహాపచారం. 'కాంతం' 'అత్తగారు' బహు కోణాలనుంచి దర్శింపబడి, చిత్రితమైన పాత్రలు. 'కాంతం', 'అత్తగారు'ల విస్తృతి గిరీశం, బుచ్చమ్మలకు లేదు. ఈ పాత్రలతో పోల్చటంవల్ల, 'అత్తగారు' కంటే శ్రీమతి భానుమతీ రామకృష్ణకు చేసే అన్యాయం ఎక్కువ. రచయిత్రికి అత్యధిక గౌరవం ఇవ్వాలంటే 'కాంతం'లాగా 'ఎంకి'లాగా 'అత్తగారు' కలకాలం నిలిచే పాత్ర అనవచ్చు.

'కాంతం'ను భార్యగా శ్రీ మునిమాణిక్యం నరసింహారావు కలం చిత్రించింది. 'అత్తగారు'ను అత్తగారుగా శ్రీమతి భానుమతీ రామకృష్ణ కలం తిలకించింది. ఒక తెలుగు వ్యక్తిని పై ఇద్దరు రెండు దశలలో చిత్రించారు. అలా చిత్రించే తీరు తెన్నులు చూపిన వ్యక్తి, శ్రీ మునిమాణిక్యం నరసింహారావు. ఆ తెలుగు స్త్రీని బాల్య దశలో, యవ్వనదశలో పరిశీలించి, ఊహించి మరో వ్యక్తి చిత్రించవచ్చు. ఆ చిత్రించటం కూడా శ్రీమతి భానుమతీ రామకృష్ణ 'కాంతం' అడుగుజాడల్లో 'అత్తగారు'ను చిత్రించిన నేర్పుతో చిత్రిస్తే అప్పుడా మూడు పాత్రలు కలిసి ఒక తెలుగు వ్యక్తి సంపూర్ణ జీవితం చూపుతాయి. ఆ మూడు పాత్రల-ఏకీకృత రూపాన్ని చూచి సహృదయులు ఇది ఒక మహా పాత్ర అనుకొంటారు గాని, శ్రీమతి భానుమతీ రామకృష్ణ చిత్రించిన 'అత్తగారు' మహాపాత్ర

అనుకోరు. 'కాంతం'ను అనుకరించి 'అత్తగారు'ను సృష్టించిన కీర్తి శ్రీమతి భానుమతీ రామకృష్ణకు లభ్యమవుతుంది.

రచయిత్రికి తన పాత్రలపై సానుభూతి అత్యవసరం. ఏ రచయితకయినా తన పాత్రం మీద సానుభూతి లేకపోవటం, తన బిడ్డలమీద ప్రేమ లేకపోవటంతో సమానం. పాత్రను దయనీయావస్థలోవుంచి, పఠితృలోకాన్ని సంతోషించమని, తనూ సంతోషించటం దారుణం. ఆ స్థితిని పాఠకులు 'పర్సనాలిటీ'తో చూస్తారు. ఆ కథలో వాస్తవికతలేదు. 'అంతకు తగ్గ బొంత' ఎక్కడయినా దొరుకుతుంది. వాస్తవికత లేని హాస్యం నాలుగు కాలాలు నిలువదు.

అన్ని కథలకు అత్తగారు పేరు జోడించే పద్ధతి 'పర్సనాలిటీ'లో మారి పోయింది. 'అత్తగారు - పర్సనాలిటీ' అని కథ పేరు అయితే, ఆదెక్కడి అత్తగారి పర్సనాలిటీ అని పాఠకులు అనుకొంటారో అని రచయిత్రి సందేహం అయితే, 'అత్తిగారూ-కూర్మావతారం' కథలో అత్తిగారిది కూర్మావతారం అని పాఠకులు అనుకొనే అవకాశం వుందని రచయిత్రి భావించకపోవటం విచిత్రమే! రచయిత్రి మళ్ళా ఆలోచించుగాక! పర్సనాలిటీ అంటే శారీరకంగానే అనే రచయిత్రి భావం, వ్యుత్పత్తి విహీనతను తెలుపుతుంది.

'అత్తిగారూ - నరసమ్మాయణం'లో అత్తగారి వ్యక్తిత్వం కంటే నరసమ్మ అలవాటు ముదిరిన పాకంలో నడచిన కథ బాగుంది. ఎన్నో ఏళ్ళుగా వంటపని చేస్తున్న వాడికి బాదం కీరు చేయటం తెలియదనటం హాస్యం కోసం కాకపోతే అబద్ధం.

మొదటి సంపుటిలో లాగానే, ఈ సంపుటిలోను అత్తగారు చేసిన ఎన్నో పనుల్లో నవ్వులు ఎన్నో బాగా నవ్వుకోవచ్చు; ఈ సంపుటి అంతా చాలా వరకు నవ్వులాటగా వుంది. పాఠకులు వాస్తవికత దృష్టితో ఈ కథలు చదివినా ఈ సంఘటనలో వాస్తవం ఎంతవరకు అని ఆలోచించి హాస్యం కోల్పోతారు. హాస్య సిద్ధి కోసం వాస్తవిక దృక్పథం చంపుకోవాలి.

'అత్తగారూ - కూర్మావతారం', 'అత్తగారూ - లంకెబిందెలూ' మినహాయించితే మిగిలిన రచనలు రచనలు మాత్రమే-కథలు కావు. హాస్య రచనలు. నవ్వించే రచనలు, నవ్వుల పాలయ్యే రచనలు.

పై రెండు రచనలు కొంతవరకు అసహజంగా వున్నా, హాస్యం, సహజంగా తొంగిచూసే పద్ధతికి కొంత వులుముడు అధికమే అయినా కథాశిల్పం దృష్టితో చక్కని రచనలు. ఈ కథానికలవల్ల రచయిత్రి సాహితీ జీవితం కాంతిమంతమవుతుంది.

ఆంధ్రులకు హాస్యప్రియత్వం అధికం అన్న సంగతి జగత్తెరిగిన సత్యం. ఈ రచనలోని హాస్యం చూచి ఆనందిస్తున్నా రాంధ్రులు అని తెలిస్తే హాస్యం కంటే రచయిత్రి అపహాస్యం చదివేనని తెలుస్తుంది.

రచయిత్రి స్వీకరించిన వస్తు గౌరవంచేత హాస్యరూపం దాల్చే అవకాశం లేకపోలేదు. ఆ పాత్రలపట్ల సానుభూతి కోల్పోయిన హాస్య దృష్టి పాఠకులకు తగ్గిపోదు. పాత్ర గత హాస్యస్థితి చక్కగా పోషించుకొంటూ రచన చేస్తే చక్కని హాస్య రచనలు తయారవుతాయి; కానీ అంత జాగ్రత్త రచయిత్రి వహించటం లేదన్నది ఈ కథలు చదివాక పాఠకులు తెలుసుకొంటారు.

హాస్యోత్పత్తికి రచయిత్రి సృష్టించే హంగులు కొన్ని పాత్రలు. ఆ పాత్రల వైపు చూడకుండా అనాలోచితంగా నవ్వుకోవటమే మిగులుతుంది. మొదటి సంపుటిలో 'అత్తగారు' రెండో సంపుటిలో 'అత్తగారు' అన్ని విధాలా ఒకే విధంగా వున్నట్లు కనిపించినా, నిజంగా 'మొదటి' అత్తగారు ఉన్నంత అందంగా, ఆనందంగా, 'రెండో' అత్తగారు లేదు. వైవిధ్యమూ, తిరోగమనంలో వుంది. అయితే కథా కథనం, శిల్పదృష్టిలో, ఈ సంపుటిది పురోగమనమే!

అత్తగారు జీవితం చాలా పరిమితమయింది. కొడుకు, కోడలు, మనవడూ, ఇంట్లో పనివాళ్ళూ, వాళ్ళ సరసాలు, ఇంటికి వచ్చిపోయే జనం-ఇంతమాత్రమే ఆమెకు తెలిసిన లోకం. కాకపోతే బాల్యంలో తెలిసిన 'ఉడ్డుదొర' లాంటి ఏకొద్ది మందో తప్ప, ఇతర ప్రపంచ మామెకందుబాటులో ఉండదు. అత్తగారు పరిధి నతిక్రమించకుండా రచన చేయటంపట్ల రచయిత్రి కృషి సఫలమయింది.

రచయిత్రి ఏనాడయినా అత్తగారిని, కనీసం ఢిల్లీదాకా తీసుకుపోయి, తిరిగి తీసుకువస్తే ఈ మధ్యలో అత్తగారు అల్లుకుపోయే కథలు కోకొల్లలు. ఈ సూచన రచయిత్రి పాటిస్తే వైవిధ్యం తయారవుతుంది. క్రొత్త విధంగా కథలు వచ్చే అవకాశం వుంది. పాఠకులు అత్తగారు కథలలో వైవిధ్యం కోసం ఎదురు చూస్తున్నారు.

# 8. మధురాంతకం రాజారాం కథలు

1. కారణభూతుడు పుస్తకంలోని కారణభూతుడు, మరీచికలు నవలికలని ప్రచురణ కర్తల అభిప్రాయం. అవి నవలికలు కావు. పెద్ద కథలు.

కథారచయితగా శ్రీ మధురాంతకం రాజారాంను గూర్చి పాఠకులకు పరిచయం చేయవలసిన అవసరం లేదు. అనేక పత్రికలలో అనేక కథలు - ఈ రచయితవి ముద్రితాలు. ప్రస్తుతం కథలు వ్రాసే పాతికమందిలో శ్రీ మధురాంతకం రాజారాం ప్రముఖస్థానం గూర్చి సందేహం లేదు.

రచయితల జీవితాలు అన్నీ ఆదర్శప్రేరితాలు కావు. అన్నీ ఆత్మహింసకు అంగీకరింపవు. తిన్నగా పెరిగిపోవలసిన మొక్క వంగిపోతే పిలకలు వందలు వేలు!

అయితే రచయిత జీవితం సాఫీగా సాగిపోతే ఏమవుతుంది? సమాధానం: ఏమయినా అవుతుంది. పాళీ పదును తెలుసుకోవాలని తలచేవ్యక్తి అవశ్యం పరిశీలించి అర్థం చేసుకోదగిన రచన 'కారణభూతుడు'.

దేశం మీద దేశం పగబూనితే ఫలితం యుద్ధం, సమర్థుడికి సమాజం మీద క్రోధం ప్రబలితే యుద్ధం, అసమర్థుడికి ద్వేషం - అంతర్యుద్ధం. యుద్ధం ఆత్మలో, యుద్ధం సంఘంలో.

కొన్నియుద్ధాలలో మంటలు సెగలు, పొగలు, రక్తపాతం, ప్రాణనష్టం! కొన్ని యుద్ధాలలో విరోధాలు, తగాదాలు, స్నేహితుల మధ్య తలెత్తుతాయి. 'కారణభూతుడు' ఒక పట్టణంలో భయంకర వాతావరణం కల్పించటానికి కారణభూతుడు. అతనలా కావటానికి ఎవరు కారణభూతులు? ఆ సమాజం, అటువంటి సమాజాలు!

అయినా రచయితలకు హృదయం ఉందంటారు. రచయితలు హృదయ హీనులంటారు. సంఘసంస్కర్తలు అంటారు. అటువంటి రచయితలు, ఇటువంటి పనులు చేయగలరా? చేయగలరు. అందుకు నిదర్శనంగా పఠింపవలసిన పెద్ద కథ 'కారణభూతుడు'.

నాగరికత అంటే ఏమిటి? ఈ ప్రశ్న ఉన్నదికాదు - ఈనాటిదికాదు. శ్రీ మధురాంతకం రాజారాం ఈ ప్రశ్న వేసుకొని సమాధానం చెప్పాలని చేసిన ప్రయత్నం 'మరీచిక'.

భారతదేశం వ్యావసాయిక దేశం. ఈ దేశంలోని నగరాలు ముఖ్యంగా పారిశ్రామిక నగరాలు. ఇప్పుడు పల్లెలు వ్యవసాయానికి, నగరాలు పరిశ్రమలకు ఆటపట్టులని స్థూలంగా చెప్పవచ్చు.

నగరంలో ఉన్నదంతా నాగరికతా? కాదు. పల్లెల్లో ఉన్నదంతా అనాగరికతా? కాదు. ఏది నాగరికతో తెలియక జీవితం కంటక ప్రాయంగా చేసుకొన్న స్త్రీ శోభ. ఏది నాగరికతో కించిన్మాత్రంగా తెలిసికూడా జీవిత వాంఛాపూర్తి చేసుకోని వ్యక్తి ప్రకాశం. ఇది సంధి సమయం. ఇటువంటి అవ్యవస్థ తప్పదు.

వ్యవసాయంపై జీవించే కుటుంబం గూర్చి చెప్పిన రచయిత, పరిశ్రమలపై జీవించే కుటుంబంగూర్చి కూడా విపులంగా చెప్పివుంటే రచన ఇంకా రాణింపుకు వచ్చి వుండేది.

ప్రకాశం మామ కుటుంబం పరిశ్రమల ఫలితంగా చిత్రించి వుండవలసింది. పాఠకులు ప్రారంభంలో అలా ఆశించే అవకాశం, ఆ పాత్ర కారులు మార్చిన సూచన ఉన్నప్పుడు ఉంది.

ఏమయినా శోభ మీద పాఠకుల సానుభూతి సర్వం కేంద్రీకరింపబడుతుంది. ప్రకాశం జీవితం రాజీ పడినట్లే కనిపిస్తుంది కానీ విజయం సాధించినట్లు కాదు.

శ్రీ మధురాంతకం రాజారాం ఈ రెండు పెద్దకథలలో పల్లె వాతావరణం చిత్రించిన తీరు అభినందనార్హం. సమాజ చిత్రీకరణ సజీవంగా ఉంది. పాత్రల రూపు రేఖలు తీర్చి దిద్దే ప్రయత్నం ఈ రచయిత, ఇతర కథలలో ఉన్నంత తీవిగా ఈ రచనలలో ద్యోతకం అవుతుంది. పాత్రల బాహిర అంతర రూపాలు పాఠకులకు చక్కగా గోచరమవుతాయి.

కథను బిస్సగా, అడ్డమాటలు లేకుండా నడిపించటంలో రచయిత ప్రజ్ఞాశాలి. చక్కని ఫుట్‌బాల్ ఆటగాడు, నేర్పుగా గోల్‌దగ్గరకు బంతి తీసుకుపోయి, అనాయాసంగా గోల్ చేసినట్లు, ఈ రచయిత కథను ఉపసంహారాభిముఖంగా తీసుకుపోయి ముచ్చటగా ముగింపు సాధించటం, ఆ నేర్పుకు నిదర్శనం.

బలమున్న ఇతివృత్తం ఎన్నుకొని, చక్కని శైలిలో రచనలు చేయగల శ్రీ మధురాంతకం రాజారాం అనవసర విషయాలు తొలగిస్తే బాగుంటుంది. 'కారణభూతుడు' ఆరంభంలో ఉపోద్ఘాతంవంటిది అనవసరం. అంతేకాదు, 'పతిగారు' చేసిన ఉపన్యాసం అనవసరం. ఆ పాత్ర అనవసరం.

ఒక్క పనికోసం ఒక పాత్ర సృష్టించుకోవటం రచయిత ప్రాథమిక దశకు నిదర్శనం అవుతుంది. ఒక్క పల్లె వాతావరణం తెలియజేయటానికి ఒక పాత్రను అన్ని హంగులతో సృష్టించి, ఆపైన ఆ పాత్రను మరచిపోవటం రచనామర్యాద కాదు.

శోభ 'బర్త్‌డే' కార్యక్రమంలో దైర్ఘ్యం తగ్గించ వచ్చు. అక్కడ ఇతరేతర పాత్రల విపుల వర్ణనకూడా అనవసరమే. అనవసర పాత్రలు, వర్ణనలు, సంఘటనలు తొలగించుకొంటే, ఇంత సజీవంగా ఉన్న రచనలు తెలుగు సాహిత్యంలో అరుదు.

2. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడెమీ బహుమతి పొందిన కథల సంపుటి 'తాను వెలిగించిన దీపాలు', ఉత్తమ కథా సంకలనం 'కథా దీపం'. ఈ రచయిత కథలలోని ఇతివృత్తాలు తెలుగువారి సామాజిక జీవితం- ముఖ్యంగా పల్లె వాతవరణం ప్రతిబింబించేట్లుగా వుంటాయి.

అధ్యాపకుణ్ణి గూర్చిన కథ 'తాను వెలిగించిన దీపాలు. తాను వెలిగించిన దీపం పాఠకాలలోకాక, 'తుమ్మలకోన'లో చూచిన అధ్యాపకుడి ఆత్మానందం వ్యక్తంచేసే కథ. అధ్యాపక వృత్తిలో ఉన్న ఈ రచయిత ఆత్మ దర్శనానికి ఈ కథ నిదర్శనం.

రచయితను గూర్చిన కథ 'జారుడుమెట్లు'. సమకాలీన సాహిత్యంపై ఒక సమీక్ష వంటిది కథ. రచయిత అయిన శ్రీ రాజారాం నీలకంఠం పాత్రకు 'వాగ్దానం' చేసినట్లే పాఠకులు తలపోస్తారు.

నటుణ్ణి గూర్చిన కథ 'జగన్నాటకం'. నాటకం వేరు. జీవితం వేరు అని చెప్పే కథ. కళాదర్శనంలో రచయిత ప్రతిబింబం కనిపించేకథ. సులోచన దీన చరిత్ర హృదయం కదిలిస్తుంది.

'చీమలు పెట్టిన పుట్టలు' ఆర్థిక వ్యవస్థ మీద వ్యాఖ్యానం. చీమలు ఆర్జించి దాచిన గింజలు ఎలాగో వ్యర్థం అయిపోయినట్లే రంగధామయ్య ఆస్తి నాగరాజు పరమయింది. పోగుచేసేవాళ్లొకళ్లు విరజిమ్మేవాళ్లు మరొకళ్లు. ఆత్మీయుల రక్త సంబంధంవున్న వాళ్ళ మధ్య వచ్చే విపరీత పరిణామాలు సూక్ష్మంగా వ్యక్తం చేయబడ్డా యీ కథలో.

'చేదు నిజం' రచయిత పాత్రగా గల కథ. గాజులు ప్రధాన వస్తువు. కాల్పనికులు అయిన రచయితలు ఎలా వర్ణిస్తారో, వాస్తవ దృక్పథం కల రచయితలు ఎలా చిత్రిస్తారో తేడా చెప్పిన కథ. శ్రీ రాజారాం సమకాలీన కథా సాహిత్యంపై చేసిన విమర్శ రూపం.

'సర్కస్ డేరా' మానవత్వం ప్రతిష్ఠించే కథ. మనుష్యులు, పశువుల మధ్య వుండవలసిన దూరం గూర్చి ఆలోచింపండి. హృదయంలో బాధ సృష్టించే కథ.

'విధి విలాసం' కీడెంచిన వారికి మేలెంచుతుంది, క్షమించటం ఉత్తమ మానవ ధర్మం అన్న నీతి కనిపిస్తుంది. చంద్రమౌళి తనకు అపకారం (నిజంగా ఉపకారమే జరిగింది) చేసినవాడికి ఉపకారంచేసిన మనిషి.

'సబల' కష్టాల్లో కొట్టుకుపోతున్న విశాల తన బ్రతుకు కాలువలో కొట్టుకు పోకుండా చేసుకొని, కాపురం ఏర్పరచుకొన్న ధైర్యవంతురాలి సామర్థ్యం చెప్పే కథ.

వాస్తవికతలోనుంచి పుట్టిన కథ-కల్పనతో కూడుకొన్నా, ఆనందం కలిగిస్తుంది. సహజతను స్థాపిస్తుంది. ఆ కోవ కథలు (తాను వెలిగించిన దీపాలు) 'సర్కస్ డేరా' మొదలైనవి.

కల్పనలో నుంచి పుట్టిన కథలు - ఎంత వాస్తవికతను పులుంకొనే ప్రయత్నం చేసినా ఎందుకో అసహజంగా వుండటమే కాదు, సానుభూతిని సంపాదించుకోలేవు. 'విధివిలాసం', 'జగన్నాటకం' అలాంటి రచనలు.

నూటికొక్కడు రచయిత అయితే, ఆ భాషా రాష్ట్రంలో చాలా మంది రచయితలున్నట్లు. అటువంటి వాళ్ళలో పదిమంది కొక్కడు నీలకంఠం వంటి వాళ్ళు వుంటే గొప్ప రచయితలు కొద్ది మంది వున్నట్లే, ఆ గొప్ప రచయితల్లో వందమంది కొక్కడు అటువంటి పని చేయ గలుగుతాడు. 'జారుడు మెట్లు' కథలోని బీదతనం కాదు కానీ, నీలకంఠం స్వీకరించిన పద్ధతి అందరూకాదు-ఏ కొందరోకాదు, ఏ ఒక్కరో ఇద్దరో స్వీకరిస్తారు. నీలకంఠం పద్ధతి పలాయన వాదం ప్రచారం చేస్తుంది. మిగతా కథ అంతటిలో ఎంత వాస్తవికత కనిపించినా, అది కల్పనలో నుంచి పుట్టుకు వచ్చిందే! తప్పలేదు. అయితే, నీలకంఠం చేసేన పని ఎందరు చేయగలరు? ఇది ప్రశ్నే! నివృత్తి నిరపేక్షితం.

'విధివిలాసం', 'సబల' ముగింపు ముచ్చట తప్ప కథారచనలో శిఖర ప్రాయంగా చెప్పటం ఏమీ కుదరదు. 'చీమలు పెట్టిన పుట్టలు' - సమాజ జీవితం చూపుతుంది.

శ్రీ మధురాంతకం రాజారాం కథలు పల్లె జీవితంలోని మాధుర్యానికి మారు పేరులు, ఆడంబరంలేని రచన, ఆత్మీయత వున్న వస్తువు, జీవితం ప్రతిబింబించే తీరు ఈ రచయిత ఆస్తులు, కథను ఆసక్తికరంగా నడిపించటం, ముగింపు ముచ్చటగా చేయటం, కథన నైపుణ్యం, శైలి, సౌందర్యం పుణికి పుచ్చుకొన్న శిల్పసిద్ధి వున్న కథానికా నిర్మాత శ్రీ మధురాంతకం రాజారాం.

# 9. రంధి సోమరాజు సాహిత్యం

అధిక ప్రచారం లేకపోయినా, ఆవేదన, ఆత్మస్పర్శ, అక్షరరూపం పొందిన సాహిత్య నిర్మాత శ్రీ రంధి సోమరాజు. శ్రీ రాజు సాహిత్యం నవలా, కథానికా, కవిత్వ, నాటక ప్రాంగణాలలో విలసిల్లినా, కథలు, కవిత్వం, పాఠకుల్ని బాగా అలరించాయి. సహృదయ సన్మానం పొందాయి. కథానికా రచయితగా, కవిగా శ్రీ రంధి సోమరాజు ఆత్మదీప్తి అందించగల రచనలు 'సోమరాజు కథలు' 'విరిగిన కల్చర్'. సామాజికంగా రావాలనికోరే అభ్యుదయం, పరిణామం, చైతన్యం; మనుష్యుల్లో పోవాలని తలంచే దైన్యం, హైన్యం, నైచ్యం; పీడితులలో, తాడితులలో రావాలని కాంక్షించే ఆనందం, అనురాగం ఔన్నత్యం; ఈ సాహిత్యం ప్రదర్శిస్తూ వుంది.

1. శ్రీ రంధి సోమరాజు కథలలో ఆదర్శం వుంది. ఆ ఆదర్శం తత్త్వబోధం, కథాత్మలోనో, కథా పథకంలోనో, సంభాషణలోనో, ధ్వనిగా, వినిపిస్తూనో బాహాటంగా కనిపిస్తూనో ఉంది. కథలు చదివి ఆ ఆదర్శం పాఠకులు పోల్చుకొంటారు. ఒక్కొక్కచోట ఆదర్శం శ్రుతిమించి రాగాన పడుతుంది. అయినా, కథలు వ్రాయటం కోసమే వ్రాసేవారికంటే ఒక ఆదర్శం కోసం కథానికా రచనకు పూనుకొన్న రచయిత రచనా జీవితం ధన్యమయ్యింది.

'వారి కలం ఎవ్వరినీ చిన్నచూపు చూడదు.' ఇది పుస్తకం చివరి అట్ట మీద రచయిత పరిచయంలో కనిపించే వాక్యం. పతితులను, దరిద్రనారాయణులను, దీనజనులను, కుమిలి కృశించిపోయేవాళ్ళని రచయిత చిన్నచూపు చూడలేదు. సంఘాన్ని, అధికారులను, ధనవంతులను; రచయిత సంపూర్ణ సానుభూతితో చూడలేదు. తను చిత్రిస్తున్న పాత్రను గానీ, పాత్రలను మినహాయించి,

మిగతా పాత్రలలో అల్పంగా కనిపించే దోషం, దుష్టతలను, భూతద్దంలోంచి చూచి, చిత్రించటం గమనించి, ఎవరూ, 'వారి కలం ఎవ్వరినీ చిన్నచూపు చూడదు' అన్న వాక్యంతో ఏకీభవించలేరు. అయితే పీడితులూ, తాడితులూ, శ్రమ జీవులు - అమాయకులు వీళ్ళని జాగ్రత్తగా పెంచిపెద్ది చక్కని కథలు అందించిన శ్రీ రంధి సోమరాజు కలం ఎవ్వరినీ చిన్నచూపు చూడలేదు అంటే హర్షదంగా సత్యం. ఒక్కటి గమనార్హంగా వుంది. దుర్మార్గతనూ, సన్మార్గతనూ రెండు కోణాలలో విపరీతంగా పెంచి, అల్ప లోపంగా వున్నవాటిని అధిక తరంగా చూడటం పాఠకులు గమనిస్తారు.

మధుసూదనరావు పాత్రలో వున్న స్వార్థం అర్థంచేసేదే అయినా పరిమిత మయింది. ఆ పాత్రలో బూర్జువా తత్త్వం ప్రవేశపెట్టి, అతని దుష్టతను ఇంత లింతలు పెంచి, అసంతంగా చిత్రించటం; ఎంత అమానుషంగా ప్రవర్తించే వ్యక్తి అయినా సొంత తమ్ముడి విషయంలో అలా చేశాడని చిత్రించటం; లేడీ రామారావు చేసిన తప్పు పనిని సావిత్రి సమర్థించటం; ఆ సావిత్రి అకారణంగా శశిపై నింద మోపటం; శంకరం కోరిక సహజమే అయినప్పుడు, అతను అనవస రంగా ఆత్మ శాంతి కోల్పోయే పరిస్థితులు ఎదుర్కొని పశ్చాత్తాప పడటం; శశి చంద్రహారం తీసుకుపోయి తాకట్టు పెట్టుకొని, తిరిగి ఇవ్వకుండా మొరా యించిన లక్ష్మీదేవి చేసిన పనికి కారణం సానుభూతితో ఆలోచించకపోవటం; గయిరమ్మకు రిక్షావాళ్ళు చేసిన అపకారాలలో ప్రథమం సహజమే అయినా, ద్వితీయం క్రూరంగా చిత్రించటం; గమనించిన పాఠకులు 'రచయిత కలం ఎవరినీ చిన్నచూపు చూడదు' అన్న వాక్యంతో ఏకీభవించరు.

ఒక వర్గం కోసం చేసిన మంచిపనులు, చెడ్డపనులు అన్నీ మంచి పనులుగా చూచినా, మరో వర్గం చేసే సత్కృత్యాలు, దుష్కృత్యాలు అన్నీ దుష్కార్యాలుగా చూచినా రచయిత కలం చిన్నచూపు చూసినట్లే అవుతుంది. సిద్ధాంత రీతిలో 'వర్గపోరాటం' అక్షరాలా నమ్మినా, లోకశాస్త్రకావ్యాపవేక్షణంలో వర్గదృష్టి

ఉండకూడదు. నమ్మిన సిద్ధాంతం కంటే బలమయింది చూస్తున్న జగత్తు. జగత్తు లోని పరిణామాలు నిర్ణయించటానికి సిద్ధాంతాలు ఆరాధ్యాలు కావచ్చు కానీ, సిద్ధాంతాలు స్వీకరించి, ఆ దృష్టితో లోకంవైపు దృష్టి మళ్ళించకూడదు. ఒక భావ తీవ్రతకు కట్టుబడిన వ్యక్తి కార్యకర్తగా ప్రవర్తించ వలసిన తీరుకంటే రచయితగా జీవించవలసిన పద్ధతి భిన్నమయింది.

రచయిత సత్యం తెలపించాలి. లోకం పరిపూర్ణంగా అర్థం చేసుకోవాలి. ఉన్న సంఘం ఉన్నట్లుగా స్వీకరించాలి. రచనలో సమాజం యథాతథంగా చిత్రింపబడాలి. రచయితే ఒక సిద్ధాంతానికి కట్టుబడిన కార్యకర్త మనస్తత్వంగల వ్యక్తి అయితే, వర్గదృష్టి వుంటే ఉండవచ్చు కాని, కార్యకర్తకంటే రచయిత సంఘ శ్రేయస్కామి. శ్రీ రంథ సోమరాజు రచయితగా జీవించాలని పాఠకులు కోరుకొంటారు. అంతేకాదు. రచనలో కార్యకర్త మనస్తత్వం లేకుండా వుంటే బాగుండునని కూడా ఆశిస్తారు.

బాధలతో పీడితుడయి, తాడితులయి పతనోన్ముఖంగా వున్నవాళ్ళు, నిరాశా నిస్పృహల మధ్య నలిగిపోతున్నవాళ్ళు, దారిద్ర్యంతో సతమతమయి, అంతులేని వ్యధ పొందేవాళ్ళు, చాలామంది ఈ కథలలో ప్రత్యక్షమవుతారు.

తాను పొందే మానసిక క్షోభకు, గోదావరి అలాలపై మమకారానికీ కారణం తెలుసుకోలేని జగన్నాథం; తాను ఎందుకింత అసమర్థుడయ్యాడో; పంజరంలో చిక్కుకొన్న చిలుకలా ఎందుకు వెలుపలకు రాలేని వాడయ్యాడో తెలుసుకోలేని పిరికివాడయిన నారాయణరావు; గుండెకు రంధ్రం పడి, ఆనకట్ట తెగిన గోదావరిలా బాధమయరక్తం కారిపోతున్నా, అంతా తనమంచికే అని తలపోసి అభివృద్ధిలోకి వచ్చినా, తన ఉనికి ఉన్నతత్వం తెలియని రాము; ఎవరికీ ఎదురు చెప్పలేక, ప్రత్యల్ప విషయానికీ పరితపించి పోతూ, చివరికి మానధనాలు ప్రశ్నింపబడితే పలవించిన శశి; నమ్మినధర్మం నలుగురికీ చెప్పలేక బాధపడి, చెప్పినప్పుడు కూడా ఋజువు చేసుకోలేక క్షోభతో భవిష్యదాశతో ప్రాణం

అర్పించిన నీలా; తన పరిధిలో తను నివసిస్తూ సహజ వాంఛను అసహ్య పరిస్థితులలో ఎదురుదెబ్బతిని, పుండు మీద కారం చల్లినట్లు, కుమిలిపోయిన శంకరం; ఇష్టంవున్న సూర్యంతో పెళ్ళికాక, ఇష్టంలేని పెళ్ళిచేసుకొని, పిసుళ్ళ దిబ్బయి, రెంటికీ చెడ్డ ఐంహీనురాలు సుమతి; కొడుకును మంచిమార్గంలో పెట్టు కోవాలని తాపత్రయపడి, కన్నకొడుకునే దూరంచేసుకొన్న మోహనరావు; భర్త చనిపోగా, పిల్లన్ని పోషించుకోవటానికి వెతుక్కొన్న ధర్మమార్గంలో అకాలం కారణంగా ఎదురైన వెతలు తట్టుకోలేక చితికిపోయిన గయిరమ్మ; వీళ్ళందరినీ చూస్తున్న పాఠకులు, వాళ్ళ చిక్కుకుపోయిన విషాదం కూడా చూస్తారు. పాఠ కులు బాధపడతారు. శ్రీ రంధి సోమరాజు కరుణామయ పాత్ర సృష్టిచేసి పాఠ కులకు అనుభూతి కలిగించటం, సానుభూతి పొందటం ముదావహం.

అన్ని రసాలలోనూ ఆధిక్యం 'కరుణ'కు ప్రసాదించారు కొందరు ప్రాచీన సంస్కృతాలంకారికులు. ఆ దృష్టితో చూస్తే కథలన్నీ కరుణాత్మకమైనవే! అలంకారిక సంప్రదాయ బద్ధమయిన ఈ కథలు అందరినీ ఆకర్షిస్తాయి.

సమాజంలోని మనిషి మనిషికీ భౌతికంగా ఎంత సాన్నిహిత్యం ఉందో, మానసికంగా అంత దూరం వుంది. మనిషిలోని లోపాలు సానుభూతితో స్వీక రించి, పాత్ర సృష్టి చేయటం రచయిత ఉదాత్త మనస్తత్వానికి నిదర్శనం. సీతమ్మతో ఉన్న సంకుచితత్వం వెనుక దాగి వున్న పుత్ర ప్రేమను రచయిత చక్కగా అర్థం చేసుకోవటం పాఠకులు గమనిస్తారు.

దారిద్ర్యం పట్ల సహనత ప్రదర్శించి, పతనం కాకుండా పైకి వచ్చేట్టు రాము పాత్ర తీర్చిదిద్దటంలో, కట్టుకొన్న భర్తను వదలి, పరాయి మగాడితో లేచి పోబోయి, అకారణంగా మనస్సు మార్చుకొని, మళ్ళీ భర్త దగ్గరకు రావాలని లేడీ రామారావు చేసిన ప్రయత్నం నిండు గుండెతో అంగీకరించి రచించటంలో; పెళ్ళి చేసుకోబోయే యువకుడితో అక్రమ సంబంధం వున్నా దోషం కాదనే కాఫేరి

పాత్ర సృష్టించటంలో: సిగరెట్లు తాగి చెడి పోతున్నాడని అనుకోబడుతున్న కొడుకుతో తండ్రి మోహనరావు ప్రవర్తించే పద్ధతిలో; రచయిత హృదయతత్వం వ్యక్తమవుతుంది. తన పాత్రలపై రచయితకు సానుభూతి; జాలి ఉన్నాయి. కొన్ని భావాల పట్ల విశాల దృక్పథం, కొన్ని పాత్రల విషయంలో విశాల మన స్తత్వం ప్రదర్శింపగల రచయిత, తన కిష్టం లేని పాత్రల పట్ల సంయమనం, ఓర్పు ప్రదర్శింపలేదు.

ఎక్కువ కథలలో పాత్రలలో రచయిత రెండు వైపులు చూడ లేదు. ఒక వైపే చూచి చిత్రించినా, చూచిన భాగం రచన శుద్ధంగా వుంది. సమాజ జీవిత చిత్రణ చేయటంలో రచయితకు నేర్పు వుంది. ఆ నేర్పు ద్వివిధంగా విభక్తం కాలేదు. ఏకమార్గాన సాగింది. ప్రక్కమార్గం పరికింప బడలేదు. ఈ రచయిత పైన కమ్యూనిజం ప్రభావం వుంది. కొన్ని వాక్యాలు ప్రచార ధోరణి లోనూ కనిపిస్తాయి. పరిమితంగా దర్శించిన జీవితం చిత్రించటంలో అవాస్త వికత లేదు. జీవితంలోంచి ఛేదించుకు వచ్చిన సహజతను అల్లుకుపోయిన కవి తాత్మకత ప్రతి కథలోనూ ప్రత్యక్షమవుతుంది.

సంభాషణలు వ్రాయటంలో రచయితకు ప్రత్యేకత వుంది. ఒకమాట అనుకొని, మరొకమాట అనే వ్యక్తులమధ్య సంభాషణ కోసం పాఠకులు తహ తహ చూపవచ్చు. అనుకొన్న మాట అనుకొన్నట్లు అనలేని, అనని; చేయదలచిన పని తలచినట్లు చేయలేని, చేయని; వ్యక్తుల మానసిక తత్వ చిత్రీకరణంలో రచ యిత చూపిన నేర్పు అభినందార్హం.

కథకు ముగింపు ప్రాణంతో సమానం. కథ అంతా చక్కగా వున్నా, ముగింపు ముచ్చటగా లేకపోతే కథ ఆయువు పట్టు దెబ్బ తిన్నట్లు అవుతుంది. మనస్సు మీద కథవేసే ముద్ర ముఖ్యంగా ముగింపుమీద ఆధారపడివుంటుంది. ఈ సంపుటిలోని కథానికల ప్రారంభ ప్రస్తావన లేదుగానీ, పర్యవసాన ప్రసక్తి వుంది. సంపుటి ఆద్యంతాలలో కథల ముగింపులు ఆలోచన రేకెత్తిస్తాయి.

'బలహీనులు' ముగింపు కథనంతా మళ్ళీ చదివిస్తుంది. కథ అంతా ఒకెత్తు. ముగింపు ఒకెత్తు. కథంతా ఒక పాత్రను గూర్చి చెబితే, ముగింపులోని మూడు మాటలు మరో పాత్రను గూర్చి చెప్పాయి. తరువాత ఏమయిందో ఆలోచింప జేస్తుందీ ముగింపు. 'బలహీనులు' కథ ముగింపు పాఠకుల్ని ఆలోచింపచేసే అని ధైర్యంగా చెప్పే ముగింపు. ఓ హెన్రీ కథను ఎలా ముగించాలని అభిప్రాయ పడ్డాడో, అలా ఉన్నాయి కథానికలు. ఒక్క ముగింపు కోసం, తదభిముఖంగా కథ అంతా, అన్ని పాత్రలు, సంఘటనలు సాగిపోతాయి. ముగింపు ఏర్పాటు చేసుకొని కథా నిర్మాణం చేస్తే ఎలాంటి రచనలు వెలువడుతాయో ఉదాహరణకు, ఈ రచనలు చూడవచ్చు. నేర్పైన వాక్య నిర్మాణంలో రచయితకు శక్తి వుంది. వర్ణనలు కవితాత్మకంగా వున్నాయి. అందంగా వాక్యం వ్రాయటం, చక్కగా భావ వ్యక్తీకరణ చేయటం ఈ రచయితకు బాగా తెలుసు. రచయితకు ఆవేశం వుంది. బాధ వుంది. లోకంలోని దుష్టత చూచి రచయిత పొందిన వ్యథ, ఆత్మ మోష ప్రతి కథలోనూ ప్రత్యక్షమవుతాయి. ఈ సంపుటిలోని కథలు అనేక కారణాలవల్ల, మరపురానివిగా ఉండిపోతాయి. ఆంధ్ర సాహిత్యంలోని అత్యుత్తమ కథలు ఎన్నుకో ప్రయత్నించే విమర్శకులు 'దేవుడైన మానవుడు', 'ఎదగని మనుష్యులు' స్వీకరించటానికి వెనుకాడక పోవచ్చు.

పదేళ్ళ పూర్వం కథా వ్యాసంగంలో ఉన్నవారికీ, పాఠకులకు శ్రీ రంధి సోమరాజు 'తెలుగు స్వతంత్ర' మూలంగా బాగా పరిచయం. ఈ సంపుటిలో ఉన్న కథలు, అప్పుడు చదివి ఆనందించినవాళ్ళు, ఇప్పుడు ఈ రూపంలో చదివి, ఆనందింపలేకపోవటానికి కారణం, అప్పటి కథలు సంక్షిప్తంగా హృదయంలో నిలిచిపోయే రూపంలో వున్నాయి. ఇప్పుడా కథలు సంకోచం లేకుండా వ్యాకోచించాయి. ఈ కథలలో పనికిరాని పేరాలు, పేజీలు కోకొల్లలు. అంతగా ఎందుకు పెంచవలసి వచ్చిందో అర్థం కాదు.

2. కథానికా సాహిత్యంలో వ్యక్తమయిన రచయిత హృదయమే కవితా రూపం సంతరించుకొంటుంది. కథానికా శిల్పం కవిత మీద, కవితాభివ్యక్తి కథానికా

రచన మీద ప్రభావం చూపించాయి. కవిత కథానికా రూపం పొందటం, కథానికా భాష కవితాత్మకంగా ఉండటం గుర్తింపవలసిన అంశాలు.

'విరిగిన కల్చర్'ను గూర్చి ఆలోచిస్తే రెండు అర్థాలు స్ఫురింపవచ్చు. గతాగతాలకు మధ్య పంటెనపంటి కల్చర్ మధ్యకు విరిగిపోవటం ఒకటి. శ్రీ పురిపండా అప్పలస్వామి 'ఇటు వినండి'లో చెప్పినట్లు పాలు విరగడం మరొకటి. మొదటి అర్థంలో వున్న విరిగిన వస్తువు రెండుగా కానీ అంతకంటే అధికంగా కాని అయి, విరిగిన భాగాలు ఆ రూపంలో ఆ విధంగా కాకపోయినా, ఏ విధంగానైనా ఉపయోగపడే అవకాశముంది. రెండో అర్థంలో విరిగిన పాలు, బాహిరంగా, దూరంగా మార్పుతో కనబడే అవకాశం లేదు. బాహిరంగా సమీపంగా పాంలో వచ్చిన మార్పు కనిపించవచ్చు. అంతరంగా చక్కగా అవగాహన అవుతుంది. పాలు విరిగితే నిరుపయోగం. కవితా సంకలనంలో చెప్పిన కల్చర్ నిరుపయోగంగా పాలులాగా విరిగిపోయిందా? ఆ కల్చర్ వస్తువులులాగా విరిగి మళ్ళీ ఉపయోగపడే అవకాశం కలిగి వుందా? ఈ ప్రశ్నలకు సమాధానం కవి భావతీవ్రతపై గానీ, పాఠకుల నిరాశా, నిస్పృహలపై గానీ ఆధారపడి వుంటుంది. ఎవరికివారే సమాధానం చెప్పుకోవాలి. కవి దృష్టిలో క్షీణించిపోతున్న, అధునాతన జీవిత విధానంతో నాశనమవుతున్న మన సంఘం ఒక విరిగిన కల్చర్.

ఈ కవితా సంకలనంలో అక్షరాల వెనుక, భావతీవ్రత మాటున కవి ఆత్మ ఘోషిస్తూ వుంది. అది కవిని ఆదర్శవాదిగా, ప్రగతిశీలిగా చూపిస్తుంది. నేటి సమాజం చుట్టూ రంధ్రాలు పడ్డాయి. కల్చర్ ధారపడి, దొర్లిపోయి మురికి గుంటల్లో చేరుతూవుంది. కాళీపాత్ర మిగిలిపోయింది. ఆధేయం పోయింది. ఆధారం మిగిలింది. ఆ పాత్ర అన్ని హంగులతో పూర్వశోభను చూపించాలని తాపత్రయపడి గుండెనిండా రంధ్రాలతో కుమిలిపోతూవుంది. ఇది సమాజం.

ఇది బాగు పడాలి, ఈ మార్పు రావాలి, ఒక శుభోదయం కలగాలి అని సుదూర భవిష్యత్తు మీద ఆశ పెట్టుకొని జీవించే కవి ఆవేదనలో, ఆక్రోశంలో,

ఆత్మసంస్పందనలో ఉదయించిన 'వెలుగు రేఖలు' విరిగిన కల్చర్‌లోని కవితా శీర్షికలు.

'దుష్కార్యాల దస్తరుతో సత్కార్యాలు చెరిపేసి
గోనెసంచి దోపిడీలతో రాబడి తప్పుడు నిల్వపెంచి
ఆఫీసరు గోప్యం పెట్టిదానిని దానాగా వేసి,
పాలు పిండుకొంటూ,
మంత్రి యంత్రాలకు నేయి అయిలుగా పోసి'
సంతోషించే జన సందోహం సందడి తిలకించి కళ్ళ వెంట నీళ్ళు వచ్చి

'తిరుగుడు మిల్లులోని బెల్టు తెగిపోయి,
చక్రాలు పటపట ఆగిపోయినట్లు పండ్లు కొరికి,
క్రౌర్యం తుపాకిని తీక్ష్ణంగా ప్రేల్చి,
చలించే పెదవుల మీది మాట' విని అర్థం కాని మూగ వేదనతో సాగుతున్న సమయంలో "ఏ రాత్రి రాణికి అన్యాయం బొట్టు పెట్టకుండా, కోరికల ప్రహరి చుట్టూ వున్న గోడలు పగలగొట్టకుండా, నిజంగా ఎదిగిపోయిన మహా మానవుణ్ణి చూచి" సంతృప్తి పడబోతుంటే,

'దుశ్శీలుడైన ఊహాతీత విచిత్ర చిత్రకారుని
సృజనాత్మలా
పాపాత్ముడైన మహాకవిలోని అత్యద్భుత కవితా శక్తిలా'

ఉన్న సంఘం కనిపించింది. దాని చుట్టూ అల్లి బిల్లిగా అల్లుకు పోయిన కల్చర్ తీగ వాడిపోతూ వుంది.

రిఫ్రిజిరేటర్ శరీరాల చెడిపోని దివ్య సౌందర్యాలు, విస్కీ సీసాల రెక్కల మీద రెక్కలు, వాడని డబ్బు పూల జీవన వృక్షాల పెరళ్ళు, శాంతిని ఎడారిలో పాతిపెట్టిడాలు, భూమిపై శీర్ష స్తన ద్వయంలా వ్రేలాడే పేదతనం, ఆకాశహర్మ్యా

సూర్యుడికి ఉండవలసినంత దూరంలో ఉండలేక మాడిపోయే బ్రతుకులు, నీడనిచ్చే చెట్టుకు నీడకావాలని రెక్కల్లు దంచే పెద్దలు, ఒంటి స్తంభం మేడ మీద, ఆశయాల పావురం మీద కురుస్తున్న అర్ధాకలి రాళ్ళ వర్షం, డాలర్ పాలతిత్తి అందక రోదిస్తున్న ప్రణాళికా కూనలు, అంతాచూసి అద్వైవిధ్యం తారతమ్యం అర్థంకాక వెర్రెత్తిన బాధతో, విపరీత పీడిత మనస్వియై, దిగులుతో కులిమిపోయే కవి వైపు నీళ్ళు నిండిన కళ్ళతో చూడడం తప్ప, చేయగలిగిందేమీ కన్పించదు.

ఈ సమాజపు పునాది మీద లేవవలసిన చక్కని సంస్కృతి మందిరం పూర్ణరూపంతో తయారు కాలేదు. కవి మోషలో సర్వ సమాజ విమర్శనంలో దాగిన సత్యం ఒక్కటి! ఇది-ఈ సమాజం-ఇలా కాదు ఉండవలసింది. ఇంకో మాదిరిగా ఉండాలి. మరో విధంగా తయారయి ఉండవలసింది. అయితే ఆ విధంగా తయారుకాలేదు. అయితే ఏ విధంగా తయారుకావాలో, అందుకు ఏమి అవరోధం వచ్చిందో కవి ఆలోచనలో ఈ విధంగా వుంది: 'సరిహద్దు గోడల దగ్గర చైనా పందికొక్కు కమ్యూనిజానికి వెలుగు లేకుండా చేసింది'. ఆ దశ, ఆ పరిణామం, ఈ దేశానికి రాదని తలంచిం తర్వాత కవి ఏం చేయాలో తెలియక, ఈ వేళ ప్రస్తుత పరిస్థితిని చూచి,

'ఆకలితో చచ్చిపోయే
సిసలైన మనిషికో నమస్కారం
ఆ త్యాగమూర్తికి
చేయనక్కర్లేదే పూజా పురస్కారం'

అని దిగులు వెళ్ళగ్రక్కుకొని వ్యథతో తృప్తి చెందింది కవ్యాత్మ.

కేపిటలిస్టు సమాజంలో పదిమంది ఒక్కడికోసం పనిచేసి లాభాలు అందించినట్టు, మన ఆఫీసుల్లో పదిమంది పనిచేసి ఒక్క ఆఫీసరు అధికారానికి, ఆధిపత్యానికి, అదుపాజ్ఞలకు లొంగిపోవటం, అండదండలకు ఆశ్రయానికి ప్రాకులాడటం, బాహాటంగా కవి నిరసించటం కనిపిస్తుంది కావ్యంలో.

'ప్రమోషను వరాలనిచ్చిన ఆఫీసరు పూవు' ఎదురైతే 'చర్మంలేని గుమస్తా భావాల అవిరుద్ధ హాహాకారాల సారం' రుచి చూడవలసిందే. అంతేకాదు 'గుమస్తా అవస్థ' అనే శీర్షిక ఆఫీసరు - గుమస్తాల సంకుల సమరంలో చక్కని గీతం.

శ్రీ రంధి సోమరాజుపై, భావాలలోనూ కవితా ధోరణిలోనూ, శ్రీశ్రీ ప్రభావం బాగా కనిపిస్తుంది. ఈ సంపుటిలోని "నేనెరుగుదును'' శ్రీశ్రీని గుర్తుకు తెస్తుంది. శ్రీశ్రీలాగే శ్రీ రంధి సోమరాజు కార్మికుల, కర్షకుల బాధలు తలపోసి 'మీ కష్టానికి వాచీ లేదని' గ్రహించటం గమనింపవచ్చు.

'నిప్పులు చిమ్ముకొంటు
నింగికి నే నెగిరిపోతే
నిబిడాశ్చర్యంలో వీరు,
నెత్తురు కక్కుకొంటు
నేలకు నే రాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరే!' - శ్రీశ్రీ పంక్తులను-

'నింగి నుండి భూమిపై
రాలిపడినా
నెత్తురు కక్కుకుంటూ
చచ్చిపోలేదు' శ్రీ రంధి సోమరాజు పంక్తులు గుర్తుకు తెస్తాయి.

ఈ కవికి పార్కు కనిపించిన తీరులో ఎంతో నిరాశ. సౌందర్య రాహిత్యంపట్ల ఏవగింపు.

'అదేమిటి—
పార్కు సుందరి
వంటినిండా
గజ్జిలా పేరుకనగ పొట్టు'

పత్రికలు మంచి కథల కోసం పోటీలు పెట్టి ప్రైజులిస్తున్న ధోరణిని చూచి—

'సిరా కక్కాల
కలరా కథల్ని
ప్రైజులుగా ఎన్నుకొని' అని నిట్టూర్పు.

ఇలా ఆధునిక జీవితం చుట్టూవున్న గతి తప్పిన స్థితిచూచి అక్కడక్కడా కవి ఆత్మస్పందన, విమర్శన 'విరిగిన కల్చర్'లో కనిపిస్తాయి.

ఈ సంపుటిలోని ఒక కవితా శీర్షికనే కావ్యమకుటంగా వుంచి, అందులో ఒక కుటుంబం ఆధునిక సంస్కృతి ఫలితంగా బాంధవ్యాలకూ, ఆత్మీయతకూ, సహజంగా వుండవలసిన సత్సంబంధాలకూ ఎలా దూరమయిపోయిందో, డబ్బు సమాజ జీవితంలో ఆత్మీయ వ్యక్తుల మధ్య ఎటువంటి మార్పు తెస్తుందో, హృదయాలు ఎలా కలుషితం చేస్తుందో చూపుతూ చేసిన రచన రసరమ్యంగా వుంది. చక్కని ప్రారంభోపసంహారాలతో, వ్యక్తుల భావ సంఘర్షణలో కవితా రీతిలో సాగిన చక్కని శిల్పసిద్ధి ఉన్న కవితా కథానిక 'విరిగిన కల్చర్'.

ఈ నవకవితా సంపుటిలోని గీతికలన్నీ వచనకవితలు. కొన్ని కవితలలో ఛందస్సు లేకపోయినా నడకలో సమత, తూగులున్నాయి. యతులు ఎలావున్నా, కొన్ని చాపులలో అన్త్యప్రాసలు అతికిపోయాయి.

భావ సాహసంగా వుంది. అలంకారాల వల్ల భాష సుందరంగా గోచరమయ్యే అవకాశము వుంది. ఆంగ్లాంధ్ర పదాలు వంగా పులగంగా కలిసిపోయాయి. ఎంత వ్యావహారికం వ్రాసినా కొన్ని పదప్రయోగాలు ఎబ్బెట్టుగా కనిపిస్తాయి. 'ఆస్థి' సంస్కృతీదీపం, అర్ధాకలి, ప్రణాళికాహూసలు' వంటి ప్రయోగాలు కొన్ని వున్నాయి. సంధిగత దోషాలూ ఉన్నాయి. అటువంటివి పరిహరించుకోవటం కవితాస్థాయికి అవసరం.

ఉద్వేగపూరిత భావాలు, ఉన్నతభావాలు, కవితాంతఃకరణం కదిలించే భావాలు, నీడల్లో కదిలే భావాలు, కొన్ని పటిష్ఠత లేకుండా, నీరసంగా వుంటే కవితౌన్నత్యం దిగజారే అవకాశం వుంది. అక్కడక్కడా అల్పంగా కనిపించే చిల్లరభావాలు, ఉదాత్త కవిత ప్రక్క చేర్చకుండా వుంటే బాగుంటుంది. ఈనాడు తెలుగులో వెలుపడుతున్న వచన కవితల్లో ఈ 'వింగిన్ కల్చర్' సముచితమైన స్థానం పొందుతుంది.

కథానికా రచయితగా, కవిగా శ్రీ రంధి సోమరాజు విప్లవాత్మకశక్తి. పరిణామం పరమార్థంగా, ప్రబోధం ప్రాణంగా, సాహిత్యం పరమాయుధంగా గ్రహించి సామాజిక వ్యత్యస్తాలమీద సమరం సాగించే దీక్షగల వ్యక్తికి జీవితం నిత్యనూతనం. కొత్తశక్తికి ఆలవాలం. శ్రీ సోమరాజు కాంక్షించే సామాజిక జీవితం సిద్ధిస్తే ఆంధ్రకి ఎంత అదృష్టం!

# 10. పిచ్చేశ్వరరావు సారస్వతం

విశాలాంధ్ర ప్రచురణాలయం ముద్రించి వుండకపోతే అట్లూరి పిచ్చేశ్వర రావు వినిర్మించిన సారస్వతం తెలుగు వాళ్ళకు లభించకపోయి వుండేది. జీవిక కోసం ఏ ఉద్యోగం చేసినా సాహితీ శక్తిమంతులు సారస్వత నిర్మాణ దీక్షా దక్షులు అవుతారన్న సత్యం ఈ మేధావిని చూస్తే తెలుస్తుంది. మంచి సాహిత్యం సృష్టించిన కొందరు వృద్ధులు కాకముందే గతించిపోవటం చూచి, వీళ్ళింకా బ్రతికి వుంటే మరెంత మంచి సాహిత్యం సృష్టించే వాళ్ళో అని దేశం ఆశపడటం అత్యాశకాదు. పిచ్చేశ్వరరావు జీవించి వుంటే ఎంతగొప్ప సాహితీ స్రష్ట అయ్యే వాడోకానీ, ఈ అందించిన సాహిత్యం గుణంలో అల్పంకాదు. వైవిధ్యంలో కొదవ లేదు. కథానికా వాఙ్మయం, నాటికా సాహిత్యం, వచన కవితలు, వ్యాసాలు, అనువాదాలు అనేకం చేసిన పిచ్చేశ్వరరావు ప్రాథమికంగా కమ్యూనిస్టు! వాస్తవంగా ఆలోచన పరుడు. పిచ్చేశ్వరరావు సృష్టించిన వాఙ్మయం సంప్రదాయానికి కొత్త అర్థం చెప్పింది, సామాజిక చైతన్యం ఆకాంక్షించింది, దేశ ప్రజా పరిణామం భావించింది, అభ్యుదయం వాంఛించింది. మనిషి ప్రలోభ సుఖమయ జీవితంవైపు చేసే ప్రయాణానికి దూరం కావాలని కోరుకొంది.

1. తెలుగు దేశంలో వచ్చే కథల్లో సాధారణంగా వుండే లక్ష్యం 'పిచ్చేశ్వరరావు కథలు' అన్నింటిలో అంతస్సూత్రంలాగా వుంది. ఏ కథకు ఆ కథ ఒక ఉత్తమ రచన కాకపోవచ్చు. కానీ, ఒక ఉత్తమ లక్ష్యం-రచయిత దృష్టిలో-ప్రేరేపించిన భావాలు రూపుదిద్దుకొన్నవీ కథలు.

ప్రతి కథా, పాఠకుంలో ఆలోచనను రేకెత్తించింది. అంతవరకు రచయిత లక్ష్యం సిద్ధిపొందినట్టే! ఈ కథలు చదవటానికి కొంత గుండెధైర్యం కావాలి. లేనివాళ్ళు ఈ పుస్తకం తాకనక్కరలేదు. కొంచెం అభ్యుదయం, కొంచెం

చైతన్యం గూర్చి ఏ రచన అయినా వుంటే, అదో కమ్యూనిష్టు సాహిత్యం అని బెదిరే తరహా పాఠకులు ఎవరైనావుంటే, ఈ పుస్తకం మరింత అభ్యుదయం, చైతన్యం పొదివిపుచ్చుకొన్నది కాబట్టి చెప్పడమయింది, జాగ్రత్త పడమని.

ఈ కథలలో వస్తువులు విభిన్నంగా ఉన్నాయి. 'నేవీ' సంగతులు, గ్రామ విషయాలు, స్త్రీ ఆంతర్యాలు, సంఘ చైతన్యం మొదలైన అనేక వస్తువులు కలిగిన కథలున్నాయి. 'డిక్' తనదేశం, అమెరికాను గూర్చి తిట్టటం, 'జీవచ్ఛవాలు'లో కథ; భారత స్వాతంత్ర్యం కోసం సర్వం త్యాగం చేసి, చివరికి చితికిన కుటుంబగాథ 'నెత్తురు కథ'; న్యాయం అభ్యుదయం కోసం ప్రయత్నించిన వాడు 'చిరంజీవి'; 'జెన్నీ' ఏ దేశపు స్త్రీ అయినా కావచ్చు, అన్ని దేశాలలో ఈ అధమాధమత్వం వుంది; స్వాతంత్ర్యం వచ్చిన భారతదేశంలో స్వాతంత్ర్యం హరించిన వ్యక్తులగాథ. 'ఆగస్టు 15న'; పొడిచే పొడిచే సూర్యుణ్ణి చూసినప్పుడల్లా గుర్తుకొచ్చే ప్రకాశరావు కథ 'పెరికామ వేదాంతం'. 'డొంకల వంకల మనుషులు' తప్ప సీతారామయ్యను ప్రజాసేవకుడని ఎవరంటారు? 'శాస్త్రి' దారిద్ర్యంలో పడివుంది అవాస్తవికతా రచన చేయడం వింతే; 'రక్షకుడు' - రైలులో వింత అనుభూతి; సుబ్బమ్మ సుబ్బారెడ్డిని యములోడు అనటంలో 'విముక్తి' వుంది; 'ఎదురీత', 'గడచిన దినాలు', 'తీరని కోరిక' కథలలో సర్వజనానికి ఒక ప్రశ్న అయిన స్త్రీకి కలిగిన ప్రశ్నలూ, పరిష్కారాలూ చెప్పీ చెప్పకుండా చెప్పే తీరు వుంది; 'బ్రతకడం తెలియనివాడు' అంటే అన్యాయాన్ని ఆది నుంచీ ఎదిరించి, చివరికి అసువులు బాసినవాడు; యుద్ధం ఎందుకు వచ్చిందో తెలుసుకోవటం కోసం యుద్ధం చేయబూనే ధోరణి 'ఒక అనుభవం'; ప్రాణాలకు తెగించి, అనేకుల ప్రాణాలు రక్షించి కాలు కోలుపోయిన 'నేవీ' ఉద్యోగికి, పెన్షన్ ఇచ్చే ఆఫీసరు చూపిన ఎడముఖంతో కనిపించింది, 'ఇదిప్పుడు మన దేశమే'; ఈ కథలు చదువుతూ పాఠకులు ఒక వింతలోకం దర్శిస్తారు.

'చిరంజీవి'కి పెళ్ళి కావాలని పుసలమ్మ 'కోరిన వరం'; అబద్ధాలు ఆడే వాళ్ళ క్లబ్బు కథ 'సబద్ధం'; ఒకప్పుడు ఊహలకు మరొక్కప్పటి వాస్తవానికి మధ్య మార్పు పొందిన రమణయ్య 'పరిచయం'; విందు దగ్గర ఉబుసుపోకకు పిచ్చి మాటలు మాట్లాడుకొనే సమాజం తీరు గూర్చిన కథ 'పులి మేక ఆట'; రచయిత విమర్శకుల మధ్య ఆంతర్యం పరిశీలించే కథ 'గర్భస్రావం'.

ఈ రచయితకు జీవితం చెప్పాలనే తపన వుంది. చెప్పే విషయం తీక్షణంగా, సూటిగా, గుండెల్లోకి చొచ్చుకు పోయేట్లు చెప్పటం తెలుసు. ప్రతి కథా పాఠకుణ్ణి అంతో ఇంతో, ఆలోచింప జేస్తుంది. వ్యక్తీకరణలో కవితా ధోరణి వుంది. సత్యం నగ్నంగా ప్రదర్శించటం ఈ తరహా రచయితలకు సామాన్య సంగతి.

అల్ప పదాలతో అనల్ప విషయం అందించటం, చిన్న రేఖతో పెద్ద బొమ్మను వాతావరణాన్ని కల్పించే చిత్రకారుడి సామర్థ్యం వంటిదీ రచయితకు వుంది. అది శ్రీ కొడవటిగంటి కుటుంబరావు కథల ప్రభావం కావచ్చు. 'కథ కుడిగా పిచ్చేశ్వరరావు' అని శ్రీ కొడవటిగంటి కుటుంబరావు వ్రాసిన పరిచయం పరిశీలింపదగింది.

'జీవచ్ఛవాలు' లో 'డిక్' అమెరికాను తిడతాడు. 'మనకు అమెరికా గూర్చి చాల తెలిసింది'-శ్రీ కొడవటిగంటి. డిక్ తాగిన మత్తులో మాట్లాడిన మాటలివి. అవి ఏ దేశానికైనా వర్తిస్తాయి. అలా మాట్లాడే వాళ్ళు ఏ దేశంలోనయినా వుంటారు. అందువల్ల అమెరికా న్యూనత గోచరంకాదు. మన దేశం గొప్పతనం ప్రతిపాదించుకోవాలంటే మరో దేశాన్ని కించపరిచే పని సభ్య సమాజంలో రచయితలు చేయరు. చేశారనుకోవటం ఆత్మనింద.

"గడచిన దినాలు"-ఒకప్పుడు, 'భర్తలు భార్యల పట్ల ఎంత పశువులుగా ప్రవర్తించే వారో తెలుపుతుంది' అని శ్రీ కొడవటిగంటి కుటుంబరావు అంటే అది నిజమని పాఠకులు అందరూ అనుకోలేరు. స్త్రీకీ, పురుషుడికీ మధ్య వుండే శృంగార

సంబంధంయొక్క శక్తి అనుకొంటారు కొందరు. 'విముక్తి', 'బ్రతకటం తెలియని వాడు' పిచ్చేశ్వరరావు వ్రాసిన వాటిలో ఉత్తమ కథలయితే 'నెత్తురు కథ', 'ఎమరీత' ఏమయిపోలాయి? అన్ని కథలూ అందరికీ నచ్చకపోవచ్చు, కొన్ని కథలు కొందరికె నచ్చవచ్చు. మొత్తం మీద కథలన్నీ ఎవరికో నచ్చేవే! ఎవరికి నచ్చని కథలు పిచ్చేశ్వరరావు వ్రాయలేదు.

కథల ద్వారా కథా రచయిత రూపం, స్వభావం, గుణగణాలు ఊహించుకోవటం ఒక పద్ధతి. రచయిత ప్రతి కథలోనూ పాఠకులకు ఎదురవటం సత్యం. రచయితను గూర్చి తెలిసివుండి కథలకు వ్యాఖ్యానం వ్రాయటం మరో పద్ధతి. ఈ చివరి పద్ధతి అంత శ్రేయస్కరంకాదు. వ్యక్తి గొప్పవాడు అయినా రచనలు గొప్పగా వుండకపోవచ్చు. వ్యక్తి సామాన్యుడయినా రచనలు గొప్పగా వుండవచ్చు. శ్రీ కొడవటిగంటి కుటుంబరావు పరిచయం చేసిన శ్రీ కీ॥ శే॥ పిచ్చేశ్వరరావు కంటే, పాఠకులు తమంతటతాము కథలు చదువుకొని, మనస్సులో చిత్రించుకొన్న రచయిత, కలకాలం ప్రజా హృదయంలో బ్రతికివుండవచ్చు. గొప్ప కథానికా సృష్టిచేసిన పిచ్చేశ్వరరావు వ్రాసిన నాటికలు కూడా వున్నాయి.

2. 'మనసులో మనిషి' సంకలనంలోని రేడియో నాటికలు ఏక పాత్ర వాక్చిత్రణలు. పిచ్చేశ్వరరావు ఎంతగా కథానికా రచయితో, అంతగా నాటికా నిర్మాతగా కనిపించకపోవటం వాటిని ప్రయోగానికి ఉద్దేశించకపోవటంలోనేఉంది. అయితే ఏ రచయిత అయినా సృష్టించిన రచనలు అన్నీ ఉత్తమమయినవిగా భావించటానికి అవకాశం తక్కువ కదా! పఠితృలోకానికి ఒక రచయితపై కల్గిన అభిప్రాయం, పోషింపగల రచనలు మాత్రమే సంపుటీకరించటం సమంజసం. ఇవి ప్రసారం కోసం ప్రత్యేకింపబడినట్లుగానే వున్నాయి. కాలక్షేపం కోసం చదువుకోవటానికి రచనలు బాగున్నాయి. రేడియోలో ప్రసారం చేయబడితే రుచింపవచ్చు. కష్టపడి ప్రదర్శిస్తే చూడటానికి తగినవి కావచ్చు. అయితే ఈ నాటికలలో, వాక్చిత్రణలలో నాటకీయత అత్యల్పం.

'నిగమశర్మ' 'వరూధిని' ఏకపాత్ర వాక్చిత్రణలు. ఈ రెండు పాత్ర లను గూర్చి ప్రసిద్ధ ప్రబంధాలు చదువుకొన్న పాఠకులు ఏర్పరచుకొన్న అభి ప్రాయంతో ఆట్లూరి పిచ్చేశ్వరరావు ఏర్పరచుకొన్న భావం భిన్నంగా వుండ వచ్చు. పెద్దన 'వరూధిని' కలిగించే ఆనందం ఈ వరూధిని కలిగించదు. అలాగే నిగమశర్మ. ప్రసిద్ధులు పరమార్థ రమణీయంగా చిత్రించిన పాత్రలను ఏ విధం గానూ సర్వజనామోదకరంగా ఆధునికులు మళ్ళీ సృష్టించలేరనటానికి పై రెండు వాక్చిత్రణలు సరయిన ఉదాహరణలు.

'గతాను గతాలు'లో అమ్మ లోకంలోని అమ్మే! శేఖర్ వంటి హృదయ వాదులుంటారా? ఉండవచ్చు! వేణులాంటి లౌకికులుంటారా? లేరనటం కష్టమే! స్వర్ణవంటి కన్య అంతగా బరితెగించి మాట్లాడుతుందా? పృథ్వి విశాలమయింది మరి. మాట్లాడితే మాట్లాడవచ్చు! సరే! లోకంలోని మనుష్యుల్నే పాత్రలుగా స్వీకరించి రచయిత సాధించిందేమిటి రచనతో? ఏం చెప్పదలచుకొన్నట్లు? పెళ్ళినిగూర్చి రెండు భిన్నాభిప్రాయాలు వ్యక్తంచేయటమే దృష్టి అయితే, అది నెరవేరింది. అంతకంటే చెప్పిందేమీలేదు. ఒక్కొక్క విషయాన్ని గూర్చి ఎంద రెందరో ఎన్నెన్నో అనుకొంటారు, అన్నీ ఈ విధంగా వ్రాయటం ప్రారంభిస్తే రచనకు అర్థం పర్థం లేకుండాపోయే ప్రమాదం వుంది.

అహింసను ప్రచారం చేసిన అనేకులు హింసకు గురి కావటం చరిత్ర చెప్పే సత్యం! క్రీస్తు, గాంధీ, లింకన్ ఇంకా ఎందరో! 'కుశీ నగరం'లో బుద్ధుడు, జంతుహింస, కూడదనే మానవతావాది మాంసం తిని ఆరోగ్యం పాడై, మరణించేముందు, మరణించింతర్వాత, చరిత్ర చాటిచెప్పిన అహింసా వాదనా రాధన గోచరమవుతుంది. స్థలమాహాత్మ్యం చెప్పటానికి తయారయిన ఈ నాటి కలో, ఆకాశవాణి ధ్యేయమయిన 'బహుజన హితాయ, బహుజన సుఖాయ' బాహాటంగా వినిపిస్తుంది. రేడియోలో వినిపించి వుంటుంది. ఒక తాత్త్విక సమన్వయం చేయటానికి అధిక శ్రమతో ఆవిర్భవించిన రేడియో నాటిక 'కుశీ నగరం.'

'ఎంత ప్రక్రియ' నిజంగా ఎంత ప్రక్రియ. మృత్యువును డబ్బుతో జయించాలని ప్రయత్నించే ధనుంజయరావు, మృత్యుంజయరావు కాకపోవటమే కాక, సుందరరావు మాట్లాడే తీరు, లీల లీలా వినోద వ్యవహారం, డాక్టరు కృషి, అన్నీ ఎంతగా వుంటాయి. ఇతివృత్తం, పాత్రలు, అంతా ఒక ఎంత ప్రక్రియ వైపు సాగిపోయేవే అయినా స్త్రీ పురుష సంబంధంలో ఒక నూత్నత దర్శించా లని కుతూహలపడ్డ నాటిక ఎంత ప్రక్రియ. 'గతానుగతాలు' లో స్వర్ణ ప్రౌఢ అయితే, ఎంత ప్రక్రియలో లీల అవుతుంది. సుందరరావు ప్రవర్తన సహ్యమో, అసహ్యమో స్పష్టంగా తేలదు. ధనుంజయరావు లీలల సంబంధం అంత స్పష్టంగా లీల ముఖతః చెప్పించటం ఉచితమో, అనుచితమో రచయిత ఆలోచింపలేదు.

ఈ సంపుటిలోని నాటికలలో 'మనిషిలో మనిషి' - అదే ఈ సంపుటి పేరు- ఉన్నంతలో ఉత్తమమయింది. స్త్రీ పురుషుల రాగద్వేషాల పారం పరికిం చాలని ప్రయత్నించిందీ నాటిక. శంకరం గుమాస్తా. కాంతారావు మిత్రుడు. కాంతారావు దూరదేశం నుంచి వచ్చాడు. శంకరం భార్యను చెల్లిగా భావించుకొని, సంతోషంగా సరదాగా వున్నాడు. ఆ సరదాను శంకరం అపార్థం చేసుకొన్నాడు. అందుకని శంకరం తన భార్య సరళను బావిలో పడి చావమన్నాడు. ఆమె చచ్చి పోయింది, అలాగే! భర్త చచ్చిపొమ్మన్నంత మాత్రాన ఎంత పతివ్రత అయినా చచ్చిపోతుందా ఈ కాలంలో? సరళ తప్పు చేయకపోతే, ఆమె మనసులో వున్న మనిషి కాంతారావులో కనిపించకపోతే, గుమస్తా శంకరం నుంచి కోరిన ఆనందం పొందలేక, ఇక పొందటం కూడా అసాధ్యం అనుకోకపోతే ఆమె చనిపోతుందా? ఆమె చనిపోవటంతో రచయిత సాధించిన కవితా ధర్మం ఏముంది? పాఠకులకు కలిగే చాలా ప్రశ్నలకు సమాధానం దొరక్కపోయినా, ఈ రోజుల్లో వస్తున్న చాలా నాటికలు మాదిరిగానే ఇదీ ప్రదర్శిస్తే ఫరవాలేదనిపించవచ్చు.

అట్లూరి పిచ్చేశ్వరరావు రచనలు ఇంతకు పూర్వం, ఇతర ప్రక్రియలలో చదివిన పాఠకులు ఈ రచనలో ఏ విధమయిన జీవిత దృక్పథం వ్యక్తం చేసిందీ

చూడాలని ప్రయత్నించటంవల్ల పెద్ద ప్రయోజనం లేదు. ఇవి రేడియో కోసం చేసిన రచనలు. ఈ రచనలు సంపుటీకరించటంవల్ల క్రొత్తగా కలిగే మేలేమీలేదు. నాటికావాఙ్మయంకంటే ఉన్నతంగా గేయ వ్యాస సాహిత్యం వుంది.

3. అడ్లూరి పిచ్చేశ్వరరావు 'విన్నవీ - కన్నవీ' సంకలన గ్రంథం. మేధావి ఆలోచనగల క్రోడీకరణం. రాజకీయంగా కమ్యూనిజం ఏం పరిణామం సాధించిందో ఇక్కడ అప్రస్తుతం. అయితే ఒక ఉపకారం మాత్రం ఆంధ్ర జీవితానికి చేసింది. కమ్యూనిజం ఆంధ్ర దేశంలో కాయానక పూర్వం ఇంత అధిక సంఖ్యలో ఆలోచనాపరులు లేరు. ఇంటెలిజన్‌సియా అనీ, థింకర్స్ అనీ, సైద్ధాంతికులనీ, మేధావులనీ, కమ్యూనిజంలో ఆలోచనాపరులను పేర్కొనడం కద్దు! మునుపటి మేధావులు సాంప్రదాయిక జీవులు. ఈ మేధావులు సమాజ చైతన్యకారులు. వాళ్ళు గతానికీ, వీళ్ళు భవిష్యత్తుకు వారసులు.

ఆంధ్రులు సహజంగా హాస్యకుశలత కలవారు. కొద్దిమంది అవసరమయిన విషయాలను సీరియస్‌గా తీసుకోగలరు. చాలామంది ఎంత సీరియస్ విషయానికి హాయిగా నవ్వి పారేస్తారు.

ఆంధ్ర జీవితంలో ప్రధానంగా సర్వకావ్యాలూ, అప్రధానంగా వచన కావ్యాలూ ఆనందం కలిగించేవి నిన్న మొన్నటిదాకా. వచనంపట్ల, వచనరచనపట్ల సమ్యగభిప్రాయమూ, ఆలోచన రేకెత్తించే వచన స్థితినీ సాహిత్యంలో ప్రవేశ పెట్టిన గౌరవమూ కొంతవరకు, తదితరులతోపాటు కమ్యూనిష్టులకూ దక్కుతుంది. సామాజిక జీవితం వాస్తవికంగా పరికించే ఆలోచనాపరుల్ని, అవసరమయిన విషయాలను సీరియస్‌గా స్వీకరించే వ్యక్తుల్ని, కొంతవరకు కమ్యూనిజం సృష్టించింది. ఇది దేశగతి పరిణామం.

పిచ్చేశ్వరరావు కమ్యూనిష్టు కాకపోతే ఆలోచనాపరుడు కాకపోయేవాడు. హాయిగా కావ్యాలు చదువుకొని ఆనందించేవాడు. సహేతుకంగా లేకపోతే నమ్మే గుణం అలవడేదికాదు. ప్రతి సంప్రదాయం ప్రశ్నించి సిద్ధాంతందాకా చర్చించు

కొంటూ పోయేగుణం పలిగేది కాదు. ఈ చిన్న వ్యాసాల సంపుటి ఆ రెండు గుణాలకు నిదర్శనం.

ఈ పుస్తకంలో కొన్ని ఆలోచనలూ, కొన్ని గేయాలూ, కొన్ని అనువాదాలూ ఉన్నాయి. ఒక భావం, వ్యక్తి, వ్యవస్థయొక్క బలం, అస్తిత్వంలో కంటే నాస్తిత్వంలో అస్తిత్వ రాహిత్యంలో స్పష్టంగా గోచర మవుతుందనే ఆలోచన చెప్పే ప్రఖ్యాత జపాన్ రచయిత టాజ్యూజోఇషికావా రచన అనువాదం 'చీకటిలో ఆలోచనలు'.

ప్రత్యక్ష ప్రమాణం లేకపోతే ఏ సిద్ధాంతం అయినా నమ్మటానికి, స్వీకరించటానికి భయపడే సమాజానికి మేలుకొలుపు వంటిది 'పరిశోధన' అనే బెంగాలీ కథ అనువాదం. ప్రత్యక్ష ప్రమాణ సంస్థాపనార్థం వామనరావు పొందిన దుర్గతి అన్ని విషయాలకూ ప్రమాణం కావాలనటం కంటే హేతు వాదంతో తార్కిక దృష్టితో ఆలోచించి, ఆలోచనల సమన్వయంతో సిద్ధాంతం చేసుకోవటం ఉచితమని చెప్పే ఈ రచన కథాదృష్టితో పేలవమయింది. ఇంత పెద్ద కథ అంత చిన్న విషయం స్థాపించటం కోసం అనువదింపనక్కర లేదు. అంతకంటే, ఈ కథ చదివి కాంక్షిత సిద్ధాంత లక్షణం చేరుకొనేకంటే దూరంగా భిన్నావస్థను పాఠకుడు పొందగల ప్రమాదమూ వుంది.

4. బెర్టోల్డ్ అభినయంపై వ్యక్తం చేసిన దృక్పథం ఆంధ్ర నాటక రంగానికి ఉపయోగపడవచ్చు. శ్రీ గజ్జెల మల్లారెడ్డి కవిత్వం కార్టూను కవిత్వం అని ఎవరెవరో అనటం విన్నతర్వాత, అటువంటి కవిత్వం పిచ్చేశ్వరరావు చాలాకాలం ముందు వ్రాసినట్లు గ్రహింపవచ్చు!

'గడ్డి కట్టలు', 'కార్టూన్లు' 'కాకదంత పరీక్ష', 'వైతాళికం' చక్కనివచన కవితలు. ఈ కవితల్లో కమ్యూనిజం గూర్చి రచయిత చెప్పే తీరు-

'మహాప్రవాహానికి మురుగు గడ్డిపట్టలు అడ్డమా?
మరాళా పక్షాలు, పదవీకాంక్షా పక్షాలు
కమ్యూనిస్టు వ్యతిరేక పక్షాలు
పక్షాలు కాని పక్షులు, పక్షాలులేని పక్షులు'

ఇలా ఉంటుంది :

'త్రివేదీ సత్కార్యంలో ఒకరు నోరు విప్పరు
జానోను కమ్యూనిస్టులు ప్రథమ శత్రువులు!'

ఇంకా ఇలా ఉంటుంది :

'నిర్యాణంలో నిర్వాణం?
ఇంగ్లీషులో యూనివర్సల్ సూయిసైడ్ అంటారు.
అదిగో మళ్ళా సైడ్ కెనాల్స్‌లోకి జారుతున్నారు?
కెనాల్స్‌లో పెనాయిల్ వేయాలండీ!

అపహాస్యంలో కూడిన వచన కవిత్వంలో, అదే కార్టూన్ కవిత్వంలో పిచ్చేశ్వరరావు అందెవేసిన చేయి.

5. ఆలోచనలు అని చెప్పుకోదగ్గ వ్యాసాలు మొత్తం పది. అందులో వ్యక్తం చేసిన భావాలూ, అభిప్రాయాలూ అందరూ హర్షిస్తారు అన్న నమ్మకం ఎవరికీ అక్కరలేదు. కొన్ని నచ్చుతాయి, కొన్ని నచ్చవు. సహజమే! అయితే కమ్యూనిజం ఎర్రకళ్ళజోడుతో ప్రతి విషయమూ ఎర్రగా చూచినప్పుడు కామెర్ల రోగి లక్షణం కనిపించే ప్రమాదం ఉంది. అయితే రచయితలో ఆలోచనల తీవ్రత, తర్కవిధానం-అసలు ఆలోచించే గుణం పాఠకులకు ఆనందం కలిగిస్తుంది. అసలు ఆలోచించే సామర్థ్యం కించపరచుకొంటున్న వాళ్ళలో ఆలోచించేవాడు ఉండటమే ఆనందం. ఎలా ఆలోచించాడన్నది అభిప్రాయభేదానికి గురి అయితే అవ్వుగాక!

ఉద్యోగ విజయమూ, పూలగొడవా, రచయిత మనుగడ, అభ్యుదయ నిర్వచనం, సాహిత్యంపై అమెరికా దండయాత్ర, రచనావస్తువు, విద్యార్థుల రాజకీయాలూ, అమెరికా-చార్లీ చాప్లిన్ మున్నగు విషయాల మీద పిచ్చేశ్వరరావు ఆలోచించి వ్యక్తం చేసిన అభిప్రాయాలు గమనించదగ్గవి.

మనం అమెరికాను తిట్టాలా, వద్దా? కొందరికి అక్కరలేదు. కొందరికి వుంది. కమ్యూనిష్టులకు మరీవుంది. కంట్లో నూలంపున్న మనిషి, కంట్లో నలుసో, నలుసులగుంపో వున్న మనిషిని, సంస్కరించే ప్రయత్నం. బాగుచేసే దృష్టి పెట్టుకోవచ్చా? ఇంటగెలిచి రచ్చ గెలవమన్నారు.

అమెరికాపై రచయిత ప్రదర్శించిన తీవ్రత వ్యష్టి అభిప్రాయం కాదు. సమిష్టి అభిప్రాయం. చార్లీచాప్లిన్‌ని అమెరికానుంచి బహిష్కరించటం న్యాయంకాకపోవచ్చు. కళా దృష్టితో, భారతీయ దృష్టితో, అమెరికా పుస్తకాలను అంటే భవిష్యత్తు ఆస్తిని తగులబెడుతుంటే, నిషేధం చేస్తుంటే సహించగలరా? ఎవరూ సహించలేరు. అయితే ఆంధ్ర దేశంలోనే అసభ్య సాహిత్యమనీ, అనవసర సాహిత్యమనీ నిషేధిస్తుంది; ఏం చేస్తున్నారు? ఏదో చేశారు! ఏం ప్రయోజనం సాధించారు? ఏదో సాధించినట్లే కనిపిస్తుంది! కొన్ని విధానాల రచనలు నిషేధిస్తే ఊరుకోవచ్చా? కొందరు ఊరుకొంటారు. కొందరు వూరుకోరు. ఎందువల్ల? అభిప్రాయ భేదాలు! కమ్యూనిష్టు సాహిత్యం నిషేధించటం కొందరికి కష్టం! కొందరికి ఇష్టం! అలాగే అసభ్య సాహిత్యం! చెప్పవచ్చిందేమిటంటే, మన దేశంలోనే సాహిత్య బహిష్కరణవుంటే ఇతర దేశాల గొడవ మనకెందుకు? మనదేశం బాగు చేసుకొని, ఇతర దేశాల్ని వేలెత్తి చూపవచ్చు! తప్పులేదు. మరి ఆ దశకు ఈ దేశం చేరుకొందా? థింకర్స్! ఇన్‌టల్‌జన్‌సియా! ఆలోచనా పరులూ! మేధావులూ! ఆలోచించండి. ఎవరి అభిప్రాయాన్ని అయినా గౌరవించాలి. అది ఇష్టం లేకపోతే పాటించ నక్కరలేదు. ఏ గ్రంథమయినా ప్రచురణ కానివ్వాలి. ఏ గ్రంథాన్ని నిషేధించకూడదు. వాక్ స్వాతంత్ర్యం ఉండి తీరాలి. దాన్ని నిషేధించేదేనికయినా దారిద్ర్యమే.

శ్రీశ్రీ అంటే ఈ రచయితకు విపరీతమయిన అభిమానం. భగవంతుడి విషయంలో కమ్యూనిజం మాట ఏమైనా కాని శ్రీశ్రీ రచయితకు దేవుడు!

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ అంటే ఓటేలుమనిషి. గడ్డిపోచమ్మ! రెండూ అతి వాదాలు! సమన్వయం అవసరం. సద్విమర్శకుడు ఉచితానుచితాలు, అర్థానా ర్థతలు, మంచి చెడ్డలు తూకం వేయగల న్యాయ నిర్ణేత వంటివాడు. పాక్షిక దృష్టి ప్రదర్శించటం, రాజకీయంలో ఏమిటో గాని, సాహిత్యంలో ఆత్మవంచన!

'సాహిత్యం గూడ ఒక వృత్తి వంటిదే'. ఈ అభిప్రాయం తర్కసహితం, హేతుబద్ధం అవుతుందని నమ్మటానికి ఆంధ్రులకు చాలా కాలం పడుతుంది.

'పోరాటం లేనిదే పురోగమనం లేదు' రచయిత అభిప్రాయం. సొంతం కాదు. అయినా పోరాటం అంటే అర్థం యుద్ధం అయితే ఆ అభిప్రాయం పూర్తి ప్రత్యం కాదు. కాని పోరాటం యుద్ధం కాదు. పోరాటమంటే నిర్భయవంతంగా జనం జీవించటం.

వేద కాలం నాటి మానవుణ్ణి గూర్చి చెబుతూ, 'ఆనాటి మానవుడి ఆదర్శం ప్రధానంగా కుక్షింభరత్వం' అని రచయిత చూపిన అభిప్రాయం. సామాన్య దృష్టితో ఆలోచిస్తే ఆదర్శం ప్రధానంగా కుక్షింభరత్వమే కాకపోవచ్చునేమోకాని అది సమగ్ర సత్యం కాదు. స్వచ్ఛమయిన అభిప్రాయమూ కాదు. ఆదర్శం ప్రధానంగా ఆదర్శం కోసమే! ఇంకొంత మెట్టు పైకి పోతే ఆదర్శం ఒక జబ్బు! మళ్ళీ మాట్లాడితే ఆదర్శం ఒక స్వార్థం. ఆ స్వార్థం కుక్షింభరత్వం కంటే భిన్న మయింది. విశాలమయింది. ప్రమాదమయింది. ఆదర్శం జానిన మన స్తత్వానికి అక్షర రూపం.

ఏమయినా, అట్లూరి పిచ్చేశ్వరరావు 'విన్నవీ-కన్నవీ' ఆలోచింపజేసే రచన. ఏ సిద్ధాంతం నమ్మిన రచయిత అయితేనేమి, ఇటువంటి రచనలు తెలుగులో ఎంత అధికంగా వస్తే తెలుగు జాతికి, సాహితికి అంత పుష్టి!

అట్లూరి పిచ్చేశ్వరరావు గొప్ప ఆలోచనాపరుడు. చారిత్రక, సామాజిక అవగాహన ఉన్న రచయిత. ఉత్తమ సృజన వ్యాస నిర్మాత. అధిక్షేపాత్మకంగా వ్రాసిన వచన కవి. తన భావాలకు బలం ఇచ్చే వ్యాసాల అనువాద కర్త. తెలుగు జాతి జీవం, జవం పుణికి పుచ్చుకొన్న కథానికా రచయిత. తెలుగు జాతి భవితవ్యం సుందరంగా భావించుకొని, దాన్ని దర్శించుకోవాలన్న ఆత్మ ఘోషతో సాహిత్యం సృష్టించిన ఆలోచనాపరుడు పిచ్చేశ్వరరావు.

# 11. నారాయణరెడ్డి కవిత్వం

విశ్వ విద్యాలయంలో ఆచార్యత్వం. ఆంధ్ర దేశంలోని సారస్వతోపన్యాస శక్తి, వాక్ బలాన్ని, పద్య, గేయ, వచన, సినిమా కవిత్వం, సాహిత్యం, అక్షర బలాన్ని తెలుపుతూ డా. సి. నారాయణరెడ్డి బహుముఖీన ప్రతిభకు తార్కాణంగా వున్నాయి. అభివ్యక్తి సామర్థ్యం పొందే వైవిధ్యం విరివిగా వున్న సాహితీమూర్తి డా. సి. నా. రె. త్రిదశత్వం పొందుతున్న కవితారంగంలో కాకలు తీరిన కవి. సాంప్రదాయక ఛందస్సులో ఖండకావ్య నిర్మాణం చేసి కీర్తి ప్రతిష్ఠలు పొంది, బహుమతులు, సత్కారాలు అందుకొని, సన్మానాలు స్వీకరించి, గేయ సాహిత్యం సృష్టించి, సంగీత నృత్య మాధుర్య సీమలు తరించి, వచన కవితా రంగంలో చొచ్చుకుపోతున్న డా. సి. నారాయణరెడ్డి సినీమాకు వ్రాసే పాటల మాట వేరు.

ఈ సమాలోకనంలో గ్రహించిన 'అక్షరాల గవాక్షాలు', 'జాతిరత్నం' సంప్రదాయం మీద ప్రయోగిస్తున్న కవిని చూపుతున్నాయి. ప్రయోగంలో డా. సి. నారాయణరెడ్డి వచన కవిగా దిద్దుకొనే రూపం వుంది. అది 'మధ్య తరగతి మందహాసం' లో స్వరూపం అయింది.

డా. సి. నారాయణరెడ్డి వచన కవితా రూపం, పద్య గేయ కవితా రూపాలకంటే భిన్నంగా వుంది. వచన కవిగా కంటే పద్య గేయ కవిగా ఒకటి న్నర దశాబ్దాం క్రితం శ్రేష్ఠంగా కనిపించిన డా. సి. నారాయణరెడ్డి ఈ మధ్య కాలంలో ఉత్తమ వచన కవిగా రూపొందటం గుర్తింపవచ్చు. ఈ మూడుకావ్యాలు డా. సి. నారాయణరెడ్డి వచన కవితా పరిణామానికి దర్పణాలు.

1. 'అక్షరాల గవాక్షాలు' చదివింతర్వాత రెండు అభిప్రాయాలు కలుగు తాయి. మొదటిది, సామాన్యంగా తెలుగులో కవిత్వం వ్రాసే వాళ్ళలో ఎక్కువ

మందికి వుండే భాషా మమకారం ఈ కవికి లేదు. భాషకోసం భావాన్ని భూసీ చేయటం జరగలేదు. భావానికి భాష చాకిరీ చేసింది. ప్రతి రచనలో చాలా వరకు అర్థ స్వాష్ట్యం వుంది. భావం, భాషా ఎక్కడో తప్ప, అన్నిచోట్ల అతికి నట్లు కుదిరాయి. 'గుండె గుండెకొక దీపం' మినహాయిస్తే, ఏ రచనా సాగి లాగినట్టు లేదు. 'మన శైశవం' విడిచి పెడితే కవితలో పదాడంబరం తక్కువే.

రెండవది రచనా నైపుణ్యం. తెలుగు కవులలో చాలా తక్కువ మందికి వుండే ఉక్తి వైచిత్రి. ఈ కవికి పుష్కలంగా వుంది. అది కావ్యం నిండా గోచరమవుతుంది. స్వీకరించిన వస్తువు ఏదైనా ఉక్తి వైచిత్రి వల్ల కావ్యత్వం సిద్ధించి ప్రతి రచన చాలావరకు రసరమ్యంగా రూపొందింది. డా. సి. నారాయణరెడ్డిని కవిలోకంలో నిలుపగలిగిందీ ఈ సంపుటిని కవితాశ్రేణిలో ఉంచగలిగిందీ ఉక్తి వైచిత్రి. పదాల కలయికలో, భావాలను మలుపు తిప్ప టంలో, ఛందస్సు విరుపుల్లో ఈ ఉక్తి వైచిత్రి ప్రత్యక్షమవుతుంది. ఈ కవి గ్రహించిన ఏ వస్తువైనా కవితా రామణీయకం సంతరించుకోగలుగుతున్నప్పుడు, తాత్కాలిక వస్తువు కంటే, శాశ్వత వస్తువునకు ప్రాధాన్యమిస్తే కావ్యత్వం స్థిర మవుతుంది.

"వడివేసి వొదిలేసిన ముంగురులు
పసిపాముల్లా బుసకొడుతున్నై!"
పసిపాములు బుసకొట్టగలిగితే కల్పనలో చమత్కారం వుంది.
"చీకటులు నా కంటిరెప్పల
సెజ్జబందునమేను వాల్చిన వేళలో"

కంటిరెప్పలసెజ్జల మూలంగా ఉక్తివైచిత్రి సాధితం. ఇది మత్త్యాలసరం పొడిగించిన తీరు.

ప్రసిద్ధమైన సమాసాలు ప్రయోగిస్తే శ్రమ తక్కువ. ఆలోచన అవసరమూ లేదు. కానీ రెండు వ్యస్తపదాలను సమస్తం చేసి, ఆ పదాలకు భిన్న

మైన ఒక క్రొత్త అర్థం, స్ఫూర్తి సాధించి, భావాన్ని అలవోకగా చెప్పటం కవి ప్రతిభకు తార్కాణం. ఈ సంపుటిలో అలాంటి సమాసాలు చాలా ఉన్నాయి. కొన్ని, "పూలమందలు, పూలపెండ్లి, ఆకుల పందిళ్ళు, పైడి పందిళ్ళు, మసలినిప్పు, ముసలిమామిడి, పచ్చితెలుగు, గరికమెడ, పిట్టకలము, వెన్నెలదిండ్లు, చీకటిలిపి, చీకటిగ్రుడ్లు, తుమ్మెదసుల్తానులు, మదిరాక్షుల పెదవులగల మధుశాలలు," ఉన్నాయి. కానీ, 'సల్లనిమంచు' చల్లగా వుంది.

ప్రతి మనిషికీ సుఖదుఃఖాలుంటాయి. వాటి ప్రభావానికి లొంగిపోని వ్యక్తులు అరుదుగా వుంటారు. ఏ వ్యక్తి హృదయం ఆయా భావాలకు స్పందిస్తుందో, ఆ భావం ఎదుటి వ్యక్తి అనుభూతి చెందినట్లు ఏ వ్యక్తి వ్యక్తం చేస్తాడో, ఆ వ్యక్తి కవి. ఈ వ్యక్తి కవి. సుఖదుఃఖాలు అమృతమూ, విషమూలాగా కవితా సంకేతాలు.

'కన్నీరే కావలెనా, పన్నీరే కావలెనా' అని ఆత్మపరీక్ష చేసుకొని,' కన్నీరే కావలెనని' ఒకనాడన్న కవి, 'కన్నీళ్ళు నా పాలిటి గంగాజలమని త్రాగి' కాలాంతరంలో 'కన్నీరే కావాలెనా పన్నీరే కావలెనా' అనే విచికిత్సలో పడి, 'గుండెయే ఒక అశ్రుభాండమై తొణకగా' 'బదులు పల్కలేక శిరమువాల్చి' కోవటం జరిగింది.

'స్మృతులపై లాఠీల వర్షం కురిసి' 'తీపి గడియలందు చేదు జ్ఞాపకమ్ము లొక అందము' అని విశ్వసించి, 'కనురెప్పల కత్రువులు కావలిగా నిల్చుకొని' 'ఒక్కొక్క రక్తంపు చుక్కలో పూవు మసుగడ పెంచు తీగ సంగతి' చూచి మసక దృష్టితో, 'ద్వేషమును సలసలకాచి పొట్లుపొట్లుగా స్నేహమ్మును ఎదలో నడిపి'కొదలచి, వీలుకాక, 'నన్ను త్రాగనిందు విషము, నా కదిదే జీవరసము' అని తేరుకొని, విషపానం చేసి, కష్టం భరించి, అమృతం వంటి ఆనందం పొంది, 'ఏమిటీ అపూర్వానుభవామృత విషమేళనమ్ము' అనుకొంటూ విస్తుపోవటం తప్పలేదు.

నష్టాలు కోరుకొన్నప్పుడు సుఖాలు వచ్చాయి. ఆనందం వాంఛించినపుడు దుఃఖం వచ్చింది. సుఖదుఃఖాలలో అందం కనిపించింది. రెండింటి సమ్మేళనం వింతగా రూపుకట్టింది. అందుకే 'సంయోగములో విరహచ్ఛాయలున్న ఒక అందము. ఆనందములో విషాదగానమున్న ఒక అందము' అని అంగీక రించటంతో కవి ఉత్తమ మానవత్వ శిఖరాలు చేరుకోగలిగాడు.

గత రెండు దశాబ్దాలుగా భారతదేశం రాజకీయ రంగంలో చాలా పరిణా మాలు పొందింది. ఇది ఉన్నతి అని, దీనికి కారణం గాంధీజీ అనే అభిప్రాయం కవి వ్యక్తం చేయకపోలేదు. 'అజ్ఞాత వాసం'లో పాండవులు అయిదుగురూ అయిదు వర్ణాలుగా, ద్రౌపది భారతదేశంగా భావించినట్లు ఊహింపవచ్చు. స్వాతంత్ర్యం వచ్చినతర్వాత ప్రణాళికలు ఏర్పడ్డాయి. ప్రణాళికలు కవి దృష్టిలో 'వెలుగుమెట్లు'!

"నేలమీద యిరుకు గదుల
నిల్వలేక నా దేశం
నిలువెత్తుగ కట్టుకొన్న

వెలుతురు కడ్డీల మెట్లు"గా ప్రణాళికలను భావించి, 'పుడమిగవను నుండి ఆకాశపు లోగిలి దాకా' మనిషి సాగాలని, 'ఈ మెట్ల పైన కాల్మోపి గమించగ రారా తమ్ముడ' అని తోటి సహోదరునికి ఆహ్వానం.

భారతదేశం వ్యావసాయిక దేశం. దేశాభివృద్ధి జరగవలసింది కూడా ఆ రంగంలోనే. ప్రణాళికల మూలంగా, దేశంలో

"'ఓమ' కూడ పండనట్టి
ఊషర భూముల లోపల
పదార్వన్నె బంగారపు
పైరులు తల లూపునురా" అని భవిష్యత్తును ఆశించి,
"నిన్నమొన్ననే కదా 'గునుగు' పండని భూము
లందు బంగారు సస్యములు తలలూపినవి".

అది ఆశ ఫలింపగా వర్తమానంలో కవి తృప్తి.

రాజకీయ స్వాతంత్ర్యం వచ్చి పద్దెనిమిదేళ్ళయింది (ఈ వ్యాసం వ్రాసే నాటికి) పొలాలలో బంగారు పండితే, ఆర్థిక స్వాతంత్ర్యం వస్తుంది. ఆర్థిక స్వాతంత్ర్యంతో అన్నదమ్ములైదుగురూ 'అజ్ఞాత వాసం'లోని కీచకుల్ని ఎందరి నైనా ఎదుర్కొంటారు. దేశ గౌరవం కాపాడుకొంటారు. సమత తల ఎత్తుతుంది. దేశం బుగుజ్జ్వల మవుతుంది. పాలకులూ, పాలితులూ సమానమే! అప్పుడే

"గిరిజనుడే పురజనుడై
ధరాచక్రమును త్రిప్పే
తరుణారుణ కాలం వస్తున్నది" అనే అవకాశం వుంది. 'నానృషిః కురుతేకావ్యమ్' కవి ఋషి. ఆర్ష వాక్యం వ్యర్థం కాదు. తథాస్తు!

దేశానికి ప్రణాళికలు అందించిన వాళ్ళలో అగ్రగణ్యుడు నెహ్రూజీ. ఆ భారత ప్రధాని మరణానంతరం కవి అశ్రువులు నాల్గు ఖండికలలో కురిపించాడు. 'నెహ్రూజీ చనిపోతే', 'విశ్వంభర కంటిపాప వెలుగే మాసిన' దనీ, 'ఐశ్వమంత ఇందిరయై విలపించిం' దనీ 'తుకతుకమను రక్తాశ్రుపులిక ప్రమింగగలే' నని కవిలో బాధానుభూతి.

ఈ సంపుటిలోని 'గుండె గుండె కొకదీపం' ఆకాశవాణిలో

"గుండె గుండెకొక దీపం వెలిగించి
శిరము శిరము కొక శిఖరం పెరిగించి
గళము గళము కొక గర్జన ప్రోగించి'
జాతి వెలుకొని ముందుకు నడిచింది." పాటగా వినిపించింది.

ఇప్పుడీ సంపుటిలో.

"గుండె గుండెకొక దీప కందరం వెలిగించె నేడు.
శిరము శిరము కొక హిమాద్రి శిఖరం పెరిగించె నేడు.
గళము గళము కొక కేసరి గర్జన వినిపించె నేడు.
జాతిరక్తమున సాగర చేతన కనిపించె చూడు."

గేయంగా కనిపించింది.

పైపాటకు, ఈ గేయానికి భావంలో లేదుగానీ పదాలలో ఛందస్సులో మార్పు వుంది. భావం లాగినట్లుంది. శిఖరం అంటే హిమాద్రి శిఖరమనే స్ఫురించవచ్చు. గర్జన అంటే కేసరిగర్జనే అనిపిస్తుంది. పాటలో అల్పాక్షరాలతో అనల్పార్థంవుంది. గేయంలో అధికాక్షరాలతో అదే అర్థం వుంది. పాట ఉత్తమంగా వుంది. అయినా గేయమే సంపుటిలో చోటుచేసుకొంది.

"ఎవడు హిందు వెవడుతురక ఎవడు రా కిరస్తానీ?
ఎవనిది తెలుగెవరి దరప మెవరిది హిందూస్తానీ?"

తురక, కిరస్తానీ సామాన్యంగా నిందార్థకాలు, తురక పదం ప్రబంధకాలంనుంచీ మతపరంగా ప్రయోగింపబడుతూ ఉండటం చేత, సాహిత్యంలో ఈ పదప్రయోగం అంగీకార్యం కావచ్చు. కాని 'కిరస్తానీ' పదంసాహిత్యంలో నిందాత్మకంగానే ప్రయుక్తం.

అయితే ఇది హృదయం నిందకాదు. అది హిందూస్తానీ కోసం తయారయిన కిరస్తానీ. అనుప్రాస ప్రయత్నం. ఇటువంటి చోట్ల అర్థప్రాధాన్యం కాంక్షించి, అనుప్రాస విడిచిపెట్టినా మంచిదే! కావలసింది భావ సారూప్యమంతగా పదసారూప్యం కాదు.

'విషవీచి'లో చైనా, భారతదేశంపై జరిపిన దురాక్రమణ వస్తువు.

"తోటి దేశమున చొరబడి
దురంతాల కొడిగట్టి
బూజు బుద్ధిచిగదుర, చెం
గీజు ఖాను సోదరా!" వుంది. చంగీజుఖాను చైనా దేశీయుడూ దురాక్రమణ దారుడూ కాడు. వీరుడు. ఆసియా వీరుడు. దుర్మదాంధుల కళ్ళపొగరు దించి గుణపాఠం నేర్పిన ప్రజావీరుడు. చెంగీజు ఖాను, ఆంగ్ల చరిత్రకారుల చేతుల్లో దుర్మార్గుడుగా చిత్రింపబడినట్లున్నా, వాళ్ళ మాటల్లోనే అతని ఔన్నత్యం కనిపిస్తుంది. సాహిత్యంలో చెంగీజు ఖాను ఉదాత్త వ్యక్తి. తెన్నేటి సూరి నవల

'ఛెంగీజుఖాన్' ఉదాహరణ. చైనాను చెంగీజ్ ఖాన్ సోదరుడుగా భావించనక్కర లేదు.

'ఎందుకయ్యా బండ్ల కొద్దిగ ఎద కదల్చని కావ్యరాసులు?' "సన్నాక గీతం గెలుకుమంటివా?'' ఇలాంటి కావ్యౌన్నత్యాన్ని కించపరిచే పాదాలు ఈ సంపుటిలో చేరకుండావుంటే బాగుండేది.

కవికి చిన్నయసూరి ఇష్టమే, గిడుగు, గురజాడలు ఇష్టమే. గ్రాంథికం ఇష్టమే. వ్యావహారికం ఇష్టమే! అందుకేనేమో ఒక భాష వ్రాస్తుంటే మరొక భాష వస్తుంది. రెండు భాషలూ కలిసిపోతాయి.

"ఏమున్నది ఇంకేమున్నది
ఈ విశ్వం మూలుగుతుంది"

"కనుపించని కారుచిచ్చు
కణకణమున రాజుకుంది"

"పిడికిట ఇమిడెడు హృదయం
జలధియంత విస్తరించె" ఇటువంటివి ఎన్నైనా చూపించవచ్చు.

"మునిషి, ఇంకా, కోసము, బనా, అంతా, దాకా, ఇంటాయిటా, తొదిగే" ఇలాంటివి ఎన్నో! ఈ పదాలు గ్రాంథికంలో నిర్దుష్టాలు కావు. కావని తెలిసి కూడా సారళ్యం కోసం ప్రయోగించినట్లు ఊహించినా, "వాణ్ని, వాళ్ళు, అను మంటి, బ్రతికి"-ఇది రచనలో వాడదగిన వ్యావహారిక పదాలే కాదు. గగనవాణి అంటే ఆకాశవాణి రేడియో అనే అర్థమే రాదు. "మొదటి పనిపోతో ఆగస్టు" అంటే ఊహించడానికి భిన్నార్థం వస్తుంది. "చిరునవ్వుచు" ఊరుకోవలసిందే!

2. 'అక్షరాల గవాక్షాలు' లోని జాతిచేతనా దృష్టి అభివ్యక్తిలో అను భూతిని నిలుపుకొంటూ జాతి రత్నంలో ఇనుమడించింది. అయితే అక్షరాల గవా క్షాలు శీర్షికల కావ్యం కాగా జాతిరత్నం ఏక వృత్తం మీద సాగింది. వచన కవితా

ప్రయాణంలో కవి ఎక్కిన మరో సోపానం 'జాతిరత్నం'. జాతిరత్నం జవహర్‌లాల్ నెహ్రూ. ఆ మహా వ్యక్తి జీవిత చరిత్రను విహంగమాత్రంగా ప్రదర్శిస్తున్న కావ్యం జాతిరత్నం.

భారతీయులకు సంప్రదాయం మీద మక్కువ ఎక్కువ. అది ధర్మం. మోతీలాల్ భారతీయ చరిత్రను అలంకరించాడు. జాతిని నడిపించాడు. జవహర్ లాల్ భారత చరిత్రలో భాగమయ్యాడు. భాగస్వామి అయ్యాడు. శ్రీమతి ఇందిరా గాంధీ తండ్రి తాతల ఆనంద భవనానికి వారసత్వం పొందినట్లే, జాతి జీవితానికీ వారసత్వపు హక్కు సంపాదించుకొన్నది. రేపు ఆమె పుత్రులిద్దరు చిరంజీవులు, తాత ముత్తాతలంతటి వాళ్ళు కావచ్చు. ఇదీ భారతీయ సంప్రదాయ గౌరవం, ఆచారం, మర్యాద, మన్నన! మన దెంత గొప్ప జాతి!

పూర్వం కావ్యరచనకు కారణాలు రెండు. భగవంతుడు - ఏ రూపంలో అయినా కావచ్చు-కవికి కలలో కనిపించి కావ్యరచనకు ప్రోత్సహించటం ఒకటి. మహారాజు నిండు సభలో కవిని ఫలానా కావ్యం రచించమని అర్థించటం మరొకటి. అలాంటి హేతువులు ఆధునికులకు లేవు. హృదయం వుంది. హృదయ గతమైన స్పందన వుంది. ఆ స్పందన ఆవేశమై కావ్యరచన జరుగుతుంది. డా. సి. నా. రా. హృదయ స్పందనే కావ్యరచనకు హేతువు.

కావ్యం కన్న బిడ్డతో సమానం. సప్త సంతానాలలో విశిష్టమయింది. కావ్యకర్త రత్నాన్ని పితృదేవుడు. కావ్య భర్త రత్నాన్ని కన్యామణి భర్త. ఈ జాతి రత్నం శ్రీమతి ఇందిరాగాంధీకి సమర్పించబడింది. అంకితం చేయబడ లేదు.

జాతి రత్నమైన జవహర్‌లాల్ జీవితచరిత్ర ఇతివృత్తంగా మలచబడ్డ కావ్యం 'జాతి రత్నం'. నెహ్రూ హృదయ రత్నమైన శ్రీమతి ఇందిరాగాంధీకి సమర్పించబడడం సముచితంగా వుంది. సమాదర పాత్రంగానూ వుంది. రాజమన్నారు, శ్రీమతి ఇందిరాగాంధీని 'ఎర్ర గులాబీ'గా భావించటం

సరసంగా వుంది. సరస హృదయుల హృదయోల్లాసకరంగా వుంది. డా. సి. నా. రె. ఈ కావ్య రచనలో చూపిన మెళకువ కథానికా విధానం, ఈ పద్ధతి ఎక్కువ ప్రయోజనకారిగా, ఈ కావ్య రచనలో కనిపించింది.

అనేక స్థలాలతో ముడిపడి వున్న నెహ్రూ చరిత్రలో స్థలైక్యం సాధించ టానికి, ఒక శతాబ్దిలో ముప్పాతిక భాగం పంచుకొన్న నెహ్రూ జీవితంలో కాలైక్యం సాధించటానికి, అనేకులలో అల్లుకుపోయిన నెహ్రూ వ్యక్తిత్వంలో పాత్రైక్యం సాధించటానికి, అనవసర సంఘటనలు. సన్నివేశాలు, అంతే, కవితాదృష్టితో కవితా రామణీయకంగా ఉండని విషయాలు రచన నుంచి తొలగించుకోవటానికి, అనేక విధాల ఉపయోగపడిన ఏకైక పాత్ర 'గులాబీ.'

గులాబీ ప్రధాన పాత్ర. గులాబీ నెహ్రూ హృదయానికి సంకేతం. గులాబీ కవితో మాట్లాడుతుంది. కవికి కథలు చెబుతుంది. జవహర్‌లాల్ జీవితంలోని కవితా రచనానుకూలత ఉన్న ప్రధాన ఘట్టాలు క్రమంగా చెప్పుకు పోతుంది గులాబీ. గులాబీ ముఖంలో మార్పులు వస్తుంటాయి, మాటల్లో పరిణతి వస్తూ వుంటుంది. రచనలో పరిణామం వస్తూ ఉంటుంది.

కథానికా లక్షణాలలో మొదటి లక్షణం కథా ప్రారంభంలోనే రచన కథాసంతా చదివించే నేర్పు కలిగి ఉండటం. బలవత్తరమైన సంఘటనతో కథా రచన ప్రారంభిస్తారు రచయితలు, డా. సి. నా. రె. ఆ లక్షణం కావ్య రచనలో, నెహ్రూ జీవితంలో అంతిమ ఘట్టం స్వీకరించి రచించటంతో, ప్రవేశపెట్టినట్లు గుర్తింపవచ్చు. ఆ పైన నెహ్రూ జీవితం మొదటినుంచీ కాలక్రమంగా రచన సాగింది. కథానికా పఠన ప్రేరితులగు పాఠకులు సరసులు చక్కనికథ చదువు తున్నంత ఉత్సాహంతో ఈ 'జాతిరత్నం' పఠిస్తారు. కావ్యంలో ప్రధాన పాత్రలు గులాబీ, కవి. ఆ పాత్రల మధ్య అనుసంధింపబడిన ఆత్మ నెహ్రూ. ఈ 'జాతిరత్నం' కథానికా శిల్పసిద్ధి పొందిన కావ్యం.

కావ్యంలో వ్యక్తం చేసిన భావాలు ఒక్క కవివే కావు. నెహ్రూవి కొన్ని. ఠాగూరువి కొన్ని. తదితరాల మరి కొన్ని. కవివి మరెన్ని. నెహ్రూ రాజకీయవేత్త కాకపోతే మంచి కవి అయివుండేవాడు. తాను వ్యక్తం చేసే భావాలు చాలావరకు కవితా కళ్యాణ ఖండికలులాగా అనేక స్థలాలలో, ఇతరేతర సంఘటనలలో, స్పష్ట మవుతాయి.

1947 ఆగస్టు 14వ తారీఖు రాత్రి 12 గంటలకు నెహ్రూ జాతి నుద్దేశించి పలికిన పలుకులు, ఆవేశపరుడయిన అభ్యుదయవాది అయిన కవి, రాజకీయవేత్త అయితే ఎలా ఉంటాయో అలా వున్నాయి. అంతేకాదు. నెహ్రూ మరణశాసనం, అసలు శాసనమే అత్యుత్తమ కవితా ఖండిక. అటువంటివి ఎన్నో. నెహ్రూ కుమార్తెకు వ్రాసిన ఉత్తరాలు చరిత్ర చెప్పేవే అయినా కవితా స్ఫూర్తితో కళకళలాడినవే! 'ఇది మీరు వెలిగించిన దీపం' అని నాగార్జున సాగర్ చెంత వృద్ధుడైన వ్యక్తి పలికిన మాట విని పులకించిపోవటానికి ఆ నెహ్రూ కవితా హృదయం నిదర్శనం.

నెహ్రూ వస్తుతః కవి. జీవితం కవితామయం. జీవితంలో ప్రతి ఘట్టం రసమయం. డా. నారాయణరెడ్డి కవి. సాహిత్యంలోనూ, జీవితంలోనూ కవి. కవితా హృదయం పుష్కలంగావున్న కవి. ఈ కవి, ఆ కవిని గూర్చి చేసిన కవితా గానం రసరమ్యంగా వుంది. పాఠకులకు ఈ 'జాతిరత్నం' ఆనందం కలిగిస్తుంది. అంతకంటే అధికంగా, అదనంగా రాజకీయ పాఠకులకు మరెంత మక్కువ కలిగిస్తుంది. కల్పిస్తుంది.

ఉక్తి వైచిత్రి డా. సి.నా.రె. కలం కులికే కులుకుల హిమాలయాలలో ఎవరెస్టు. ఎంత నేర్పుగా భావాలు మలచుకోవచ్చునో చూచి, మలితరం యువకులు పాళలకు పదును పెట్టుకొంటారు.

కవితారచన ఈ రావుల శిఖరప్రాయం అనటానికి జాతిరత్నంలోని చాలా భాగాలు చూపించవచ్చు.

'ఆనంద ఘనస కుడ్యము
లందొదిగిన చిరువివ్వియ' మాదిరిగా ఉన్న నైత్రహా

'తొలిరాతిరి దుర్గమ్ముస
పలుకరించు పక్ష పక్ష
చంద్రరేఖ తన కొంక ఆ
శా, పతాకగా పెంసెను.'

కవిలకు ఛందస్సు మణిమయహారం అని డా. సి.నా.రె. ఒప్పుకోవచ్చు.

ఈ కావ్యంలో మాత్రాచ్ఛందస్సహిత కవిత వుంది. వచన కవిత ఉంది. ప్రకరణానికొక పద్ధతి. మేలిగుణమే! కానీ ఒకే ప్రకరణంలో పై ద్వివిధ కవిత గోచరించి పాఠకుల హృదయం రస కల్లోలిని అవుతుంది.

డా॥ నారాయణరెడ్డి వ్రాసే మాత్రాచ్ఛందస్సుగల కవితపట్ల రసికలోకం అభిమానం పెంచుకొంది. వచన కవితపట్ల పూర్వం అభిమానం లేదు. ఇప్పుడు కలుగుతుందా అన్నది చూడాలి! కలగవచ్చు. కానీ కలిగించ గలిగినంత సామర్థ్యం డా. సి.నా.రె. వచన కవితలో పెంచుకోవాలి. మాత్రాచ్ఛందస్సులో అనల్ప స్ఫూర్తిని కలిగించే ఈ కవి, కవిత్వం వచనంగా, మలచుకొంటే వన్నెలు వెతకాలి. వచన కవితవైపు మొగ్గుతున్న కవితాలోకం చూచి, తానూ మారాలని తలంచే కవి ప్రయత్నం గొప్పది. ఫలితం వేచి చూడాలి.

ఎందుకో ఈ కావ్యంలో డా॥ సి. నారాయణరెడ్డి పూర్వ కవితా స్ఫూర్తి ద్విగుణీకృతం కాలేదు. అవ్యవధి కారణం కావచ్చు. విషయగత వైఫల్యం కారణం కావచ్చు. విషయ సేకరణాధిక్యం వల్ల, విషయ వ్యక్తీకరణాధిక్యంవల్ల వాటిల్లి వుండవచ్చు.

మామూలుగా ఈ కవి వ్రాసే గ్రాంథిక పద్ధతిలో రచన విశిష్టంగానే ఉంది. ప్రత్యేకంగా వ్యావహారికం వ్రాయటమూ ఆహ్లాదకరంగానే ఉంది.

అయితే ఇంత ఏర్పాటు చేసుకొన్నా గ్రాంథికంలో వ్యావహారికం, వ్యావహారికంలో గ్రాంథికం తల చూపిన తాపులు అధికం కాదు గానీ అసలు లేకపోలేదు.

'అక్షరాల గవాక్షాలు'లో భిన్న కాలికంగా, 'జాతి రత్నం'లో ఏక కాలికంగా నూతన కవితా సృష్టి చేసిన డా. సి. నారాయణరెడ్డి 'మధ్య తరగతి మందహాసం'లో నిర్మించిన వచన కవిత్వం పూర్వ ధోరణికి భిన్నంగా వుంది. పద్య గేయ కవితకు చాలా దూరంగా పోయింది. నేటి డా. సి. నారాయణరెడ్డి ఉత్తమ వచన కవితా నిర్మాణానికి 'మధ్య తరగతి మందహాసం' మంచి మలుపు.

బి. కవిత కొంచ నెమ్మతో బాపు అలంకరించిన, సలభై శీర్షికంతో కళ్ళ పండుగగావున్న సంపుటి మధ్యతరగతి మందహాసం. పదేళ్ళ క్రితం డా. సి. నారాయణరెడ్డి కవిత తెలిసిన వాళ్ళకీ కవితా సంపుటి క్రొత్తగా కనబడుతుంది. ఆ కవితలో ఛందస్సు, భాష గ్రాంథికంగా ఉండేవి. ఈ కవిత వచన కవిత, భాష వ్యావహారికం.

ఈ పదేళ్ళలో సంప్రదాయకత నుంచి నూత్న ప్రయోగాలు చేస్తున్న సాహితీ లోకంతో పాటు డా॥ సి. నారాయణరెడ్డి పయనించటం, క్రొత్తదృక్పథం ఏర్పరచుకొని తదనుగుణంగా కవితా సృజనం ప్రారంభించటం గమనింప వచ్చు.

"భూతకాలం ప్రేతంలా విర్రవిగిస్తే
నర్తిస్తున్న వర్తమానాన్ని చూడు"

అనుకొని వర్తమాన కవితాధోరణిలో వ్రాస్తున్న డా. సి. నారాయణ రెడ్డి కవిత మునుపు ఉన్నంత సుండెదగ్గరగా ఇవాళా ఉంది. నూత్నతను స్వీకరించటం, మార్పుతో గమించటం క్రొత్తప్రయోగాలు చేయటం, కవితాధోరణిలో వెనుకబడకుండా సాగిపోవటం ఉత్తమ పద్ధతే!

ఇందులోని కవితలన్నీ ఒక్కసారి వ్రాసినవికావు. ఒక్కపథకంతో వ్రాసినవికావు. అప్పుడప్పుడు అలవోకగా స్ఫురించిన కవితలు. పండుగలకు

వ్రాసినవికొన్ని. వ్యక్తుల ఆధిక్య ప్రదర్శనార్థం వ్రాసినవి కొన్ని. చదువుతున్నప్పుడు సంతోషం కలిగించి, చదివింతర్వాత గుర్తుండి ఆలోచింపజేసే రచనలు కొన్ని.

ఈ మధ్య కాలంలో మనిషి వస్తువ్యామోహం మీద, రాజకీయాల మీద, సమాజం గమనం మీద, కవి మనస్సు పొందిన పరితాపం స్ఫురింపజేసే రచనలు పెంచిన్యాప్రంగా ఆలోచన రేకెత్తిస్తాయి. 'సన్మాజాని పూలామాలా' పాడటానికి అనుకూలంగా వుండవచ్చు. హృదయం కదిలించే రచన. కవితా కథానిక 'ఎక్కడికిపోతున్నాం మనం?' నిజంగా వేసుకోవలసిన ప్రశ్న. 'హే భగవాన్!' మామూలుగా పెద్దలందరూ పెట్టే ఘోష. ప్రత్యేకత కోసం ప్రయత్నించని సంస్కారతేమ. 'ఒంటి దీపం' 'చుక్కలు' 'జాగ్రత్త' 'గదిలో ఆకాశం' ధ్వన్యాత్మక రచనలు. పదేపదే చదువ బుద్ధిపడుతుంది. పండుగలూ, పబ్బాలూ, స్వాతంత్ర్య దినోత్సవం, గాంధీ గోర్కీల విషయం ఉన్న కవితలూ వున్నాయి. అందులో 'దీపం ముట్టిస్తున్నావా పాపా?' కలిగించినంత ఆనందం ఇంకెక్కడ దొరుకుతుంది?

డా. సి. నారాయణ రెడ్డి సాంప్రదాయిక కవిత సుప్రసిద్ధం. దాని అనుభవం పొందినవాళ్ళకే క్రొత్త కవిత కొత్తగా ఉంటుంది. నేడు ఈ కవి వెలువరిస్తున్న వచన కవిత్వం విశిష్టమయింది. దీనికి ఈ తరం యువతరం నిరంతరం ఆనందిస్తుంది. రెండు రీతుల కవిత్వ దర్శనం పొందినవాళ్ళు, అభిరుచి ఆంతర్యాన్నిబట్టి అటూ, ఇటూ మొగ్గటం ఇప్పుడూ కనబడుతూవుంది. తెలుగు జాతి ఈ కవితను ఆదరిస్తుందని భవిష్యత్తు నిర్ణయిస్తుంది.

# 12. 'చీకటినుంచి'

నూతలపాటి గంగాధరం యువకవి. భావం, ఆవేశం, భావావేశం ఉద్రిక్తంగా ఉన్న వ్యక్తి, కవితా రంగంలో కాలిడుతున్న మనిషి. కవితా వస్తు స్వీకారంలోనూ, తన్నిర్వహణలోనూ, రచయిత కవితా హృదయం వ్యక్తమవుతుంది. భవిష్యదాంధ్ర దేశంలో పరిఢవిల్లబోయే ఒక కవి బాల్యం ఈ సంపుటి వల్ల అందరికీ తెలుస్తుంది.

స్వీకరించిన ఇతివృత్తం చెప్పే తీరులో అందాలు సంతరించి, రసహృదయాలను అలరించే కవితాశక్తి వున్న పంక్తులు ఈ సంపుటిలో చాలా ప్రత్యక్షం లౌతాయి. 'కాలం' శీర్షికలో 'సర్వవస్తుజాల నిజ స్వరూపాలను-శాంతంగా, సౌమ్యంగా, ఎత్తిచూపే సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్ ఈ కాలం' అనీ; 'చీకటినుంచి' శీర్షికలో 'లేమి చేసినంతమేలు, కలిమి ఏనాడూ చెయ్యదు నీకు' అనీ; 'విద్యుత్తు' (అంటే ప్రాణం)లో 'అర్ధరాత్రి ఫ్యాక్టరీలో విద్యుత్తు ఎప్పుడు ఆగిపోతుందో ఎవరికి తెలుసు? ఒకరివిశ్రాంతి మరొకని పరిశ్రమకు నాంది' అనీ; కవి పలుకుతుంటే, జీవితం గూర్చి ఈ కవి కలిగి ఉన్న దృక్పథం రసజ్ఞులకు అర్థం కాకుండా పోదు.

'ఈ ఊరు మావూరు' కవిత హృదయంనుంచి ఉబికివచ్చిన రచన. ఈ గేయరచనకు పునాది హృదయం. ఆ హృదయం పరిభ్రమించిన వూరు. ఈ శీర్షికలో ఆవేశం లేదు. అతిశయోక్తి లేదు. ఇటువంటి వూళ్ళు ఆంధ్రదేశంలో, ఆ మాటకొస్తే భారతదేశంలో అనంతంగా ఉన్నాయి-

'ఈ ఊరిలో
అప్పిప్పువాళ్ళు లేరు

వైద్యుడూ లేడు,
ఎడతెగక పారే ఏరూ లేదు.
ఏమీ లేదు
ఇదీ మాఊరు'

ఇది చదవగానే నీతిపద్యం 'అప్పిచ్చువాడు, వైద్యుడు ....' గుర్తుకు వస్తుంది. ఆ వూరిలో ఉండకూడదని సదా ఆ కవి వాక్కు. ఇటువంటి గ్రామాలలో, ఈనాడు స్వాతంత్ర్యం వచ్చిన ఇంతకాలం తర్వాత కోట్లప్రజలు నివసిస్తున్నారు. అందులోనే....

'ఈ ఊరు—
నింగి రాతితో చేసింది,
నేల ఉక్కుతో నిర్మించింది
ఒక్క చుక్క వర్షం పడదు
ఒక్క గింజ ధాన్యం పండదు.'

ఈ పాదాలు చదువుతుంటే కవి ప్రతిభ గోచరిస్తుంది. ఆ వూరు నింగి రాతితో చేయబడిందట. అందుకనే ఒక్క చుక్క వర్షం పడదు. ఈ ఊరు నేల ఉక్కుతో నిర్మించబడిందట కాబట్టి ఒక్క మొలక పుట్టటం లేదు. ఒక్క గింజ పండటం లేదు.

ఈ గేయంలో మొదటి పాదాలు వ్యుత్పత్తి ఫలితాలు. తనకు తెలిసిన పద్యం కొంచెంగా చమత్కరిస్తే అవతరించిన వాక్యాలవి. అయితే అనంతర పాదాలతో ఆత్మగత ప్రతిభావిష్కృతి జరిగింది.

ఆటువంటి ప్రతిభ ప్రదర్శించే కవితలు ఈ కవి కలం నుంచి వెలువడతా యని ఆంధ్రులు ఎదురు చూస్తారు. అయితే ఈ సంపుటిలో మాత్రం ఆధునికాంధ్ర కవులలో ప్రసిద్ధులయిన అనేకులను తలపించే ఖండికలూ, వాక్యాలూ కోకొల్లలుగా వున్నాయి.

'ఈ ఉదయం తప్పక ఉదయిస్తుంది' అనే ఖండిక 'ఉదయించని ఉదయాలు' అనే శ్రీ దేవరాజు కావ్య నామధేయాన్ని, 'శ్రమజీవి' 'ఇంకా ఏమీ చేయలేక నిరీక్షణతో' అనే శీర్షికలు శ్రీశ్రీ కవిత్వాన్ని, 'ఆ' అనే ఖండికనూ, 'పసిడి పలుకులు' ప్రవాహరథి 'బాల్యం'నూ 'మృత్యు ముఖగహ్వరం' శ్రీజాషువా 'ప్రాణవాటిక'నూ గుర్తుకు తెస్తున్నాయి. ఇటువంటి కవితలు - ఇతర కవుల ధోరణులు గుర్తుకు వచ్చేటట్టుగా కాకుండా ఈ కవి కవితా రచన చేయాలని పాఠకులు కోరుకొంటారు.

'తాన్సెను', 'ఆశాపాశం', 'పతితాకన్య', 'ఈ ఊరు మా ఊరు', 'కొన్ని (బా) స్తవాలు', సంపుటిలో మళ్ళీ మళ్ళీ చదవాలనిపించే కవితలు.

'నిండని కుండ'లో

'నిండని కుండ తొణుకుతుంది, నిజం !
ఎప్పుడు ?
ఎవరైనా కదిపినప్పుడు —
నిండు కుండ మాత్రం తొణకదా?
నిశ్చలంగా ఉంచేస్తే
ఏది మాత్రం ఎందుకు తొణుకుతుంది ?

ఈ సమన్వయ వాదంలో ఎంత తిరుగుబాటు ఉందో పాఠకులు చక్కగా ఊహించుకోగలరు.

'శ్రమజీవి'లో

'కన్నుమూసిన వాడికన్నా పుట్టబోయేవాడు ధన్యుడంటాం-ఇక ముందు!' కవికి భవిష్యత్తుపై గల ఆశకు పాఠకులు ఆనందం చెందుతారు. 'ఆశాపాశం'లో ఆశకు నిర్వచనం చూడవచ్చు.

'సాధనాల సహాయంతో
ఆకాశాన్ని ఎగిరే ప్రయత్నమే - ఆశ'

'ఉక్కు మనిషి' లో లాల్‌బహదుర్ శాస్త్రి సంస్మరణ ఆనందకరంగా ఉంది.

'అభ్యుదయం' లో

'అడుగకే అప్పిచ్చు
అంబుధి ఈనాడు
అయిపోయే కొసరేటి,
అంగట్లో కోమటే !

'అప్పిచ్చు' లో అందం ఆ పైన వ్యంగ్యమయింది. స్పష్టత కూడా తగ్గింది.

కవితారూపం, నన్నయ కాలం నుంచి ఆధునిక యుగందాకా అనేక పరిణామాలు పొందిందని కవి చాటి చెప్పటం బాహాటంగా కనిపిస్తుంది. ఈ సంపుటిలో అది ఈ కవి కవితా స్థితి అర్థం చేసుకోవటానికి చేస్తున్న ప్రయత్నం.

ఈ కవికి ప్రతిభ వుందని 'చీకటి నుంచి' వచన కవితల సంపుటి తెలుపుతుంది. లోకశాస్త్ర కావ్యాదవేక్షణం అయిన వ్యుత్పత్తి ఆర్జించుకొనే కృషి అర్థమవుతుంది. ఈ రచన చక్కని కృషి! సమగ్ర జీవిత దృక్పథంలో ఈ కవి రచించే కావ్యం కోసం రసజ్ఞులు ఎదురుచూస్తారు.

# 13. విరిగిన కలలు

కథానాయకుడు కిరీటిరావు, ఉరఫ్ క్రిస్టాఫ్ శ్రీ జనమంచి రామకృష్ణ 'విరిగిన కలలు' నవల అంతటా కన్పిస్తాడు. అక్కడక్కడ ఇతరేతర పాత్రలు కన్పిస్తాయి. నవలలోని సంఘటనలు అన్నీ అతని కోసమే జరుగుతాయి, ఎక్కడో తప్ప. కథ కిరీటిరావు పాత్ర పోషిస్తున్నంతసేపు సామాన్యంగా సాగిపోతూనే వుంటుంది. నవల మధ్యనుంచి కనిపించే ఇతర పాత్రల మనోభావాలు, భావ పరిణామాలు పఠితృ హృదయం కదలిస్తాయి.

కిరీటిరావు ఏక పాత్రాభినయం చేయగల వ్యక్తి. నవ్వు పుట్టింపగలడు, ప్రేమింపగలవాడు, పెళ్ళాడగలవాడు. అందులోనూ ఎండకన్నూ, వానకన్నూ, ఉప్పుకారంకన్నూ ఎరగని అనూరాధను, 'మహాగడుగ్గాయిని' పెళ్ళాడాడు. ఇంకా ఆడాడు. శోభతో డాన్సు ఆడాడు. అంతేనా ? ఇల్లు విడిచి పారిపోయాడు. కారణం చిత్రకళ ! బొమ్మలు గీయగలడు. గీశాడు. కొంపముంచుకొన్నాడు. అది ఎరుగడు. అనుకోవటమే తడవుగా సైన్యంలో చేరాడు. సంవత్సరంలో మేజర్ అయ్యాడు. ఆ పైన చాలా అయ్యాడు. రచయిత అయ్యాడు. నటుడు అయ్యాడు. ఏకపాత్రాభినయం తరువాత ఏమయ్యాడు? మిగతా కథ యీ నవలలోని పెంది పేజీలపై బ్లాక్ అండ్ వైట్‌లో చూడండి. విషాదం. అనేకమైన మంచి లక్షణాలు ఉన్న వ్యక్తి పతనమైపోతే చివరకు సానుభూతి కలుగుతుంది. కోపం వస్తుంది. దిగులుగా వుంటుంది, నవల ముగింపు వేఘావృత తటిల్లతలా వుంది.

నవలలో అసంగతాలు అధికంగా వున్నాయి. రంగస్థలంమీద ఏకపాత్రాభినయం చేయవలసిన నటుడు, ప్రేక్షకులలో కనిపించటం-అక్కడ నటించటం-ఆ పద్ధతి ఇతరేతర స్థలాలలో రెండుసార్లు వ్రాయడం విచిత్రంగా వుంటుంది,

విద్యార్హతలు చూడకుండా ఎవరినీ ఒకేసారి మేజర్‌గా సెలక్టు చేయరు, సైన్యంలో. ఒకవేళ సెకెండు లెఫ్టినెంట్ కాకుండా లెఫ్టినెంట్‌కాడు. లెఫ్టినెంట్ అయితే కాప్టన్‌గా కాకుండా మేజర్‌గా ప్రమోట్‌కాడు. అదీ ఒక్క సంవత్సరంలో జరగదు. ఖచ్చితంగా ఫలానావ్యక్తి యుద్ధంలో చనిపోయాడని తెలియకపోతే భారత ప్రభుత్వం ఆ వ్యక్తి చనిపోయాడని ప్రకటించదు. చనిపోయా, చనిపోకో ఉనికి తెలియకుండా వుంటే కన్పించటం లేదని ప్రకటించవచ్చు. చైనీయులకు బందీగా చిక్కి తప్పించుకోవటం తేలిక కాదు. హిమాలయ పర్వతాలలో నిరాహారంగా, నిరాధారంగా, ఎవరూ లన్నిరోజులూ, అంత దూరం ప్రయాణం చేయటం సాధ్యం కాదు. ఇటువంటివి చాలా ఉన్నాయి.

పై అసంగతాలు ఎందుకు కల్పింపవలసి వచ్చిందంటే, బొంబాయిలో కిరీటిరావు చైనీయుల జీవితం చిత్రించి నాటిక అభినయించటానికే! అయితే దానివల్ల నవలలో సాధించిన ప్రయోజనం మృగ్యం. చిత్రలేఖనం విషయంలో భార్యాభర్తల మనస్తత్వాభినయమే నవలకు ముఖ్యం-ప్రాణం.

అనూరాధ కథ అన్యాయంగా వుంది. ప్రప్రథమంగా విశ్వవిద్యాలయ కళాశాల సాంస్కృతికోత్సవాలలో ఆనందరావు ప్రక్కనే కన్పిస్తుంది. (అప్పటి కామె అక్కడ చదువుకోవటం లేదు. ఎప్పుడూ అక్కడ చదువుకోలేదు. నవల మధ్యలో బెనారస్ మెట్రిక్ పరీక్ష వ్రాస్తుంది. ఆనందరావు బంధువై వుండి, అతను తీసుకురాగా, హైస్కూలులో చదువుకొనే, లేక చదివే వయస్సులోవున్న ఆమె వచ్చివుంటుంది. ఇదంతా పాఠకులు వూహించుకోవాలి. అలా వూహించు కొంటే మరో కష్టం వుంది. అక్కణ్ణుంచి ఆమె వయస్సుకు మించిన పనులు చేస్తుంది) ఆమె కృష్ణారావు కుమార్తె. పెళ్ళైడు కెదిగింది. సంబంధాలు వచ్చాయి: తపీతపీమని తేల్చిపారేసింది. తర్వాత కిరీటిరావును పెళ్ళాడింది. ఆపైన ఆనంద రావును పెళ్ళాడింది. అవస్థల పాలయింది.

కృష్ణారావు తొట్టివైద్యం కూతురు జీవితంమీద చాలా ప్రభావం చూపింది. తల్లి మాటకూ, అనూరాధకూ ఆమడదూరం. అనూరాధ కృష్ణారావు కూతురుగా

తప్ప, ప్రత్యేక వ్యక్తిత్వం పదుం సగందాకా ఏర్పడలేదు. ఆమెలో స్వతసిద్ధ సుగుణ విజృంభణ కలిగినప్పుడు, అగ్నిరేఖలాగా కనిపించి, అంతలోనే ఆమె మంచుకంటే చల్లగా, చప్పగా, నీరు కారిపోవటం ఆశాభంగంగా వుంటుంది.

అన్ని పాత్రలూ- అన్ని సంఘటనలు రచయిత సృష్టించింది కిరీటిరావు కోసమే. అతను సెంట్రిపేటల్ పాత్ర. రచయిత అత్యవసరంగా సృష్టించిన పాత్రలు శోభ, ఆనందరావు, జమాలుద్దీన్. ఇది కిరీటిరావును తీర్చి దిద్దటానికి ఉపయోగపడాలని రచయిత ఉద్దేశ్యం. అయితే ఆ పాత్రలు ధిక్కరించాయి. అకస్మాత్తుగా తలయెత్తాయి. స్వాతంత్ర్యం పొందాయి. సజీవ పాత్రలయ్యాయి. ఈ విషయంలో రచయిత అభినందనార్హత పొందినట్లే!

సంఘటనలో బలం తక్కువగా కనిపిస్తుంది. కిరీటిరావు, అనూరాధల సంసార జీవితం రెండు జీవిత విధానాల సంఘర్షణ. శోభ చిత్రం గీయటంతో ప్రారంభమైన దశ జాలితో నిండి వుంది.చివరకు అనూరాధపట్ల కలగవలసినంత జాలి కలగదు. తానెరుగని నిందకు గురియైన శోభ కిరీటిరావును రక్షించాలని వచ్చి నిఫల మనోరథంతో ఏమైందో తెలియదు.

కిరీటిరావు అస్సాంలో శోభకోసం అన్వేషించిన తీరులో, వర్షంరాత్రి ఎదురైన వ్యక్తినిగూర్చి ఆనందరావు అడగదగిన విషయంగూర్చి అనూరాధ ఆలోచించిన విధానంలో, మనస్తత్వ పరిశీలన వుంది. ఆనందరావు రెండో పెళ్ళికి సంసిద్ధుడు కావటం, కిరీటిరావు గొండాయిలో పడిన పాట్లూ జీవిత దర్శనంతో కూడుకొన్న సమర్థవంతభాగాలు.

ఆనందరావు భార్య అనూరాధను, కిరీటిరావు వాన వచ్చిన రాత్రి అనుకోకుండా కలుసుకొన్న సంఘటన దాని పూర్వాపరాలు అక్కడ పాత్రం మనః పరిణామాలు పాఠకులు ఉత్సుకతతో చదువుతారు. ఆ రాత్రి మొదటి భర్తను చూడటం, రెండో భర్త రావటం, ఆమె వ్యథ,భీతి మరింత స్పష్టంగా వ్రాసివుంటే గుండెలు పిండినట్లుండేది పాఠకుడికి. ఇద్దరు భర్తలు-ఆమె-ఆ స్థితిలో ముగ్గురినీ,

ఒకే సమయంలో, ఒకే స్థలంలో, అటువంటి పరిస్థితిలో సమావేశపరచి, రచన సాగించటమంటే రచయితకు అగ్నిపరీక్ష. రచయిత ఆ పరీక్ష ఎదుర్కొనలేదు. తప్పుకొన్నట్టే! అసలు, ఏ సంఘటనలోనూ ఎక్కువ పాత్రలను రచయిత ప్రవేశపెట్టలేదు. ప్రవేశపెట్టినా రెండుపాత్రలకంటె ఎక్కువ పాత్రలు స్పష్టంగా కనిపించవు.

భర్త పున్నస్త్రీ కారణాంతరాల వల్ల మరొకరికి భార్యఅయి కాపురంచేస్తూ తను గాఢంగా అభిమానించిన, ప్రేమించిన (అభిమానిస్తున్న, ప్రేమిస్తున్న) మొదటిభర్తను అనుకోకుండా చూచి, మళ్ళీ చూచిపొందిన పరిణామం తెలుగు నవలల్లో క్రొత్తదనమే.

శిక్ష తలదాల్చే క్లైమాక్స్‌ను చూస్తుంటే గుండె కరగవచ్చు. నవలముగిసే ముందు పాఠకులు భావశాబల్యంలో మునిగిపోతారు. నవల చివరి సంఘటనలు చదువుతూ పాత్రల మనోభావాలతో పాఠకులు తాదాత్మ్యం చెంది, ఐక్యం అయి పోతారు.

కిరీటి రావు ఉన్నతంగా ఉంచాలనుకొన్న సంఘటనలు వాస్తవానికి దూరంగా వున్నాయి. రచయితకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పరిచయంలేని సంగతులు, అందులోనూ వివరాలు చెప్పవలసిన విషయాలు వీలైతే వ్రాయటం తప్పించుకోవాలి. లేకపోతే సేకరించాలిగానీ, అసహజంగా, అసంగతంగా, వాస్తవానికి దూరంగా వ్రాయకూడదు. మిలటరీ విషయంలో రచయిత వ్రాసిందంతా అసహజం.

లంచేరావు, హాస్యంకోసం, అసహజ పనులు ఆపాదించుకోకూడదు. కిరీటిరావు ఇల్లువిడిచి పారిపోవటం, కోర్టులో శిక్ష తలదాల్చటం హేతుబద్ధంగా లేవు. ప్రశ్నించుకొంటే సరియైన సమాధానం రాదు.

కిరీటిరావు చాలా అసహజమైన పనులు చేశాడు. దానికి సమన్వయంగా ఇటువంటివారు లోకంలో చాలామంది వున్నారు, వాళ్ళేపని ఎందుకు చేస్తారో

ఆలోచింపరు, వాళ్ళకు త్యాగం చేయటమే తెలుసు, అందులోనే ఆనందం పొందను కొంటారు, అవ్యవస్థతలో వుంటారు, ఆలోచింపరు, ఇతరులు ఏమనుకుంటారో అని తమకు తామే ఇతరులు అనుకొనేది అనుకొని శిక్షించుకొంటారు. కిరీటిరావు ఆ కోవకు చెందిన వ్యక్తే అనుకోకతప్పదు. ఏ మనిషి ఏ సమయంలో ఎందుకు ఏవిధంగా ప్రవర్తిస్తాడో మానసికంగా, సామాజికంగా, ప్రావర్తికంగా, ఆలోచిస్తే తప్ప అర్థం కాదు. ఆ అర్థంకానితనమే కిరీటిరావు. యువతరం అవ్యవస్థకు ఈ ఈ పాత్ర చక్కని ఉదాహరణ.

నవలలోని పాత్రలకు ఆత్మీయతా, అభిమానం వున్నాయి. శోకాత్మక కారుణ్యం వుంది. ప్రేమభావంతో, తదభావంతో దందహ్యమానమయ్యే హృదయాలూ వున్నాయి. సమర్పణతో అర్థం చేసుకోవాలని, అర్థం చేసుకోబడాలనీ తాపత్రయం చూపే పాత్రలూ వున్నాయి.

ఇంకా హాస్యం వుంది. కొన్నిచోట్ల చెప్పపెట్టుకొన్నట్లుగా వుంది. నవ్వించిన పాత్ర కిరీటిరావు. నవ్వులపాలైన పాత్ర కృష్ణారావు.

జీవితంలో ఎదురుదెబ్బలు తిని, దెబ్బదెబ్బకు గుండె గాయపడి, గాయం లోంచి రక్తం రాకపోగా రాగోదయం అయ్యి, గుండె చితికి విషాదమూర్తులుగా మిగిలిపోయిన పాత్రలు రెండు. ఆ పాత్రలచుట్టూ చూపవలసిన జీవితం ఎంత విశాలం!

అతి సామాన్య విధానంలో రచితమైన ఈ నవలలో భార్య అనుమానానికి గురియైన భర్త సంచలించుబోయినప్పుడూ, అనూరాధను ఆనందరావు భార్యగా కిరీటి రావు చూచినప్పుడూ, తను కిరీటిరావును కాదని కిరీటిరావే, ఫ్రాఫ్‌గా కోర్టులో దోషిత్వం నెత్తిన వేసికొన్నప్పుడూ ఉద్వేగంతో పాఠకుడు ఉక్కిరిబిక్కిసలాడిపోతాడు.

కథాపథకం సగంనుంచి ఉదాత్తంగా ఉంది. కానీ రచన తదనుగుణంగా సాగలేదనే చెప్పాలి. పదరూపమూ, అర్థమూ సరిగా తెలుసుకోకుండా చేసిన పద ప్రయోగాలు కొన్ని ఉన్నాయి. శైలిలో సమత్వం లేదు.

భాషా విషయంలో రచయితకు జాగ్రత్త వుంది కానీ, అధికారం లేదు. తెలియని పదాలు పరిహరించుకోవటం ఉచితం. చాలా సార్లు ఎదురయ్యే 'యథా లాభంగా' బాధ కలిగిస్తుంది.

సంక్షిప్తత ఏ సాహిత్యంలో అయినా, ఏ సాహితీ ప్రక్రియలోనైనా, అత్యవసరమే! రచయిత వాక్యరచనలో చూపిన సంక్షిప్తత సంఘటనలో చూప లేదు. విశ్వవిద్యాలయ కళాశాలలో ప్రారంభమయిన నవల, జీవితంలో పరిపూర్ణ జీవితంలో ప్రవేశించి, ఒకానొక హృదయవిదారక సంఘటనతో ముగిసిపోతుంది. శోభను అర్ధ నగ్నంగా చిత్రించటంలోనే నవల పటిష్ఠత ప్రారంభమవుతుంది. తత్పూర్వ నవలా భాగం కాలక్షేపంగా మాత్రమే సాగుతుంది. నేటి యువకుల అవ్యవస్థకు రేఖా చిత్రం గీయబోయి, భంగపడి స్పష్టత పొందలేదీ నవల. మంచి రచన చేసే సామర్థ్యం వున్న ఈ రచయిత, అవకాశం వున్న ఇతివృత్తం ఎన్నుకొని, తదనుగుణంగా చేసిన రచన కోసం, ఈ రచన చదివిం తర్వాత ఆశిస్తుంది పాఠకలోకం.

# 14. కవితాపుష్పకం

ఏ వ్యక్తీ 'హృదయం కోసి ముక్కలు చేసుకోకూడదు'. 'ప్రతి హృదయం భిన్న సంస్కృతుల కూడలి' కావాలి. ప్రతి హృదయంలో 'అఖిల భారత కవి సమ్మేళనం' జరగాలి. శ్రీ దాశరథి తన హృదయంలో కవితా సౌధం నిర్మించి, రసికుల్ని ఆహ్వానించిన ప్రకటన గోచరమవుతుంది. ఆ కవితా సౌధం పుష్పక విమానం వంటిది. అందులో ఎందరు ప్రయాణించినా ఇంకా చోటుంటుంది. అందులో ఎక్కడానికి 'మంచి హృదయమే టికెట్టు.' సహృదయులు ఈ కవితా పుష్పకంలో నిరభ్యంతరంగా విహారం చేయవచ్చు.

తెలంగాణా తెలుగు వారికి వాడిదనంలో కవితా కైలాసం దర్శించిన శ్రీ దాశరథి, మూడు కోటుల నొక్క ముడి బిగించిన, సమైక్య భావాంకురాలు తిల కించిన శ్రీ దాశరథి, రుద్రవీణలు పలికించి, అగ్నిధారలు కురిపించి పాలితులకు, పాలకులకు కనువిప్పు కలిగించిన శ్రీ దాశరథి, ఇప్పుడీ కవితా పుష్పకం నిర్మించి, సహృదయాలు పూర్ధ్వలోకాలకు తీసుకుపోవాలని ప్రయత్నం. 'చీకటి యేనుగుల తలలు వంచే' 'ఋగ్గమనే బగ్గుల' 'దీప సుందరి'ని చేతబట్టుకొని, స్నేహమనే దీపాలు మనసులో వెలిగించుకొని, తైలాలూ, విద్యుత్తూ లేకుండా వెలిగే దీపాలు మనసులో చూచుకొని, 'కులభేదము, మతభేదము తెలియనట్టి నీవు'లైన 'పావు రాళ్ళ'తో ఆడుకొంటూ, 'హా నిరాశా నీపులారా, ఉదయమిది లేవండహో!' అంటూ పూల జెండాలు ఊపుతూ 'ప్రతి గుడిలో దయామ్మాన్ని ప్రతిష్ఠించిన ఈ లోకంలో ప్రతి మనిషిలో దైవాన్ని దర్శించిన పవిత్రులను పరికించి, 'మత ఫిరంగిలో మందు పెట్టి దట్టించేచోట పిచ్చుక పెంట నీళ్ళాడినతీరు' 'కైశ్య పిండితే జాలువారే కన్నీళ్ళు, గుర్తించి, జాతికి రెటీనా ట్రీట్‌మెంట్' జరిగిందని బాధపడి 'ఎన్నాళ్ళిలా హింస గెలుస్తుంది? ఎన్నాళ్ళిలా మంచి నశిస్తుంది?' అని శ్రీ దాశరథి కవిత ప్రశ్నిస్తుంది.

ఈ కవితా సంకలనంలో రసికుల్ని పరామర్శించేవి, ప్రశ్నించేవి, మళ్ళీ మళ్ళీ చదవాలనిపించేవి ఎన్నో ఖండికలున్నాయి. ఆ శీర్షికలలో ప్రతి పదం గుండెలు తాకుతుంది. అంతస్స్నాయువులు మీటుతుంది. ఆనంద లోకాలలోకి తీసుకుపోతుంది. రసానందసరసిలో మునకలు వేయిస్తుంది. ఎవరో పిలిచినట్టుగా, ఎవరో పలికినట్టుగా సుమారతీరంలో అవ్యక్త సంగీతంలాగా వుంటుంది. రసధ్వని ఘనులు ఋనక్కొల్పాయి, గుండెలో పులకేలం చేస్తుంది. 'అందని అనురాగగీతి' 'ఈ మధుమంజరి' గుండెను పిల్చిపిప్పిచేసి ఊపిరి పీల్చుకొంటాయి. 'అందని అనురాగ గీతి'లో కవి భావన పరమోన్నతం. 'మధుమంజరి'తో మానసిక వియోగం గుండెలపై నిప్పుల కుంపటి.

ప్రేమ పరిమళ హృదయపుష్పం వియోగ వ్యథతో గాలికి అందించి నంత పరిమళం సంయోగంలో అందించలేదు. శ్రీ దాశరథి కవితలో ఆవియోగ వ్యథకవితా వ్యథమై ప్రవాహిత మయింది. ఆ వ్యథ హృదయ కల్లోలినిలో పద లావిన ప్రతి తరంగం పరమానందకరం. ప్రతిపదం రసబంధురం. ప్రత్యక్షరం ప్రత్యక్షవియోగం.

"ఊర్వశికిని, ఆమె కొక్కటే భేదమ్ము
ఒకతె లేదు, ఒకతే ఉండి రాదు"

ఊర్వశి లేకపోయినా, కవుల కవితల్లో వుంది. 'ఆమె' రాకపోయినా శ్రీ దాశరథి కవితలో వచ్చింది.

'మధువు త్రావి త్రావి మత్తెక్కెనామెకు
మధువు త్రాగలేదు మత్తు నాకు'

అని కవిచెబితే ఎందుకూ అనిపిస్తుంది మనకు. అందుకే-

'మధువు త్రావిన పెదవులు మాకువలయు'

ఆ పైన జరిగింది చూచి ఇదేమిటంటే,

'గుండెనెల్ల, బీల్చుకొనుట నా కలవాటు'

అని చెలి ఎదురు తిరిగి చెప్పిన జవాబు!

ప్రేయసి, 'నయనాం గిన్నియలనిండిన ప్రేమ సుధారసమ్ము' గ్రోలి, 'చలియను పులిచేతులలో నరిగెడు ఆ లలన'కాపాడింతర్వాత కూడా అసంతృప్తి హృదయంతో-

'నన్ను చూచి కోపగించే కన్నులందలి కెంపులే తారాహారముగా గళమ్మున దాల్చవలెనని ఉన్నదీ'అని ఆశించి, 'పూచిన పొందళ్లు' చూచి విచారంతో-

"నీవు నడచిన దారిలోనే సందనం
నీ పదమ్ముల క్రింది మన్నే చందనం
నీదు మేను పదారువన్నెల కుందనం
నీకు లోకమే చేయుచున్నది వందనం!"

ప్రేయసితో ప్రియుడు పెళ్ళిగక్కుకొన్న మోహ పరితప ఆత్మను ప్రసాదించింది. ఆ ఆత్మవల్ల ఈ కవితా సౌందర్యం వెలుగొందింది.

ఉరుదూ, తెలుగు దాశరధికి రెండు కళ్ళు. ఆ కళ్ళకు కనిపించిన రమణీయ కవితా లతలు కవి కవితోద్యానంలో పూలు పూచాయి. ఉరుదూలో ప్రముఖంగా, హృదయాహ్లాదంగా ఉన్న కవితలు శ్రీ దాశరథి తెలుగులోనికి అనువదించడం క్రొత్త సంగతికాదు. ఈ సంకలనంలో అనువాదాలున్నాయి. 'శారిక' అనువాదమే అయినా కథా కథనంలో కవి నేర్పుకు ప్రతీక.

'విరహాగ్ని తీక్షణతకు కరిగిపోయితిని
విలపించు విన్వైనై మలగిపోయితిని' అనేవే
'తాగుబోతుదెవడోయి పువ్వుల
తోటలోనికి వచ్చెను?
కొమ్మలకు శివమెత్తె కోకిల
కూడ మత్తిల జొచ్చెను!' అనే 'జఫర్'నీ దాశరథి ఆంధ్ర రస హృదయుల అనురాగానికి అప్పగించడం చూడవచ్చు.

సమాజ జీవితం పండుగ రోజు క్రొత్తరుచి అనుభవిస్తుంది. ఒకే పండుగ మనిషికి కాలాంతరంలో కల్గించే ఆనందంలో మార్పు ఉంటుంది. ఒకే పండుగను కవి కాలక్రమంగా అనుభవిస్తూ పోతూ కవిత వ్రాస్తే ఆ కవితవల్ల కవి తన కవిత్వమూ నిలిచే అవకాశం ఎంతైనా ఉంది. ఇటనుంచి అయిన శ్రీ దాశరథి ప్రతి ఉగాదికి ఒక్కొక్క కవిత చొప్పున వ్రాసుకొంటూపోతే కొన్నాళ్ళకు ఈ తరం జీవితం చెప్పే ఉగాది కవిత వచ్చేతరం వారికి మిగిలి ఈ కవి భావ జీవితంలో ఆ విధంగాను జీవించే అవకాశం ఉంది. ఈ సంపుటంలో ఉగాది, సంక్రాంతి పండుగపై ఆరు ఏడు ఖండికలున్నాయి. అవి చూచిన తరువాత ఈలాంటివి ఈ కవి ఇంకా వ్రాయవచ్చునని పాఠకులు ఆశించటంలో అనౌచిత్యం లేదు.

ఈ రోజుల్లో ఈ వ్యక్తిని గూర్చి, ఆ వ్యక్తినీ గూర్చి నాలుగు మాటలు వ్రాసి, అది కవిత్వమని చెప్పి, పబ్బం గడుపుకొనే ప్రబుద్ధులు కవిలోకంలో కొందరున్నారు. అంతే దాని అర్థం కొందరు లేరు. ఆ లేని కొందరిలో శ్రీ దాశరథి లేకపోలేరు. ఈ కవి హృదయం కవితామయం చేసిన వ్యక్తులు సామాన్యులుకారు. అందుకే కవి హృదయం 'పూగించి, పలికురికిన కవితా సరసుల హృదయాలు ఉర్రూతలూగిస్తుంది.'

'స్వార్థశబ్దమ్ముకు నర్థమ్ము తెలియని రమ్యవిజ్ఞానవారథి అయిన గాంధీజీని,
'మా రైతు పొలాలలో
మా కవుల కలాలలో' అంతటా నిండిన నెహ్రూజీనీ,
'ధరలకు, సురాలయమ్మునకు దారులు వేసిన'
'మానవ మనస్సులలోని తమస్సులు
మటుమాయం చేసి మరో సూర్యుడు' అయిన రవికవినీ,
'ప్రతి దీపములో నీవే
ప్రతిఫలించినావు' అని అబ్దుల్ అహమ్మద్‌నీ,

'పరిమళాలు చిమ్మే హృదయపు అగరువత్తిని చేతబుచ్చుకొని' మిసిసిపీ విశ్వవిద్యాలయములో ప్రథమంగా పట్టభద్రుడయిన నీగ్రో జేమ్స్ మెండిరెనీ తన కవితాగానంలో అనురాగరంగాలుగా చేసి, తృప్తిగా పాడుతున్న మేటి సంగీత నిధి శ్రీ దాశరథి.

దాశరథి కవితాహృదయం ఉన్నతమైనది. దానికి అనుగుణంగా ఛందస్సు నొంగిన తీరు విశిష్టంగా ఉంది. కవికి ఛందస్సు అనువయిన విధంగా లొంగి పోయింది. వివిధ ఛందోరీతులు కవితకు ఆభరణాలుగా అమర్చాయి. కవికి, ఒయ్యారాలుపోయే, చెప్పినట్టు వినే పరుగులు తీసే భాష వుంది. భాష దాస్యం చేసింది. భాషపై ఎంతో అధికారమున్న కవి చేసిన ప్రయోగాలు కొన్ని కొంద రకు అసంతృప్తి కలిగించే అవకాశాలు లేకపోలేదు.

కవితలు ప్రసిద్ధ ఛందస్సులతో, ముక్త ఛందస్సులతో, వచనాలతో ఉన్నాయి. భాష గ్రాంథికంగా, విశిష్ట వ్యావహారికంగా ఉంది. గ్రాంథికంలో వ్యావహారికం, వ్యావహారికంలో గ్రాంథికం కంగాపులగంగా కలిసిపోయి చిరాకు కలిగించే స్థితిలేకపోలేదు. ఈ విధంగా వ్రాయటం ఈ కోవ కవులలో చాలా మందికి వుండటం ఆశ్చర్యంగా వుంటుంది. గ్రాంథికంలో మనిషి కాస్త, ప్రతి వాని యౌవ్వనము వంటి పదాలు కొంతవరకు రసహృదయులు సర్దుకుపోవచ్చు. కానీ ప్రజలల్లో హస్తాల్లో వంటి పదాలు, 'వాల్లే మనకు వెలుగు దాపుటా' వంటి పదాలు సహించలేకపోవచ్చు. మంచు పంకెలలు, బండరాళ్ళగొంతు ముడులు, గుండెదూడు, కంటి రెప్పల విసనకర్రలు, మంచు మంచు ముసుగు వెలుగు టూయలలు,కన్నుగిన్నెలు, కన్నులదోనెలు, ఇటువంటి పద ప్రయో గాలు ఎంతో వెలుతురు ప్రసాదిస్తాయి కవితకు. ఈ పదాల చాయలలో పై పదాలు మరుగున పడిపోవచ్చు. ఈ పదాలు కూడా కవి ప్రేమమయ కవిత్వ పరిసరాలతో గుండెను పులకరింపజేయలేకపోవచ్చు. సమాజ ధర్మం స్ఫురింపచేసే తావుల్లో శృంగార కవిత నిలబడక పోవచ్చు. శ్రీ దాశరథి పూర్ణకవితారూపం తిలకించినపుడు సరసుల హృదయాలలోకి కవి, కవితామూర్తి రసికుడి హృదయంలోకి, చొచ్చుకు పోయిం తర్వాత మంచి మనిషిగా మానవతా మూర్తిగా శ్రీ దాశరథి చిరంజీవి.

# 15. అకాండ తాండవం

గుండెలో ఒక ఇనుప గుండై
గొంతులో ఒక తరకు ముల్లై
నేడు నను వేధించునది
ఏనాడు చేసిన పాపమో

ఈ బాధ ఏ ఒక్క మనిషినీ ఉద్దేశించింది కాదు. యావత్ సమాజానికిది సమన్వయం. ఎక్కడా ప్రశాంతత, బాధాతీత ప్రశాంతత లేదు. ఎందువల్ల? అందుకే వివరణ. ప్రశాంతత లేకపోవటానికి ఒక కారణం.

నాటుచుంటివి జయపతాకలు
నేటి రణ నిహతుల సమూహం?
రేపెవండో నాటునీ గో
రీ పయిన్ తన గెలుపు జెండా!
గోరి కేగును జయము! జెండా
గుడ్డ చినుగును బూది మిగులును

యుద్ధాలు, యుద్ధోన్మాదత నాగరికల మానవ జీవితంలో అధర్మమయిన పాశవిక తత్వాలు, యుద్ధఫలితంకూడా నేర్పుగా ప్రస్తావింపబడింది. యుద్ధం లేకపోయినా దేశాలలో అశాంతి వుంది. అదెందుకు? మరొక కారణం.

వోయి! మూఢ మతావలంబీ!
ఉన్న దేవుండొకడె కాదా!
ఇన్ని మతములు, ఇన్ని కులములు
ఎందుకని కల్పించినావో!

అని ఆశ్చర్యం ప్రకటించిన కవి, సర్వమానవ సహూసత్వాన్ని కాంక్షించే కవి ఆత్మ ఘోషించింది. కుల మత ద్వేషం కల మనిషిని సంబోధించి,

అగ్ని కణమురా ద్వేషము! అది
ఆత్మ నాశం కరమురా! అని వివరణ

కవనీ, మేము నిర్ఘోష ప్రభుత్వమింపు రేగకు కట్టుపడటం ఇష్టం లేదు. పగకు తొంపై పగలు నీపై పడగ విప్పునని ప్రబోధం, సింహమయిన సింహమును హింసించి చంపదని తెలిసికొ కలిగించి నీకు పెరవాడు లేడు, నీకు నువ్వే శత్రువ్వు అని చెప్పి మిత్తితో చెర్లాడు నీ పెనుకత్తి నీ మెడపైనే పడుతుందని కవి హెచ్చరిక. సాధు నిర్మితమిల సంస్కృతి సాధు చోదితమెల్ల ప్రగతి అని హెచ్చరికల సమన్వయం. 'పారిపోయిన దరుము వాడే పారిపోవును తరుమబడుచో' అని లౌక్యం చెప్పి తేనెటీగలు కుట్టినందుకు తేనెనా పార్వోసుకొంటువు! తప్పు అలా చేయవద్దు అని, ఎట్టా తలలో పేనుపై ఊహింపనేర్తువు తలను వ్యక్తిని అని భక్తుణ్ణి ప్రశ్నించి కవి తెచ్చిన సారాంశం. ఒకని రుచికి మరొకని అభిరుచి, వొర్కి నెరుగని నిత్యసమరం.

ఈ సమరాతీత సమాజ సందర్శనం చేయటానికి అవ్యవస్థను ఆందోళనను అతిక్రమించాలంటే ప్రశాంత పరిధిలోకి మనిషి ప్రయాణం చేయాలంటే కవి దర్శించిన తీరాలు రెండు- ఒకటి స్త్రీ ప్రేమ, రెండు శివప్రేమ-

"భూమీ రాజ్యమదేల! నీ కిదే
ప్రేమరాజ్యము నేలుకోవోయ్"
"నీవు నావలె ఏల సుఖపడ
లేవురా ప్రేమోపరతిలో?"
"అంబుజమదే విరిసియున్నది
శీధ్నితము విరియించుకోరా!"

ప్రేమమయ జీవితము పట్ల కవికి ప్రగాఢ విశ్వాసం వుంది. ప్రకృతిని ప్రేమించు, తోటి వ్యక్తిని ప్రేమించు. స్త్రీని ప్రేమించు. నిన్ను నువ్వు ప్రేమించుకో! నీ చుట్టూవున్న జీవితాలను ద్వేషించటం కంటే ప్రేమించటం నేర్చుకో! ప్రేమలో శాంతి వుంది. ప్రేమలో ప్రశాంతత వుంది. ప్రేమయుత జీవితం జీవించటంలో ప్రేమలో జీవించటం కంటె ధన్యతలేదు- అని అఖండ తాండవంలో ఉదాత్త భావ శాబల్యం ప్రదర్శించే కవి శ్రీ బోయి భీమన్న.

త్రైత్వ పరమార్థల పరిపూర్ణత పరిశీలించు లక్ష్యాలంగా శివపారమ్యం పొందమనీ, శివశక్తిని ధరించి శివతాండవంలో లీనమయి శివతాండవమై తాండవ మూర్తి శివుడుగానై, మనిషే శివుడై పోవాలని, అవనినుంచి అనంతావధిలోకి మానవత్వం నుంచి దైవత్వంలోకి, నిర్జీవతనుంచి సజీవతలోకి, అశక్తతనుంచి అనంతశక్తిలోకి మానవుణ్ణి సాగిపొమ్మని, ప్రబోధించే 'గజ్జె'ల గలగలలు అఖండ తాండవంలోని ధ్వని తరంగాలు.

శివుణ్ణి 'ఆడి ఆడి ఆటలోనే అర్ధనారీశ్వరత నొందిన' మూర్తిగా 'పాట గానాభినయ రసయుత పరమ వేదానందరూపు' డుగా విశ్వ కామ మహా ప్రణేతగా 'తాండవ చక్రవర్తి'గా భావించిన కవి తాండవాన్ని, నిఖిల జగదిత వృత్తం'గా తలంచి ఆ తాండవంవల్ల 'అసమ తమసులు అడిగి పోవాలనీ, అచల పూర్ణ మహార్ణవం అమృత మంథర మహితం' కావాలనీ కోరుకొని అలా జరిగితే, నింపుకొందును నేను గుండియ నిండుగా నీ పద మృధూళిని' అని వ్యక్తీకరించిన తీరు దర్శనీయం.

ప్రణవ మూలైకైక నటరాట్ !
ప్రణయ లీలైకైక రసరాట్ !
ప్రాణ చాలన ఖేలన విరాట్ !
ప్రాణి దర్శన సూత్ర సమ్రాట్ !
కాలు కదుపుమ ! మువ్వ మెదుపుమ !

ఘల్లు ఘల్లున ఆడుమా !' ఆ శివతాండవం అఖండంగా సాగిపోవాలని 'అకాండ తాండవం' ఆత్మ.పరమాత్మలో తపన, ఆవేదన వున్నాయి. కారణం సమాజం సామాజిక శక్తులు, వాని వికృత చేష్టలు, వీటికి అతీతంగా మనిషి ఉండాలంటే ఎవరి పరిధిలో వాడు, ఎవరి జీవితం వాడు జీవించటం ఉచితమనీ, తన ప్రయత్నమూ మరొకరి బ్రతుకు నివ్వటం నాగరిక సమాజం నేర్చుకోవాలనీ, యుద్ధాలు మానవ జాతి మనుగడకు తగవనీ, ప్రేమించటం, ప్రేమ జీవితంగా చేసుకోవటం అలవర్చుకోవాలి లోకం. అని విశ్వసించి, ఆ విశ్వాసం వ్యక్తీక రించిన సమీక్ష శ్రేయస్కామి 'అకాండ తాండవం' కవి శ్రీ బోయి భీమన్న.

కావ్యం చదువుతున్నంత సేపు ఈ కవి పండితుడు అనిపిస్తుంది. ఎంతో చక్కని భాషలో భావ వ్యక్తీకరణ చేయగల ఈ కవి, ఈ వికృత రూపాలు ప్రయోగించటం ఏమిటి అనిపిస్తుంది. పూర్తి గ్రాంథికం సుందరంగా వుంటుంది. అంతా వ్యావహారికం అయినా అందంగా వుంటుంది. కొంత గ్రాంథికం కొంత వ్యావ హారికం వ్రాస్తే అంతగా బాగుండే అవకాశం లేదు. 'భాష విషయంలో సర్వ స్వతంత్రంగా వ్యవహరించా'నంటూ కవి 'పూర్వ రంగం' లో చెప్పినా ఈ విధమయిన భాషవల్ల కావ్యంలో విలువ తరిగే అవకాశం లేకపోలేదు. విభక్తి ప్రత్యయ దైర్ఘ్యం తగ్గించి హ్రస్వత ఆపాదించటం కానీ, ఉపసర్గలకు దీర్ఘత కలిగించటం కానీ స్వేచ్ఛకు నిదర్శనాలు కావు. కురూరపు అన్నది కురూరుపు అని వ్రాసి వుండవలసింది.

భావ వ్యక్తీకరణలో స్పష్టత అల్పాక్షరాలతో అనల్పార్థ రచన గల అకాండ తాండవం ఆనందం కలిగిస్తుంది. కొన్ని చోట్లలో పదాల అర్థం తెలిసినా కవి భావన అంతుబట్టక బాధ కలిగే అవకాశం లేకపోలేదు.

శివతాండవ జన్యమీ సమస్త విశ్వం అన్నది అక్షరార్థం, అయినా ధ్వని తదితరంగా ఉంటుంది. అందుకోసం ఈ అకాండ తాండవం ఆలోచిస్తూ చదవాలి. భవలీలా తాండవం శృంగార పరంగా సమన్వయించుకొంటూ చదవవచ్చు.

క్రొత్త ఛందస్సు ఏర్పరచుకొన్నట్లు, దానికి 'గజ్జె' అని పేరు పెట్టు కొన్నట్లు కవికి పూర్వరంగంలో చెప్పినా పాఠకులకు ఛందోవిషయకంగా వినూత్నత కనిపించదు. కానీ మార్పు గోచరిస్తుంది. ముత్యాల సరాలు అలతిగా మార్చి ఒక విధమైన ప్రత్యేక విధానం రూపొందించుకొన్న కవి, ఆ ఛందస్సుకు 'గజ్జె' అని పేరు పెట్టటంలోగానీ ఔచిత్యంగూర్చి పూర్వ ఛందస్సులలో అంతి మార్పులు చేయటంతో ముత్యాలసరాల ప్రత్యేక ఛందస్సు ఏర్పడిందన్న విషయం దృష్టిలో వుంచుకొని సరస పాఠకలోకం తీర్పు ఇస్తుంది.

కావ్యంలో చాలా ఉపమానాలు క్రొత్తగా ఉన్నాయి. చందమామను చద్ది అన్నం ముద్దగా పది తలంచితే రసజ్ఞులు స్వీకరిస్తారు. చందమామను 'షష్ఠి' అంటే ఎలా స్వీకరించాలో అలాగే స్వీకరించగలరా అన్నది సందేహం. నివృత్తి నిరపేక్షితం.

కావ్యంలో సిద్ధాంతీకరణాలు గమనార్హాలు. వ్యక్తంచేసిన భావతీవ్రత వెనుక గోచరమైన ధార్మిక దృష్టి, అది కలిగివున్న నిజాయితీ కావ్యానికి బలం కలిగించింది.

"తెలుగు ఎల్లలు దాటగల ఒక
డిప్వోనేన్ వెలిగించినావా?"

అని కవులను ప్రశ్నించిన శ్రీ బోయి భీమన్న ఈ "అకాండ తాండవం" 'పూర్వరంగంలో'లో 'నేను అబద్ధం ఆడలేను' అని చెప్పింది అక్షరాలా వాస్తవం.

# 16. హుసైన్ సాగర్

రచయిత్రికి జీవితంగూర్చి కొన్ని సిద్ధాంతపరమైన అభిప్రాయాలున్నా యనిపిస్తుంది. వాటి బాగోగులు ఎవరికి ఎలా అనిపించినా రచయిత్రి అభిప్రాయాన్ని విశ్వసించి రచనాజీవితంలో అమలుపరుస్తున్నట్లు కథలు చెబుతున్నాయి. 'ప్రేమ, పెళ్ళి' - వీటిని గూర్చి రచయిత్రి భావాలు వేరువేరు. పెళ్ళి అసహజం, అనవసరం అన్న భావన ప్రతి కథలోనూ ప్రత్యక్షమౌతుంది. ప్రేమ అనేది నిర్వచించటానికి అందుబాటులో ఉండదని ఎదుటి వ్యక్తితో మాట్లాడేటప్పుడు తన్మయత్వంవల్ల ఒళ్ళు మరచిపోవటం వంటివి జరిగితే ఆ వ్యక్తిలో ప్రేమ వున్నట్లు లెక్కగానీ, గౌరవం, భక్తి, అభిమానం వంటివి ఏం కలిగినా అది ప్రేమ కాదనీ, సర్వసద్గుణ సంపన్నురాలుగా అత్యంతానుకూలవతిగా కనిపించే భార్యలోనూ ప్రేమ లేకపోవచ్చునని ఆమె పెళ్ళికి పూర్వం తప్పకుండా ఎవరినో ప్రేమించి వుంటుందనీ, భర్తపట్ల విధి నిర్వహణా బాధ్యత నెరవేర్చటం చూసి ఆమెతో ప్రేమ పొందసుకోవటం ఆత్మవంచన అన్న రీతిలో రచయిత్రి వ్యక్తీకరించే అభిప్రాయ ధోరణి వింతగా వుంటుంది.

ఈ కథానికల్లో ప్రధాన స్త్రీపాత్రలలో సామాన్యంగా వాటిలో రచయిత్రి ప్రవేశపెట్టిన ఈ వింత గుణం కొంచెమో కొంతైనా కొట్టవచ్చినట్లు వుంటుంది. అంతేగాక, ప్రధాన స్త్రీ పాత్రలకు సాధారణంగా తల్లి దండ్రులు చిన్నతనంలోనే చనిపోతారు. పాత్రలు పుట్టింటి నుంచి-ఉన్న చోటునుంచి-పారిపోతాయి. అష్టకష్టాలుపడతాయి. 'దుర్మార్గం చేజిక్కపోయి తప్పించుక పారిపోయి, యువకుడి చేజిక్కి ప్రేమింపబడి, యిద్దరితో ఎవరికో పెళ్ళి ఇష్టంలేక, మళ్ళీ ఎక్కడికో జీవితంనుంచి పారిపోవటం వుంటుంది.' సాధారణంగా కథలన్నీ విషాదాంతాలో,

విషాదాంతతుల్యాలో, విషాదాంత తుల్యాంతాలో అవుతాయి. ప్రతి కథలో ఒక పురుష పాత్ర విస్కీ, అటువంటిది ఏదో మత్తు పానీయం తాగుతుంది. ఎప్పుడో స్త్రీ పాత్ర కూడా తాగి, తల తిరిగి పడిపోయింది.

ఈ రచయిత్రి కథానికల్లో ప్రవేశపెట్టిన తత్వం నిశితంగా పరిశీలిస్తే, వాస్తవికతా దృక్పథంతో ఆలోచిస్తే ఇలా అనుకోవచ్చు: స్త్రీ పాత్రకు ప్రేమించటం ప్రేమింపబడటం ఇష్టంలేదు. ఆరాధన ఇష్టం. తాను దూరమైపోతే, ఆరాధించే యువకుడు పిచ్చివాడై చచ్చిపోయే యువకుడు ఇష్టం. అలాగే తనకు దూరమైపోతే, వెర్రెక్కి అల్లాడిపోవటం ఇష్టం. మళ్ళీ క్రొత్త ప్రదేశం క్రొత్త జీవితం ఇష్టం. క్రొత్త పురుషుల సాంగత్యం అదీ అయోమయ దశకు ఎదగటం, అటువంటి వాళ్ళతో తన నారాధించే యువకుడి కథ చెప్పుకొని, గర్వపడి, వాళ్ళు ఈర్ష్య పడేటట్లుచేసి, వాళ్ళు బాధపడుతుంటే తాను బాధపడి, బాధలో ఆనందం పొందటం ఇష్టం.

రచయిత్రి ఇటువంటి పాత్రలు అనేకంగా సృష్టించటంవల్ల తను నమ్మిన అభిప్రాయం ఏదో ప్రచారం చేయాలనే ఆశ వుందేమో అనిపిస్తుంది. ఆ అభిప్రాయం వెనుక జీవితంలో ఎన్నో యెదురు దెబ్బలు, బాధలు ఉంటాయేమోనని విజ్ఞులు తలపోస్తారు. అలాగే జరిగింది. 'శమంత జీవితంలో ప్రబలమైన విషాద భారమున్నట్లు' శ్రీ పా.వెం. రాజమన్నారు భావం కాగా, ఒకానొక నిజమైన అనుభవాన్ని తనదిగానీ సన్నిహితులైన వారిదిగానీ....ఆ అనుభవాన్ని విశ్వజనీనత కలిగించే రీతిగా రచయిత్రి కథలల్లినట్లు శ్రీ ఆచంట జానకిరామ్ తలంచగా.... అనుభవ పరంపర జతపరచి, కొంత భావన రంగరించి కథలు వ్రాసి, వాటికి విశ్వజనీనత కల్గించటంలో శ్రీమతి శమంత జాణ అని ప్రకాశకుల పరిచయం.

ఈ కథలన్నిటిలో ఉన్న ప్రధాన స్త్రీ పాత్రల మనస్తత్వం వెనుక రచయిత్రి మనస్తత్వం నూటికి నూరుపాళ్ళు దాగివున్న విషయం సత్యసన్నిహితం. ఆ దృష్టి పరిచయాలు కల్పించాయి. అందువల్ల పాఠకులకు, రచయిత్రి జీవితంలో

కొద్దిభాగం ప్రతికథలోను చదువుతున్నామన్న అభిప్రాయం కలిగే అవకాశం వుంది.

ఈ ప్రకాశకులు శ్రీమతి భానుమతీ రామకృష్ణ కథలకు "శ్రీమతి భానుమతీ రామకృష్ణగారు" అని వ్రాసి, ఈ రచయిత్రిని పరిచయంలోనే శ్రీమతి శమంత అని వ్రాయటం అనుచితం. ఇద్దరు రచయిత్రుల పరిచయంలో ఆ వ్యత్యాసం న్యాయంకాదు. ఒకరిపట్ల గౌరవం, ఎక్కువ వున్నా లేకపోయినా సాహితీలోకంలో పరిచయం సమానంగా ఉండాలి. వారి, వారి రచనా వైశిష్ట్యం వల్ల పాఠకుల గౌరవం పొందుతారు. 'గారు' ప్రయోగించటం తప్పు అనటంలేదు. ఆధిక్యంగానీ, అనాధిక్యంగానీ వస్తుందని అనటంలేదు. అయినా ఉత్తమ సాహితీ సంస్థకు ఒక పద్ధతి అవసరం. ఒక రచయిత్రిని వ్యక్తిగా పరిచయం చేసేటప్పుడు చూపే గౌరవ విధానం మరో రచయిత్రికి కూడా వర్తించాలి. రచయిత్రులుగా వాళ్ళ అర్హత ఎటువంటిది అయినా వ్యక్తులుగా వాళ్ళు సమానులు. ఆ సమానత వ్యక్తం కావాలి. వ్యక్తి వ్యక్తికి విలువలు నిర్ణయించే వ్యత్యాసపు పద్ధతి ప్రకాశకులు మార్చుకొంటారని పాఠకులు ఆశిస్తారు.

శ్రీమతి రేవనూరి శమంత రచనలో అర్థంకాని ఆవేదన, తపస్సు గోచరిస్తాయి. ఆశకు అవధీ పరిధీ కనిపించక, నిరాశతో గుండెలు నింపుకుంటే అక్కడ అసంతృప్తత్వం, అమోమయత్వం ఎదురై బాధపడిపోతాయి పాత్రలు.

జీవితానికి ఒక అర్థం, ప్రేమకొక నిర్వచనం, పెళ్ళిని గూర్చి ఒక నిశ్చితాభిప్రాయం ఏర్పరచుకోవాలని పాత్రగతంగా రచయిత్రిచేసిన ప్రయత్నం స్పష్టంగా రూపొందలేదు. అలా రూపొందక ఒక పరిధికి అతీతంగా మిగిలి వుండటమే దాని గుణం. ఈనాటి యువతీ యువకులయిన రచయితలు, రచయిత్రులు సాధారణంగా వెలికిరాలేని అవ్యవస్థ నుంచి ఈ రచయిత్రి రావాలని ప్రయత్నించినా ఫలితం కథలలో కనిపించలేదు.

ఈ కథలన్నింటిలో రచయిత్రి కథ నడిపించటంకంటే పాత్రలో మనో గత భావాలరూపం లేఖల వలననో, చెప్పటం వలననో, అనుకోవటం వలననో వ్యక్తం చేస్తాయి. అందువల్ల పాత్రల హృదయం పాఠకులకు చాల సన్నిహితంగా వస్తుంది. పాత్రలో పాఠకులు లీనమయిపోయే అవకాశం వుంది.

కథాశిల్పం దృష్టిలో, వాస్తవికతా భావంతో పరిశీలిస్తే ఇందులో చాల రచనలు కథలు కావు. కథంలో బలహీనమైన సన్నివేశాలు తొలగిపోతే బాగుం టుంది. కొద్ది మాటలతో పూర్ణభావస్ఫూర్తి కలిగే పరిస్థితి వుండగా ఎక్కువ పదాలు వాడటం అనవసరం. వాక్యాలు సాగలాగటం తగ్గిస్తే పాఠకులకు విసుగు తగ్గుతుంది.

ఈనాడు వస్తున్న సినిమాల ప్రభావం రచయిత్రిపై వుంది. ముఖ్యంగా హిందీ సినిమాలు. కథలల్లటంలో, సంభాషణలు నడిపించటంలో ఆ ప్రభావం పాఠకులు గుర్తిస్తారు.

ఈ రచయిత్రి కథలతో కొంత పరిచయం ఉన్న తర్వాత కొన్ని డజన్ల కథలలో రచయిత్రి కథను పాఠకులు పోల్చుకొంటారు. ఈ రచయిత్రిమాత్రమే ఇలా వ్రాసే అవకాశం వుందనిపించే ఒకానొక వ్యక్తిగత ముద్ర ప్రతి కథలోను కనిపిస్తుంది. ఒక కథ కొంతవరకు చదివి తర్వాత ఏమవుతుందో కొంతలోకొంత పాఠకులు నిర్ణయించుకోవచ్చు. ప్రతి కథ ముగింపులో వ్యక్తమయ్యే అత్మీయతా విధానం ఒక్క విధంగానే వుంటుంది.

రచయిత్రిలో నిరాశావాదం ఉన్నట్లు కథలు చదివిన పాఠకులు భావించే అవకాశం వుంది. అది నిజంకాదు. ఆశావాదమే వుంది. ఆశావాదం అవకాశంగా లోపల, భయంవల్ల నిరాశవాదం తొంగిచూస్తుంది. కాని, రచయిత్రి నిరాశవాది కాదు. ఆశావాది. విషాదాంత రచనా విధానం కూడా ఆశావాద విజయంకోసం వచ్చిన నిరాశావాదమేకాని తపస్సంకాదు. పసకది కావాలని అంటే అత్యాశ అని అనుకొంటారేమోనని ప్రదర్శించే నిరాశ ప్రత్యక్షమవుతుంది. కాని, నిజంగా నిరాశ కాదు !

ఈనాడు కథలు వ్రాస్తున్న రచయిత్రులలో చాల మంది వ్రాయలేని సంలక్షణమైన చక్కని వ్యావహారికం శ్రీమతి రేవనూరి శమంత వ్రాయటం గమనించిన పాఠకులు సంతోషపడతారు. చాల వాక్యాలు ఎంతో కవితాత్మకంగా గోచరిస్తాయి.

కథా పథకం, సంఘటనలు, సంభాషణలు వాస్తవికతకు దూరంగా ఊహాలోకాల వ్యవహారాలుగా వుంటాయి. పాత్ర చిత్రణమాత్రం విశిష్టంగా ఉంది. సర్వసామాన్యంగా ఒక విధమైన అనాలోచిత జీవితం జీవించే స్త్రీలను చక్కగా ఈ కథలలో చిత్రించటం పాఠకులు గమనిస్తారు. స్త్రీ హృదయపు లోతులు తెలుసుకోవటానికి పాక్షికంగా ఈ రచనలు ఉపయోగపడతాయి.

ఊహాలోకాలలోంచి, వాస్తవిక జగత్తులోకి వచ్చి, సంభాషణలలో ఆలోచనలలో కవిత్వం పద్ధతి తగ్గించి, వస్తు వైవిధ్యం సముపార్జించి, దర్శించిన జీవితచిత్రణను అలంకారాలు పులమకుండా యథాతథంగా చిత్రించటానికి ప్రయత్నించి, జీవితంమీద ఒక సక్రమమైయిన నిశ్చలాభిప్రాయం ఏర్పరచుకొంటే ఈ రచయిత్రి మంచి కథాసృష్టి చేయవచ్చు. ఆంధ్ర సాహితీ లోకంలో ఉజ్జ్వల భవిష్యత్తు ఆర్జించవచ్చు.

# 17. రాగంలో రంగులు

ఈ సంపుటిలో పన్నెండు నాటికలు వున్నాయి. ఒకనాటిక రాగంలో రంగులు. అదే పుస్తకమకుటమైంది. అయితే మొదటి పేజీలో రాగంలోరంగులు అని వ్యావహారిక రూపం వుంది. అట్టమీద 'రాగములో రంగులు' అని గ్రాంథిక రూపం ఉంది. ఇలా రెండు విధాలు వుండటంలో రచయిత్రి ఇష్టమున్నట్లు భావించ నక్కరలేదు. ప్రచురణ కర్తలే అట్టమీది గ్రాంథికరూపానికి కారణం కావచ్చు. ఎందుచేతనంటే-ఎం. శేషాచలం & కో, యం. శేషాచలం అండ్ కంపెనీ అని. సికిందరాబాదు, సికింద్రాబాదు, సికింద్రాబాద్ అనీ, మచిలీపట్టణము, మచిలీపట్నం అని వేరు వేరు పుస్తకాలలోనూ, ఒకే పుస్తకం వేరువేరు తావుల లోనూ ప్రచురణ కర్తలు గుర్తించో గుర్తించకో ముద్రిస్తున్నారు. ముచ్చటగా పుస్తక ముద్రణ చేయించగల ఈ ప్రచురణ కర్తలు ఇటువంటివి రాకుండాచేస్తే ఇంకా బాగుంటుంది.

ఈ పన్నెండు నాటికలలో ఏ నాటికా రంగస్థల ప్రయోగానికి అనుకూలంగా లేవు. కొన్ని నాటికలు ప్రసారార్థం ఉద్దేశించినవిగా కన్పిస్తాయి కానీ, ప్రసారశిల్పం మృగ్యం. ఆకాశవాణికి శిల్పం సంగతి అక్కరలేదు! ఏ నాటికైనా ప్రచారం చేయగలదు. ప్రయోగార్హత కానీ, ప్రసార శిల్పం కానీ లేకుండా నాటికలు వ్రాయడంలో శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి అభిప్రాయం ఆలోచింప దగిందే!

ఒక వస్తువు, ఒక ప్రక్రియలో వ్రాయటానికి అనుకూలం కలిగివుంటుంది. ఏ వస్తువు, ఏ ప్రక్రియలో సూటిగా చెప్పే అవకాశాధిక్యం కలిగివుందో నిర్ణయించుకొనే బాధ్యత రచించేవారిమీద ఆధారపడి ఉంటుంది. కొన్ని నాటికలు కథానికలుగా వ్రాస్తే బాగా రాణించేవి. 'రాగంలో రంగులు' నాటిక కథగా వ్రాసి

వుంటే తెలుగు వేదానికి ఒక ఉత్తమ కథ లక్ష్యమై వుండేది. ఆమె ఉత్తమ కథానిక రచయిత్రి.

ఏ రచనకైనా వస్త్వైక్యం ప్రధానం. వస్తు వైవిధ్యం దోషం కాదు. వస్తు విస్తరణాధిక్యం గానీ, వస్తు విపులీకరణగానీ తప్పుకాదు, గుణం కూడాను. కాని అనవసర విషయాలు ఇతివృత్తంతో జత చేయడంవల్ల వస్తు గుణపాటిష్ఠ్యం తగ్గిపోతుంది. కొన్ని నాటికలలోని ప్రారంభ సంభాషణలు వస్తు పోషకు ప్రధానం కాదు. ఉదాహరణకు 'పచ్చీసు కాయలు'లో తారాదాయినీ, సులోచననూ పిలిపించిం దాకా, 'మగమహారాజు'లో రంగా ఇన్సూరెన్సు ఏజన్సీ విషయందాకా, 'రాగంలో రంగులు' ప్రారంభంలో భార్యాభర్తల సంభాషణ, ఇత్యాది రచనాశిల్పం దృష్టితో అనవసరంగానే కన్పిస్తాయి.

వాస్తవికతను సృష్టించాలని రచయిత్రి అటువంటి ప్రారంభ ఘట్టాలు ఏర్పరచి ఉండవచ్చు. సహజంగా ఏ ఇద్దరు వ్యక్తులు కలిసినా ప్రధాన విషయా నికి ముందు అప్రధాన విషయాన్ని మాట్లాడుకోవచ్చు. సమాజంలో ఎంతో, ఎన్నో జరగవచ్చు. ఏ సృజనాత్మక రచనయినా అన్నివిధాలా సమాజానికి ప్రతిబింబంగా వుండాలనేది సత్యమే. కానీ సంఘంలో జరిగే అన్ని సంగతులు, ప్రతిబింబాల్లాగా ఉండవలసిన రచనల్లో వ్రాయడానికి వీలుపడదు. ఈ పరిమితిని, పరిధి నతిక్రమించి రచింపగల రచయితగానీ, రచయిత్రిగానీ సాఫల్యం సాధించగల్గుతారు.

సాహిత్యంలో సమాజంలోని అసహజత ఉండవచ్చు. సమాజంలోని వాస్తవికత ఉండవచ్చు, ఉండాలి. కానీ సమాజం ఉండకూడదు. సమాజ ప్రతి బింబం మాత్రమే ఉండాలి. సమాజ సహజత ఉండరాదు. సమాజంలో వుండేది ప్రతిబింబం మాదిరిగా ఉండి, సహజత కలిగివుంటే సాహిత్య మవుతుంది. ఈ సంపుటిలోని ప్రతి నాటికలో నాటకీయత ఉంది. ఆ నాటకీయత పుష్కలంగా వుంది. మనస్తత్వం, భావం, సంఘటన, కథ, సంభాషణ, పరిణామం పొంది,

మార్పుచెంది మలుపు తిరిగినప్పుడు ఉత్పన్నమయ్యే నాటకీయత ఉంది. సుస్పష్ట మైన నాటకీయత నాశనం కాకుండా నాటకం పూర్ణంగా రచన సాగింపగలవారు విజయం సాధించిన వారవుతారు. ఈ రచయిత్రి శ్రీమతి ఇల్లిందుల సరస్వతీదేవి ఈ నాటకీయతను సంపూర్ణంగా సాధించినట్లే!

వాతావరణ కల్పనలో రచయిత్రి సిద్ధహస్తురాలు. సాధారణంగా సంస్కృతాంగ్ల నాటకాల ప్రభావం తెలుగు నాటకంమీద పడుతుంది. కానీ ఈ నాటికలపై ఆ ప్రభావాలు ఏమీలేవు. అచ్చమైన తెలుగు వాతావరణంలో, తెలుగు ఇతివృత్తంతో అన్ని అందాలూ తెలుపడం నిలుపుకున్న నాటికలివి.

నాటికలలోని వ్యక్తులు పరిచితులుమాదిరిగా ఉంటారు. తెలుగువారిలో ప్రతి నిత్యం కనిపించే పాత్రలివి: ఈ పాత్రలన్నీ-వీళ్ళంతా తెలుగువారు-వచ్చీసుకాయలు ఆడుతూ సొచ్చులు చెప్పుకొనేవాళ్ళు, అత్తల మాటలకు గోరెత్తరని అవస్థలు పడే కోడళ్ళు, నాలుగో సంతానం కూడా ఆడపిల్లే అయితే, మండిపడే అత్తలు, భర్తలు; ఇలా భార్యాభర్తలు, అత్తా కోడళ్లు, పిల్లలు, తల్లిదండ్రులు అందరూ తెలుగువాళ్ళే-ఈ నాటికలలోని ఎక్కువ పాత్రలు తెలుగు వాతావరణంలో సహజంగా జీవించేవే. మునిమాణిక్యం - కాంతం, చింతాదీక్షితులు - వటీరావు, గురజాడ - పద్మావతి, సంధూరి-ఎంకి, భారతంలో సత్యభామ, వీళ్ళలో కాంతమ్మగారి పేరంటంలో చక్కని తెలుగు వాతావరణం సృష్టించి, సృష్టిలో స్త్రీ పురుషులమధ్య గాఢానురక్తికి చెప్పిన కారణం, కారణం కాదు రహస్యం స్వయంగా తెలుసుకోవలసి వుంటుంది.

ఈ నాటికలలో రచయిత్రి చూపిన విశిష్ట గుణం మనస్తత్వ పరిశీలన. ప్రతి పాత్రా మనః పరిణామం స్పష్టంగా దర్శితం. ఆ కారణంగా ఈ రచనలకు ప్రత్యేక స్థానం వస్తుంది. రచయిత్రికి ప్రత్యేక గౌరవం కలుగుతుంది. ఒక పాత్ర ప్రవర్తించిన పద్ధతిలో మరొక పాత్ర ప్రవర్తించలేదు. పాత్రల ప్రవర్తన దృష్టితో ఆలోచిస్తే, ప్రతి నాటికా, మనస్తత్వ పరిశీలనకొక మచ్చుతునక. 'రాగంలో రంగులు' మనస్తత్వ పరిశీలన కొక పరాకాష్ఠ.

నాటికలలో శృంగారం లేదు. ప్రేమ వుంది. సమర్పణ వుంది. జీవితం వుంది. కామభావం ఉండీలేనట్టుగా సంసార పక్షంగా ఉంది. హాస్యం కొంచెంగా అల్పంగా వుంది. తెలుగువాడి వాడి వేడి ఆవేశం, తొందర, తంపులుమారితనం, మూర్ఖత్వం, భేషజం ఉన్నాయి. తెలుగువాడి కష్టాలు, సుఖాలు, దిగుళ్ళు, తృప్తి, డాంబికాలు, దాపరికాలూ ఉన్నాయి.

పురుష పాత్రల్లోవుండే వైవిధ్యం కంటే స్త్రీ పాత్రలలో వుండే వివిధత్వం ఎక్కువ. నాటికలలో పాత్రలు మంచివీ, చెడ్డవీను, మూర్ఖమైనవీ కానివీను. తెలుగువారి పూర్ణజీవితం చూపే నాటికల సంపుటి 'రాగంలో రంగులు.'

భాష వ్యావహారికం. అక్కడక్కడా గ్రాంథిక భాషారూపాలు కనిపిస్తూ వుంటాయి. జీవితానికి దగ్గరగా వచ్చిన ఈ సంపుటిలో "నీ చేతులు తామర తూండ్ల కంటే మెత్తగా వున్నాయి. నీ కంఠము శంఖముకంటే మిన్నగా వుంది. నీ ముఖం చంద్రబింబాన్ని వెక్కిరిస్తోంది. నీనయనాలు కలువరేకులవంటి సోగ తేలివున్నాయి. సుకుమార సుందరమైన నీ శరీరము ముట్టుకుంటే మాసిపోదు కదా!" వంటి వర్ణనలు బాధను కల్గిస్తాయి. చేతులు తామర తూండ్లలో పోల్చటం మెత్తదనం కోసమా! కంఠం శంఖతో పోల్చడం, ఏ గుణం చెప్పటానికి? మిన్నగా వుంది అంటే ఎలా? ఇలాంటి ప్రశ్నలు పాఠకులకు కలిగితే, తామంతట తామే సమాధానం చెప్పుకోవలసి వస్తుంది. ఇది సంప్రదాయ ప్రభావం.

నాగరికత ప్రబలి తెలుగుదనం మరుగున పడుతున్న, మరుగుపరచుకొంటున్న ఈ కాలంలో తెలుగు వాతావరణంతో, తెలుగు వ్యక్తులతో, తెలుగు జీవితంతో త్రిగుణీకృతమైన నాటకీయత కలిగి, వెలువడిన ఈ నాటికల సంపుటి చదువుకోటానికి చక్కని పుస్తకం.

# 18. ఆరాధన

శ్రీమతి కోమలాదేవి నవల ఆరాధన వైద్యవృత్తి పట్ల గాఢాభిమానంతో, తెలుగులోలేని వృత్తినవలను వ్రాస్తున్నాను అనే సంతోష బలంతో, రచయిత్రి రచన చేసినట్లు ప్రచురణకర్తల అభిప్రాయం. ఈ నవలకంటే పూర్వం తెలుగులో వైద్య వృత్తికి సంబంధించిన కథలు చాలా ఉన్నాయి. ఉదాహరణకు 'కుంకుమ' చెప్పవచ్చు. 'హౌస్ సర్జన్' ఈ నవల ప్రచురితం అయిన తరువాత వెలువడింది.

రచయిత్రులు సాధారణంగా, వాస్తవికంగా కంటే, కాల్పనికంగా వ్రాయటం పరిపాటి. కల్పిత రచనలో వాస్తవికత లేవటంకంటే వాస్తవికతలో కల్పన పెంచటమూ అలవాటే. ఈ నవల ఆరాధన కల్పనీకరించిన వాస్తవికతకు ఆద్యంతం రూపాంతరం. నవల కథానాయకుడు కుమార్, కథానాయిక మంజుల, రచయిత్రి శ్రీమతి కోమలాదేవి. 'కోమలారత్నకుమార్' అంటే కోమలాదేవే. అందువల్ల పాఠకులు ఈ నవల ఆసక్తితో చదువుతారు. కథలో నాయకుడు డాక్టర్, రచయిత్రి అన్న డాక్టరు. అందువల్ల రచయిత్రి వైద్యవృత్తి సంబంధి పదప్రయోగంలో పొరపాటు పడివుండే అవకాశం తక్కువ అని మామూలు పాఠకులు అనుకోవచ్చు.

ప్రచురణకర్తలు నవల వైద్య వృత్తికే సంబంధించిందని భావించనక్కర లేదు. రచయిత్రి హృదయం వర్ణాంతర వివాహం. అందులకు వైద్యవృత్తి ఒక మార్గం మాత్రమే! ఈ వర్ణాంతర వివాహాలు కథా విషయంగా వున్న నవలల లెక్క కావాలా? కో అంటే కోటి కాదుగాని బోలెడు, చాలా వున్నాయి.

కథానాయిక నలుగురనుకొనే మాటల్లో గొప్పకులం అమ్మాయి. కథా నాయకుడు ఆ నలుగురు అనుకొనే మాటల్లోనే గొప్పకులం కాని అబ్బాయి. వీళ్ళు ఇద్దరూ మెడిసిన్ చదువుకొనే రోజుల్లో ప్రేమించుకొన్నారు. చదువుకొన్నారు, పెళ్ళి చేసుకొన్నారు. ఉద్యోగస్థులయినాక పిల్లలకు తల్లిదండ్రులయ్యారు. కుమార్

ఫారెన్‌కు వెళ్ళేసరికి ఒకమ్మాయి, ఇద్దరు కవలలు- అబ్బాయిలు వెరసి సంతానం ముగ్గురు.

కుమార్ స్థానం గొప్పగా రూపొందించటానికి మంజుల ప్రయత్నానికి రచయిత్రి సహాయం ఎక్కువ. అంతపూర్తిగా పూర్ణమనిషి లోకంలో వుంటే వాడు భారత భగవానుడు. కుమార్ గొప్పగా వుండే గొప్ప పాత్ర. మంజుల భర్తకులంకంటే గుణం గొప్పదని అన్నలకు, వదినలకు, అమ్మకూ, చెల్లెళ్ళకీ, నాన్నకూ చూపించే ప్రయత్నం చదువుతుంటే రామరామ వళ్ళు మంట పుట్టుకొస్తాయి. భర్త రక్తం ముగ్గురు పిల్లల రూపంలో ఉంటే చాలదు పొమ్మన్నట్లు తండ్రి రక్తంతో డాక్టరుగా, మహా మంచి మనిషిగా ఉన్న కుమార్ రక్తం ఎక్కించింది, అది తెలిసిన తండ్రి అయోమయ స్థితిచూస్తూ మంజుల పూర్తిగా ఆనందించటం చక్కని కల్పన. ఈ రక్తం మార్పిడి వ్యవహారాలు నవల్లో, సినిమాల్లో ఇప్పు డిప్పుడు మహా బాగా దర్శనమిస్తున్నాయి. ఈ విధంగా ఇటువంటి కొన్నికొన్ని సంఘటనలమూలంగా ఆ కుమార్ ఈ కుటుంబంలో కలిసిపోయేట్లు చేయాలనే మంజుల ప్రయత్నానికి రచయిత్రి తోడ్పాటు ఎంతో ఎక్కువ.

హాస్పిటల్ వాతావరణం పల్లెలో, పట్టణంలో, ఇళ్ళలో తదితరంగా రచయిత్రి, ప్రయత్నించి చేసిన కల్పనలో ఉన్నంతలో బాగా కనిపిస్తుంది. ఆ మందులూ మాటలూ, వాటి తీరుతెన్నులూ, రచయిత్రి చాలావరకు వివరంగా చెప్పటం పాఠకులు గమనిస్తారు. ఆడపిల్లలు పుట్టినా, మగపిల్లలు పుట్టినా ఆ ప్రతాపం అంతా పురుషుల్లోనే ఉందిగానీ స్త్రీలలో ఏమీలేదని శాస్త్రీయంగా రచయిత్రి చెప్పటానికి చేసిన ప్రయత్నం ఈ పురుష లోకానికి కనువిప్పు కలిగిస్తే, భార్యలమీద ఆడపిల్లలే పుట్టారని మండిపడటం ఆగడం చూసుకోవచ్చు.

నిజంగా నవలలో కథ చిన్నది. ఆ కథ చుట్టూ అల్లుకొన్న కథలు పెద్దవి. ప్రతి రోగికీ ఒక కథ: అన్ని కథలూ కలిపే డాక్టర్లిద్దరు భార్యాభర్తలు! మొత్తం మీద ఇది నవల. దీన్ని కావాలంటే నవలగా, అలాకాకపోతే కథల సంపుటిగా చదువుకోవచ్చు.

నవలలో చెప్పబడిన ఎన్నెన్నో కథలకు నవలతో ఏం సంబంధం ఉందో స్పష్టంగా తెలియకపోతే నవల నవలగా, కథలు కథలుగా వేరువేరుగా అవుతాయి. పాఠకులకు ఒక కథ ఎటువంటి మానసిక పరిణామం తెస్తుందో అంత మాత్రమే అంతకంటే కొంచెం తక్కువగా కథానాయకుడు, కథానాయిక మొదలైనవాళ్ళలో మార్పు తెస్తే అది సాధించే ప్రయోజనం నవలలో తక్కువ. పేరమ్మ కథ - కుష్టు మనిషి-కథగా బాగుండవచ్చు. నవలలో అనవసరం. అంత విస్తృతి అక్కరలేదు. కథైక్యం కొరవడుతుంది. ముసలివాడు-కూతురు-మనుమడు పెళ్ళి వాడు-ప్రెసిడెంటు-నెల తప్పటం కథ నవలతో అంతో యింతో సంబంధం ఉండటం మాట అటుంచి వాస్తవికమయిన భాగం. ఆ అమ్మాయికి నెల తప్పటానికి కారణం అందరూ చెప్పుకోవటానికి భయపడ్డట్టే రచయిత్రి భయంపొందితే ఎట్లా ! పొడిమాటల్లో, విడిమాటల్లో, పెడమాటల్లో చెప్పలేపోతే ఏం ? లేకపోతే, అదీ ఒక శిల్పమా ? ఏమయినా కానీ గానీ ముసలివాడు గొప్పవాడు. ప్రెసిడెంటు మరీను ! ఆ సంఘటనలు ముఖ్యంగా పల్లె వాతావరణం పాత్రలు. చక్కగా కళ్ళకు కట్టినట్లు కనిపిస్తాయి. పల్లె వాతావరణ చిత్రీకరణలో రచయిత్రి సిద్ధహస్త !

ఒక ఆమాయకురాలికి గర్భస్రావం చేయటానికి అడ్డు చెప్పిన నైతిక స్థాయి, వృత్తి ఔన్నత్యం మరొకరి విషయంలో ఏమయ్యాయి? స్వార్థం విలయ తాండవం చేస్తుంటే ఏలా ఉంటుంది మరి! రచయిత్రి ఉచితానుచితాలు గుర్తించిన తీరు లోక సహజంగానీ భిన్నం కాదు.

సినీతార ఆక్సిడెంటుకు ముందు ముఖమంతా అంతగా అందంగా ఉండి, వనజాక్షిగా పేరొంది, యాక్సిడెంట్‌లో చెవి, చెంప, పెదవి దెబ్బతిని మరింత అందంగా రూపొందిందో ఏమోగానీ మీనాక్షిగా మారిపోయింది. పేరు మారిపోయే, మర్చిపోయేంత చిన్న తప్పులు రచయిత్రికి ఇంత చిన్న తనంలోనే వస్తే ఎలా?

వర్ణాంతర వివాహ స్థాపన దృష్టిలో, వైద్య వృత్తి ఆలంబనగా రచయిత్రి శ్రీమతి కోమలాదేవి స్త్రీ హృదయ కోమలత్వం వ్యక్తమయేట్లు వ్రాసిన ఈ నవల 'ఆరాధన' నూత్న వస్తు శోభతో ప్రకాశిస్తుంది.

# 19. గంటలు

కొన్ని కవితా సంపుటులు చదువుతుంటే పరమానందం అయినా కలుగుతుంది. కాదంటే పరమాసహ్యం అయినా కలుగుతుంది. అలా లేదీ సంపుటి. కొన్ని కావ్యాలు చదువుతుంటే ఎక్కడో దోషాలు కనిపించి విసుగుగానయినా వుంటుంది. లేకపోతే ఎక్కడో కవితా సౌందర్యాలు కనిపించి ఆనందంగానయినా వుంటుంది. అలా లేదీ కావ్య సంపుటి. కొన్ని కవితా సంపుటాలలో అధికంగా దోష సమూహాలు ఎదురై బాధ అధికంగా నయినా వుంటుంది. కాకపోతే, ఎక్కువగా గుణాలు, చక్కని భావాలు గోచరమై, ఆనందం అధికంగా నయినా వుంటుంది.

శ్రీ పరెల్ల సత్యనారాయణమూర్తి రచించిన కవితం సంపుటి-గంటలు-ఈ విధమైన కోవ రచన. ఈ కవితా సంపుటిలో ప్రయుక్త భాషను గురించి చెప్పక తప్పదు. వ్యావహారిక భాష ఏదో, గ్రాంథిక భాష ఏదో స్పష్టంగా వేరుపరచుకొని, లబ్ధ ప్రతిష్ఠులే వ్రాయటంలేదు. శ్రీ మూర్తి అలాగే వ్రాస్తే ఎక్కువగా బాధ కలుగదు. పద స్వరూపము అర్థవంతంగా ఆలోచితం కాదు. ఇంగ్లీషు, తెలుగు పదాలు కలగాపులగంగా వాడవచ్చు. అయితే అలా ప్రయోగించటంలో నేర్పులేదు. లేకపోయినా ఫరవాలేదు. అలా ప్రయోగించటంలో ఏం అవసరముందో కూడా అర్థం కాని తాపులున్నాయి. పద పదార్థం గుర్తింపులో పసితనం కనబడుతుంది. ఈ కవితా సంపుటి సంతరించుకొన్న భాష, సర్వ సహృదయ హృదయామోదకరం కాకపోవటం బాధాకరం.

భావాల విషయంలో శ్రీ మూర్తికి వెనకడుగులేదు. కాని ఏ భావం ఎంత వరకు చెబితే సొగసో తెలియదు. చిన్న భావం వ్యక్తం చేయటానికి అనేక పదాలు వాడుకోంటే, భావ చాతుర్యం లేకపోయినా, భాషా సంఘటనం లేకపోవటంవల్ల

భావ తీవ్రత దెబ్బతినటమే కాకుండా, అర్థరహితమయిపోయింది. ఏ భావమయినా ఎంతో దూరం సాగలాగటం అనవసరం. హృదయం ఉద్రూపకాప కలిగిన భావాలు శబ్దశుద్ధి లేమివల్ల వ్యర్థమయిపోయాయి. వ్యక్తీకరణలో ఉదాత్తత లేదు. వ్యక్తిగతమయిన శైలి లేదు.

శ్రీ కరెళ్ళ సత్యనారాయణమూర్తిని, ఈ కవితా రచనకు ప్రోత్సహించిందీ, వ్రాయించిందీ, ప్రచురింపించిందీ-ఆవేశం. ఈ ఆవేశం శ్రీశ్రీ దగ్గర్నుంచి కొంచెం వచ్చింది. ఆత్మావేశం అధికంగా ఉంది. ఆవేశం అనాధీనమయినప్పుడు ఆలోచన తీవ్రతతప్పే అవకాశం లేకపోలేదు. ఆలోచనా మార్గం నిర్ణయించే ఛందస్సు శ్రీ మూర్తికి సమగ్రంగా తెలియదు. ఛందస్సు వున్నట్లు కనిపించడం ఆభాసం. ఆభాసం అనటం స్ఫూర్తిమంతం. ఆధునికాంధ్ర కవితా విహారానంతరం కలిగే హృదయ పరిణామం కవితా సంపుటిలోని ఛందస్సు.

శ్రీ మూర్తి ఆవేశం మువ్వన్నెల రామచిలుక. ఆ వన్నెలు అగ్నిశిఖలు, కిన్నెరవీణ, పాంచజన్యం, అభ్యుదయ కవిత్వం, భావకవిత్వం, దేశభక్తి కవిత్వం. కిన్నెరవీణతో పలికిన భావకవిత్వం కొంతలో కొంత మెరుగు! పాంచజన్యం ధ్వని ప్రక్కవానికి వినిపించకపోవచ్చుగానీ, అగ్నిశిఖలు మాత్రం చాలామంది చూడగలరు.

సర్వమానవతాభ్యుదయమావేశంగాగల శ్రీ మూర్తి భాషనుభద్రంచేసుకొంటే వెలువడే రచనలు సర్వజన ప్రీతిపాత్రా అవుతాయి.

ఆ సంపుటిలోని 'వివేకాగ్ని', 'విశాలాంధ్రోదయం,' 'కాహళి' 'జనశక్తి' 'రాగ రసమగ్నుడు' 'కవితా ప్రియుడు' శ్రీ మూర్తిలోని భావావేశానికే కాదు, ఉత్తమ కవితా హృదయానికి నిదర్శనాలు. పెద్దలను సహితం తలలూపించగల కవితా ఖండికలు.

'వెలుగుతున్నా ఒకకన్ణీ,
వెలుగుజాడలు తీయ,

వెళుతున్నా వెళుతున్నా;
సృష్టి గంటలు మ్రోయ!'

అని 'అన్వేషణ'తో బయలుదేరిన కవ్యాత్మ ప్రయోగించిన గంటల్లో గంటలు ఎక్కువగానీ మ్రోత తక్కువ. అయిదు పేజీల 'గంటలు' తో-

'ధరిత్రనిండా పలికే గంటలు
చరిత్ర అంతా తెలిపే గంటలు'

వంటివి హృదయ ధ్వనితో మిళితమై వెలువడేవీ అల్పంగా మాత్రమే వున్నాయి. ఇటువంటి భావాలు వేరుచేస్తే మిగతావి అన్నీ గంటలే! చెవులు గింగుర్లెత్తించే గంటలు, కన్నుల గిరగిర తిరిగే గంటలు, మూడున్నర పేజీల గంటలు.

'క్రాంతి పురుషుడు' తో 'శత్రుబాంబు విషగొంతు తెరిచింది' అని తెలుసు కొన్న శ్రీ మూర్తి 'ఐక్యతాయుధమెత్తి' 'సమిష్టిగా నడిచి'.-

'ఎంగిలాలోచనపరులు
దొంగ పూజా ప్రభుల' దండించాలని, అందుకు 'నేడే ఈనాడే' తో-

'తరతరాల సోమరితనాన్ని వీడి
నియమితమైన అక్షరాల్ని కూడి,
అనంతమైన పదాలతో ఆడి
శ్రేయో గీతాలను పాడా' అని తలపోయటంలో దోషం లేదు!

పై ఆలోచన పరమ రమణీయంగా ఉంది కానీ ఆచరణ గూర్చి ఆలోచన కలుగుతుంది. సహృదయులకు

'స్త్రీ
నిజాయితీతో
జీవించమంటే
పోదరా

వాడిడి సమాధులు
కట్టిన
ఈ లోకంలో

బాధగా — అని 'వక్రరేఖ'లో వ్యక్తీకరించిన భావం సరసులు స్వీకరిస్తారు. 'బాధగా' అన్నదానిని 'బాధకదా!' అనుకోవచ్చు. శ్రీ మూర్తి ఛందస్సును, వేదంటే ఒక క్రమతను, అనవరచుకొంటే, ఇటువంటి చక్కని భావాలు ఎంతో ముచ్చటగా చెప్పివుండవచ్చు కదా అనుకొంటారు.

'హేపీ న్యూయిర్' లో
'సరిగా వాడిన మానవ ఎనర్జీ
అస్తమించు ఈ కపుల మురార్జీ'

అంటే అర్థం తెలియవేదు. ఒక చక్కని భావం వ్యక్తీకరణలో అర్థరహితం అయిందా అనిపిస్తుంది. 'రవి గాంచనిచో' లో

'చలువరాతి రాజమహలులో
పేదవాని పూరిగుడిసెలో
కనుపించును నాకు రవిత్వం !

వినిపించును నాకు కవిత్వం !!' ఈ దృష్టి విశిష్టమయింది. ఇది అందరికీ అలవడవలసిన దృష్టి !

'సంక్రాంతి శోక సముద్రం' లో
'క్రాంతి పథం' లో గడిచే
లోకపు సంక్రాంతి నాడు
'శోక పథం'లో నిలిచిన

లోకపు విభ్రాంతి చూడు.' ఆ దృష్టితో ఈ దృశ్యం చూపటం, మనుష్యుల మనుగడకే అవసరం. ఆ సత్యం - సత్య సందర్శనం - తత్త్వదర్శనం - ప్రశంసాపాత్రం.

'కలికాలం' లో-

'మానవతకి భరతం పట్టి
క్రూరతకి హారతి పట్టి
వెలి వేస్తున్నది పాడు ప్రపంచం !
కల చేస్తున్నది నేటి ప్రపంచం!!' ఈ బాధను మనస్సులో వుంచుకొని-

'సేల్యూట్! సే....ల్యూ (ౖ) ట్!' లో

'బూర్జువాల విదివాదుల
చీకటి యుగ ధర్మస్మృతుల
శిథిలాలయ శిలాస్మృతుల
చిదికి పలిగి చితికిపడిన
గతచరిత్ర ఖజానాల
ప్రియమిత్రా రక్షక భటుల
రాజకీయ గజదొంగల
చదరంగం ఫేడౌట్!' — చెప్పి, భారతదేశంలో సైనిక ప్రభుత్వం ఆవశ్యకం అనే సూచన చేస్తున్న శ్రీ మూర్తిని ఆత్మపరిశీలన చేసుకోమంటూ చేసుకొంటూ ఆశ్చర్యంతో చూడటం తప్ప గత్యంతరం లేదు.

పై పంక్తులు శ్రీశ్రీ చదివితే 'తమ్ముడూ, నువ్వు పైకి వస్తా'వని ఆశీర్వదించవచ్చు, అందుకు మరొక కారణం కూడా వుంది. అది 'లోకానికు తెలుసు చూపు, రష్యాకు లేదు సాటి'! అని శ్రీ మూర్తి అభిప్రాయం.

'కాలంతోపాటు' మనుష్యులు మారిపోవచ్చునని ఒప్పుకోవచ్చు. భావాలు మారుతాయి అనీ ఒప్పుకోవచ్చు. అయినా

'అనార్కలి ప్రణయంలో నాడువుంటే కళ
అన్నార్తుల కదలికలో ఉంటిలే నేడు'

ఈ భావం సహృదయులకు ఒక ప్రశ్న! ఒక ఆశ్చర్యార్థకం! ఒక సమన్వయతాపత్రయం !

'నను కలచిన అనుభూతులు
ప్రస్ఫుటముగ కాంచువరకు
నిజముగ నే వొంగు వరకు................
ఇటులే సాగింతు తపము
నిజమిదియే నా వ్రతము అని 'కవితా ప్రియత్వం వ్యక్తంచేసి,
'నిర్దయనయనాలతోటి
చూచెదేల చెలి' అని సరస్వతిని లర్థిస్తున్న శ్రీ మూర్తి సత్యాగ్రహశీలిగా, తన ఉనికి గుర్తెరిగిన వ్యక్తిగా సరసులు గుర్తిస్తారు. ఈ లెవిడి శ్రీ మూర్తి భావి రచనా జీవితానికి అత్యంతావశ్యకం!

ఆంధ్రుల ఆత్మధనం అయిన ఆవేశం అధికంగాగల, అభ్యుదయ సమాజ సందర్శనం కాంక్షిస్తున్న శ్రీ కరెళ్ళ సత్యనారాయణమూర్తి భావాలకు చక్కగా రూపురేఖలు దిద్దుకొని, మంచిభాష అలవరచుకొని క్రమబద్ధంగా కవితా వ్యాసంగం సాగిస్తే భవిష్యత్తులో ఒక ఉత్తమ కవిని పర్శించే భాగ్యం ఆంధ్రదేశానికి వుంటుంది.

సాగిపోవటం లాంటివి ఈ నవలలో కనిపించవు. కానీ నృత్య నాటిక ప్రదర్శనలో మిష్టర్ చింతా చూపిన నేర్పు మరింత స్పష్టంగా వ్రాసి వుండవలసింది.

మిష్టర్ చింతా రెండంచులు గల పదును కత్తి! మాటపడడు. మాట అంటాడు. ఎన్నో చెబుతాడు. ఏదీ వినడు. చిరుతపులి వంటి మనిషిని పిల్లిపిల్లను చేస్తాడు. గమ్మత్తయిన, విచిత్రమయిన, విశిష్టమయిన పాత్ర మిష్టర్ చింతా!

'కన్యాశుల్కం'లో గిరీశం, మాష్టర్జీలో 'మాష్టర్జీ', 'ఇన్స్పెక్టర్ జనరల్'లో ఇన్స్పెక్టర్ - వీళ్ళతో మిష్టర్ చింతా పాత్రకు పోలికలున్నాయి. ఈ పాత్రకు ఆత్మగతావేశం, ఆ పాత్రలనుండి సంక్రమించి ఉండవచ్చు.

పనిలో పనిగా నాటక ప్రపంచంలో ఉండే కష్టసుఖాలు చెప్పటానికి రచయిత చేసిన ప్రయత్నం నవలలో గోచరమవుతుంది. మస్తాన్‌పాత్ర వున్నంతలో ఉత్సాహంగా తయారయింది. అతని భార్య కూడా అంత తేలికగా మరపురాదు.

హాస్యంకోసం సృష్టించబడినవే అయినా పాత్రలు చాలావరకు ఆ పరిధి నతిక్రమించని వ్యక్తిత్వం నిలుపుకొంటాయి. ముఖ్యంగా చెప్పవలసినపాత్రలు ఆ కోవలో రామలింగయ్యశర్మ.

ఒక ఉత్తమ రచయిత ఏ విధమయిన రచన చేసినా సమాజ సందర్శనం చేయింప గలడనీ, కళ్ళకు కట్టినట్లు పాత్రలను చిత్రించగలడనీ, ఈ నవల చదివింతర్వాత సహృదయులు పోల్చుకొంటారు.

శ్రీ పాలగుమ్మి పద్మరాజు ధ్యేయం హాస్యరస పరిపోషకంగా రచన చెయ్యాలని. అది నెరవేరింది. అంతేకాకుండా సమాజంలో కొన్ని పాత్రలు కళ్ళ ఎదుట ప్రత్యక్ష మవుతాయి.

ఈ నవల పరిపూర్ణంగా జీవిత చిత్రణ కాదనీ, కాలేదని తెలిసికొన్న రచయిత ఔచిత్య విచారానికి నిదర్శనం 'నా సంజాయిషీ'లో చివరి వాక్యాలు. 'అసాధ్యమయింది సాధించాలని పూనుకొన్నాను. నా వైఫల్యం మీ కర్పిస్తున్నాను. రచయిత పొందిన విఫల ప్రయత్నం 'బ్రతికిన కాలేజీ'. ఈ నవల చదువుతూ ఉంటే, ఖర్చుఅయిన కాలానికి సహృదయులు సాఫల్యం పొందుతారు.

# 21. దిండుక్రింది పోకచెక్క

ఈ నవలపేరు ఎవరు ఎవరితో చెప్పినా ఎందుకు నవ్వుతారో, ఆ నవ్వుకు అర్థం ఏమిటో స్పష్టంగా చెప్పటం, చెప్పినా వినటం కష్టం. ఈ నవల శ్రీ విశ్వనాథ సత్యనారాయణ వ్రాశాడు. అయితే రచయిత నవలా నామధేయానికి అర్థం చెప్పక పోలేదు. ఆ పురుషనియమం దామె నీరవజాతివనిత. ఆచారం ప్రకారం వేలా వృక్షపుష్పాలతో పెళ్ళి జరిగిన స్త్రీ, ఆమె ఎందరితోనైనా సంసారం చేయవచ్చు. ఆమెకు వైధవ్యం వుండదు. ఇష్టం లేనిచో "రాత్రి నిద్రలేచిన తరువాత తెలవార కడవాని తలగడ దిండుక్రిందపచ్చిపోక చెక్కను పెట్టును. వాడు దానిని చూచు కొని యింక తనకు నామెకు సంబంధము లేదని వెడలి పోవలెను."

ఈ ఆచారంగానీ, ఆచారం వున్నట్టు కల్పనగానీ బాగున్నా బాగుగా లేక పోయినా చింతలేదు. ఈ పేరుమాత్రం నవలకు తగింది కాదు అనిపిస్తుంది, సరస పాఠకలోకానికి ఇందులో కథవేరు. నవలపేరు వేరు. కథ కల్పన. వాస్తవంగా ఒకనాటి విషయం అనే అవకాశం చారిత్రాత్మకం కాదు. చరిత్ర తప్పుగా వ్రాయ బడింది అనేవాళ్ళతో మాట్లాడేందుకు ఆలోచించడం తప్ప ఆధారం ఏమీ ఉండదు. అయినా చరిత్ర లోపభూయిష్ఠం అని అంగీకరించినా, ఈ నవలలో ప్రతిపాద్య మైన విషయం హేతుబద్ధంగా కార్యకారణ సంబంధ సముపేతంగా లేదు.

శాక్యముని అనబడిన వాడు బుద్ధుడనీ, శాక్యముని అనబడ్డవాడు బుద్ధుడు కాడనీ, కాడు కాబట్టి మహాకడనీ, మహాకడంటే ఉత్తర దేశీయుడే కాడనీ, కాకపోతే ఆంధ్రుడనీ, అందువల్ల పేరు శాకయ్య అనీ, పిలవటంలో ఉండేలోపంవల్ల శాక్య అయిందనీ సింహం అంతపరాక్రమం ఉన్నవాడు గనుక శాక్య సింహుడు అనే పేరు వచ్చిందనీ, వాడు కపటయోగి అనీ కుత్సితుడనీ, బుద్ధుడిరూపం అనీ ఆ యోగికి తెలియకుండానే పేరువచ్చిందనీ, వచ్చినదాన్ని నిలబెట్టుకో ప్రయత్నిం

చాడనీ, పలుపురు వనితల మానహరణ చేశాడనీ, ఆ పాపం అతన్ని దహించిం దనీ, అతను కృష్ణ విరోధి అనీ-ఎన్నో అనరాని మాటలన్నీ నవలలో ఉన్నాయి. శాక్య సింహుణ్ణి గూర్చి ఏ చరిత్ర ఆధారం వల్లనూ ఋజువు చేయగలసత్యం కాదిది. ఇదంతా కల్పన. కల్పన ఏ విధంగా ఉన్నా చిక్కులేదు. చింతలేదు - కాబట్టి యథార్థ చరిత్ర దర్శనార్థం ఈ పుస్తకం ఎవరూ చదవరు. చదివినా చరిత్ర అంటే ఇదేనని నమ్మరు.

ఈ రచన కల్పనా ప్రాయంగా స్వీకరించి చదువుకోవటం ప్రారంభించి నపుడు కలిగే బాధ ఎందుకు ప్రసిద్ధమైన నామధేయం గురించి ఇంత దారుణ కల్పన చేయవలసి వచ్చిందా అని.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ వచన రచన పద్ధతి ఆంధ్ర పాఠక లోకంలో దాదాపు అందరికీ తెలుసు. ఆ పద్ధతి నిశిష్టమయింది అనలేకపోయినా విలక్షణమయింది. ఈ శైలి తెలియనివాళ్ళు ఇదేం పుస్తకం పాడు పుస్తకం అనే పరిస్థితివుంది. అలవాటుపడ్డ వాళ్ళు గాడిలోపడిపోతారు. ఆనందంగా చదువుతారు.

ఈ రెండో తెగవాళ్ళు పుస్తకం చివరిదాకా మూయరు. ఏం విషయ ముంది, ఏం చదివారు అని ఆలోచించకుండా చదువుతారు. ఆ శైలిలో ఉన్న ప్రధానగుణం అది. ఏవంవిధ రచనలోనే నవలా వైశిష్ట్యం నిక్షిప్తమయివుంది.

ఈ నవల చదువుతుంటే ఎదురయ్యే అనేక విషయాలలో అందరికీ ఆనందం కలిగించే విషయం ఒక్కటే! పాత్ర చిత్రణ. అదీ స్త్రీపాత్ర చిత్రణ! పాత్రలను కళ్ళకు కట్టినట్లు చిత్రించే నేర్పు రచయితకు ఉంది. ఏ పాత్ర అయినా కళ్ళలో నిలిచిపోతుంది. స్త్రీ పాత్రలలో ఉన్న వైవిధ్యం మనస్సును ఆకట్టుకొంటుంది. ఎన్ని స్త్రీ పాత్రలు సృష్టించినా, ఆ పాత్రలన్నీ ప్రత్యేక వ్యక్తిత్వం కలిగివుంటాయి. ఒక స్త్రీ పాత్రలాగా మరో స్త్రీ పాత్ర వుండదు. అంతేగాదు. ఏ సంఘటన, సన్నివేశం చిత్రించినా, రచయిత ఆ సంఘటన సన్ని వేశం దర్శనీయంగా దృగ్గోచరం అయ్యేట్టుగా చిత్రించే సామర్థ్యం నవలలో

కనిపిస్తుంది. వరద వర్ణన, శాకయ్య దహించుకుపోవటం, శాకయ్య తిప్పించను పట్టుకోబోవటం - ఇత్యాది సన్నివేశ చిత్రణ నేర్పుగా ఉంది. పతిత్ర భావనా హృదయం ఆ పరిసరాలకు పరుగులు తీస్తుంది.

ఈ రచయితతో వచ్చిన చిక్కంతా కథ పథకం, కథనదపటం, అపూర్వ సత్యాలు చెప్పాలని ప్రయత్నం. ఈ నవలలో రచయిత మొదటి అధ్యాయం వ్రాసిందెందుకో, చెప్పేదేమిటో అర్థంకాదు. అది మయం. అనవ సరం. మొదటిలో పరిచయమైన నిరాలంబ పట్టచివరిదాకా ఎవరో తెలియదు. అంతదూరాస్వయం అనవసరం.

శాకయ్యను బెదిరించిన - అర్ధరాత్రి బెదిరించిన వనిత-గీలా అని తెలుసు కోవటంగానీ, గీలాకి నిరాలంబ అని నామాంతరం ఉంది అనిగానీ 212 పేజీలో వున్న ఒక్కవాక్యం ఆధారం లేకపోతే అర్థంకాదు.

ఇంత డొంకతిరుగుడు - ఇంత అన్వయ క్లిష్టత అవసరంకాదు. ఈ నవల అయిదువేల సంవత్సరాలనాటి భారతదేశస్థితి వర్ణించే పనికి పూనుకొంది. మంచిదే! కానీ ఆ పని విజయవంతం కాదు.

ఈనాడు పల్లెల్లో ఉండే వాతావరణం ఆనాటి పల్లెల్లో ఉందనుకోవటం వీలుకాదు. కృష్ణానదిలో వరదవస్తే ఎలా ఉంటుందో, ఏనదిలో వరదవచ్చినా ఆ విధంగానే ఉండవచ్చుగానీ, అందులో కొట్టుకువచ్చే వస్తువులు అచ్చంగా కృష్ణలో కొట్టుకువచ్చినట్లే రావు.

రోడ్లమీద గారడీవాడు ఒక పసిపిల్ల మెడకోసినట్లు నటించి, గొంతు కోశాడని మనకు భ్రమ కలిగించి, డబ్బులు అడుక్కోవడం ప్రారంభించి, వెళ్ళి పోయేవాళ్ళను, పోతే మీకేపాపం అంటుకొంటుందని బెదిరించినట్లుగా వుంటుంది గోస్వామి ధోరణి. గోస్వామి నవలలోని ఉత్తమ పాత్ర!

నవల కాలం, మహాభారతకాలంతో సామీప్య సంబంధంచేత కురుక్షేత్ర విషయం కొంతలో కొంత ఈ నవలలో తీసుకురావటం-శ్రీకృష్ణ దివ్యత్వం-ఆ

ప్రయత్నం జరాసంధ వధ-వీటన్నిటితో నవలకు చారిత్రక స్థాయి ప్రసాదించాలనే సంకల్పం-ఉచితజ్ఞులయిన పాఠకుల సమక్షంలో వ్యర్థం అవుతుంది.

కపటవేషంలో సంచరించే శాకయ్య, భార్యనూ పిల్లల్ని వదలి ఉత్తర దేశం వెళ్ళినవాడు, చాలాకాలం జీవించాలని కోరినవాడు, ఎదురైన స్త్రీలను అనుభవించినవాడు, చివరికి అవస్థలపాలయినవాడు.

శృంగారం, సరసంగా ఉంటే సర్వజనామోదకరంగా ఉంటుంది. శృంగార వర్ణన ఉన్నప్పుడు అసహ్యం కలగటం పాఠకులు ఈ నవలలో పరికిస్తారు.

గీలాను తిప్పిం అనుకొని శాకయ్య ప్రవర్తించిన తీరు వేరుగావుంది. ఆ శృంగారం సరసతకు బదులు విరసత, ఆనందం బదులు అసహ్యం కలిగి స్తుంది. ఈ నవలలో కథానాయకుడు ఎవరన్నది పెద్దప్రశ్నకాదు. కొందరు గోస్వామి ప్రధాన పాత్ర అనుకొంటారు. అదికాదు. శాకయ్య ప్రధానపాత్ర! దుర్మార్గానికి బలయిపోయిన పాత్ర!

రచయిత ఈ నవలలో చాలా అపూర్వవిషయాలు చెప్పాలని చేసిన ప్రయత్నం ఎక్కువగా ఉంది. రాజులు-రాజ్యం-పాలనవంటి సామాన్య సంగ తుల మీద రచయిత అభిప్రాయాలు పరస్పర విరుద్ధంగా, పరిహార్యాలుగా కవి పిస్తాయి.

యుగ లక్షణాలు ముఖ్యంగా కలియుగ లక్షణాలు రచయిత చెప్ప టానికి చేసిన విఫలప్రయత్నం ఆస్వాద యోగ్యంగానే ఉంది. చెప్పిన విషయం పాతదే అయినా చెప్పిన తీరు క్రొత్తది. కొన్ని క్లిష్టమయిన శాస్త్రాలు ఈ రచ యిత స్పష్టంగా చెప్పగల నేర్పుగల పండితుడు అని అందరూ అంగీకరించే తీరు ఈ నవలలో కనిపిస్తుంది.

అయిదువేల సంవత్సరాల పూర్వం జరిగిన ఈ నవలలో గోస్వామి అనే మంచి పాత్ర దుష్టతను, శాకయ్యకు సంబంధించిన శృంగార దుష్టతను ఖండించిన పాత్ర, శాకయ్యతో పలికిన పల్కులు 'అయిదువేల సంవత్సరాలు గడచిన తరువాత నాంధ్రములలో నొక మహా గ్రంథకర్త యుదయించును. నీ యదార్థ స్వరూపమును నిరూపించును.... వాడు కొద్దిలో జ్ఞానాగ్ని దగ్ధకర్ముడు.... శివకేశవు లకు పరమభక్తుడు. బ్రహ్మపదార్థ జ్ఞాత.... ఇప్పుడు వానిపేరు గోస్వామి, అప్పుడేమో - వాడువాస్వామి వాప్పలి. ఆ వాక్కు సంస్కృత వాక్కు కాదు. అప్పటి కాంధ్రభాష పుట్టుండునో అది వానివాక్కు. అదివాడు చేసుకొనిన పురాకృతకర్మము. తనకోపము సంతయు సధర్మము సంద తీర్చుకొనుచుండును. నీ మీద కూడ తీర్చును, అని 239, 240 పేజీలలో రచయిత వ్రాసిన దీరు తననుగూర్చి తాను కల్పిత పాత్ర ద్వారా చెప్పుకోవటంలేదు కదా అనిపించక మానదు.

పండితుడు అయిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గ్రాంథికంగా నవలా రచనచేస్తూ వ్రాసిన భాష అంతా చిన్నయసూరి వ్యాకరణ బద్ధం కాదు! ఎన్నో వ్యతిక్రమణలు.

మహోత్తమ రచనలు చేయగల శక్తి సామర్థ్యాలు, ప్రతిభా వ్యుత్పత్తులు ఉన్న కవి, పండితుడు, నవలారచయిత, వ్యాసకర్త, తనకున్న భాషాధికారం, పాత్ర చిత్రణ నైపుణ్యం, కథాకల్పనా చమత్కారం ఎలా అనవసరం, వ్యర్థం. పనికి మాలినవి అయిన పుస్తకాల రచనలో పాడుచేసుకొంటున్నదీ చూడాలంటే చదవవలసిన పుస్తకం 'దిండు క్రింది పోకచెక్క'

# సమీక్షా గ్రంథవివరాలు

| సంఖ్య | పుస్తకం పేరు | ప్రక్రియ | కర్త పేరు | సమీక్షా పత్రిక |
|---|---|---|---|---|
| 1. | చిందుక్రింది పోకచెక్క | నవల | విశ్వనాథ సత్యనారాయణ | భారతి |
| 2. | బ్రతికిన కాలేజీ | ,, | పాలగుమ్మి పద్మరాజు | ,, |
| 3. | గంటలు | కవితా సంపుటి | కరెడ్ల సత్యనారాయణమూర్తి | ,, |
| 4. | ఆరాధన | నవల | కోమలాదేవి | ఆంధ్రపత్రిక |
| 5. | రాగంలో రంగులు | నాటికా సంపుటి | ఇల్లిందల సరస్వతీదేవి | భారతి |
| 6. | హుసేన్‌సాగర్ | కథానికా సంపుటి | రేవసూరి శమంత | ,, |
| 7. | అకాండతాండవం | కవితా సంపుటి | బోయి భీమన్న | ఆంధ్రపత్రిక |
| 8. | కవితా పుష్పకం | ,, | దాశరథి | ,, |
| 9. | విరిగిన కలలు | నవల | ఉసమంచి రామకృష్ణ | భారతి |
| 10. | చీకటి నుంచి | కవితా సంపుటి | సూరంపాటి గంగాధరం | ,, |
| 11. | అక్షరాల గవాక్షాలు | ,, | సి. నారాయణరెడ్డి | ,, |
| 12. | జాతిరత్నం | కావ్యం | ,, | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| 13. | మధ్యతరగతి మందహాసం | కవితా సంపుటి | ,, | ఆంధ్రపత్రిక |
| 14. | పిచ్చేశ్వరరావు కథలు | కథానికా సంపుటి | అట్లూరి పిచ్చేశ్వరరావు | భారతి |
| 15. | మనసులో మనిషి | నాటికా సంపుటి | ,, | ,, |
| 16 | విన్నవీ కన్నవీ | వ్యాస సంపుటి | ,, | ,, |
| 17. | సోమరాజు కథలు | కథానికా సంపుటి | వంఛ సోమరాజు | ,, |
| 18. | విరిగిన కల్చర్ | కవితా సంపుటి | ,, | ,, |
| 19. | కారణఘాతుడు | కథానికా సంపుటి | మధురాంతకం రాజారాం | ,, |
| 20. | తాను వెలిగించిన దీపాలు | ,, | ,, | ఆంధ్ర వారపత్రిక |
| 21. | అత్తగారి కథలు (ప్రథమ సంపుటి) | ,, | భానుమతీ రామకృష్ణ | భారతి |
| 22. | అత్తగారి కథలు (ద్వితీయ సంపుటి) | ,, | ,, | ,, |
| 23. | ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి కథలు | ,, | ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి | ,, |
| 24. | గిరీశం ది గ్రేట్ సెకెండ్ స్టెప్ | నాటకం | పట్లమన్నాటి కుటుంబరావు | ,, |
| 25. | సాక్షి | ,, (సినిమాస్క్రిప్టు) | ముళ్ళపూడి వెంకటరమణ | ,, |
| 26. | అందని ఆదర్శం | నాటిక | కిలపర్తి అప్పారావు | ,, |
| 27. | సూర్యముఖి | నాటికా సంపుటి | స్ఫూర్తిశ్రీ | ఆంధ్రప్రదేశ్ |
| 28. | మాట తప్పకు | నాటకం | రావి వెంకటాచలం | ,, |
| 29. | నటనాలయం | ,, | మోదుకూరి జాన్సన్ | ఆంధ్ర వారపత్రిక |

| | | | |
|---|---|---|---|
| 30. గురజాడ | వ్యాస సంపుటి | శ్రీశ్రీ | ఆంధ్రపత్రిక |
| 31. తెలుగుబాటలు | " | ఇల్లిందుల సరస్వతీదేవి | భారతి |
| 32. ప్రజా ప్రభుత్వము | " | దిగవల్లి వేంకటశివరావు | ఆంధ్రవారపత్రిక |
| 33. ఆకాశజ్యోతి | కథానికా సంపుటి | చంద్రమౌళి | ఆంధ్రప్రదేశ్ |
| 34. సుగుణ | కథానిక | బలివాడ కాంతారావు | భారతి |
| 35. నీళ్ళు | కథానికా సంపుటి | పెద్దిభొట్ల సుబ్బరామయ్య | ఆంధ్రవారపత్రిక |
| 36. తిలక్ కథలు | " | బాలగంగాధరతిలక్ | " |
| 37. ఆనందభిక్షువు | కావ్యం | ఏ. వి. యల్. నరసింహారావు | ఆంధ్రప్రదేశ్ |
| 38. విజయముద్ర | కావ్యం | గాదేపల్లి కుక్కుటేశ్వరరావు | భారతి |
| 39. జ్యోత్స్నాభిసారిక | గేయనాటిక | నండూరి రామకృష్ణమాచార్య | ఆంధ్ర వారపత్రిక |
| 40. గోదావరి | గేయనాటిక | " | " |
| 41. విరహవీణ | కావ్యం | టి. రామకృష్ణారెడ్డి | భారతి |
| 42. జీవనగీత | అనువాద కావ్యం | కాళోజీ నారాయణరావు | ఆంధ్ర వారపత్రిక |
| 43. సంఘర్షణ | కవితా సంకలనం | యువరచయితల సమితి | " |
| 44. కొత్త గొంతుకలు | " | తెలుగు భాషా సమితి | " |
| 45. చితిచింత | కవితా సంపుటి | వేగుంట మోహనప్రసాద్ | ఆంధ్రపత్రిక |
| 46. మజిలీ | నవల | ఇచ్ఛాపురం రామచంద్రరావు | భారతి |

| | | | |
|---|---|---|---|
| 47. సామాన్యుడి కామన | నవల | హితశ్రీ | ,, |
| 48. అదృష్టచక్రం | ,, | హరికిషన్ | ,, |
| 49. స్వయంవరం | ,, | మహీధర రామమోహనరావు | ,, |
| 50. బంధమూ-అనుబంధమూ | ,, | పి. వి. కృష్ణమూర్తి | ,, |
| 51. అర్ధాంగి | ,, | ఉన్నవ విజయలక్ష్మి | ,, |
| 52. రథనిక | ,, | నటరాజ రామకృష్ణ | ఆంధ్రవారపత్రిక |
| 53. వాహిని | ,, | విహారి శాలివాహన | ఆంధ్రపత్రిక |
| 54. గ్రహణం విడిచింది | ,, | ద్వివేదుల విశాలాక్షి | భారతి |
| 55. వారధి | ,, | ,, | భారతి |